# ఆంధ్ర ప్రదేశ్
# సాధారణ అమ్మకపు పన్ను చట్టము
# 1957

చట్టంలోని అంశాల్ని సరళంగా పరిచయం చేసే
సంక్షిప్త వ్యాఖ్యానంతో సెక్షన్లు, రూల్సు, ఫారములు
షెడ్యూళ్ళతో సహా సమగ్రంగా తెలుగులో పరిచయ రూపం

నందివెలుగు ముక్తేశ్వరరావు యం.ఎ.,

ప్రచురణ:

**పొన్నూరు నాగేశ్వరరావు** (ఎకౌంటెంట్)

ఆలూరు (పోస్టు) : పొన్నూరు మండలం

గుంటూరు జిల్లా : (ఆం.ప్ర.)

మంచితనం

మమకారానికి

మారుపేరు

మానాన్న

'కీ.శే. కాశీ విశ్వనాథు' ని

పవిత్ర చరణాలకు

అంకితం

सत्यमेव जयते
GOVERNOR
ANDHRA PRADESH



RAJ BHAVAN
HYDERABAD-500041.

27th August, 1993

## MESSAGE

I am happy to note that Sri N.Mukteshwara Rao, a Government servant has taken pains to translate 'A.P.General Sales Tax Act 1957' into Telugu for the benefit of the business community as also for use of employees of the Government in their day to day discharge of duties.

I am sure the work will be beneficial to its users.

Krishan Kant

(KRISHAN KANT)

# ఆదరిస్తున్న మీకు సాదరంగా రెండవ ఎడిషన్

ఇప్పుడు . . . . . . .

ఆ.ప్ర.సా.అ.ప.చట్టము 1957, చాలా మారిపోయింది. రూపు రేఖలు గుర్తుపట్టలేనంతగా మారిపోయింది.

ఇప్పుడు . . . .

చట్టంలో సర్ చార్జి లేదు.

అదనపు పన్ను లేదు . . .

టర్నోవరు పన్ను కూడా లేదు . . . .

ఇవన్నీ ఏ దిశగా?

చట్టంలోని సంక్లిష్టతను తగ్గించడానికి, చట్ట నిర్మాణంలో ఉన్న స్థూల కాయాన్ని తగ్గించడానికి, చట్టం ప్రగతి శీలంగా మారడానికి,

మారుతున్న సరళీకృత ఆర్థిక రంగంలో ప్రగతిదాయకంగా చట్టాన్ని రూపకల్పన చేయాలన్న మహదాశయానికి ప్రతిరూపంగా 1-4-95 నుంచి అమల్లోకి వచ్చిన 22వ సవరణ ననుసరించి చట్టంలో చాలా కీలకమైన మార్పులు చోటు చేసుకున్నాయి. అన్నిటినీ మించి **'వ్యాట్'** (వ్యాల్యూయాడెడ్ టాక్సు) ను ప్రవేశ పెట్టడం జరిగింది.

ఈ మధ్యకాలంలో **'వ్యాట్'** వ్యాపార, అధికార యంత్రాంగంలో చాలా సంచలనాన్ని కల్గించింది. 'వ్యాట్' ఏ పూర్వ రంగంలో ప్రవేశ పెట్టబడింది? 'వ్యాట్' విషయంలో ఇతర ప్రాంతాల అనుభవాలేమిటి? మొదలైన విషయాలపై సమగ్రంగా చర్చ జరగడం అభిలషణీయం. యథార్థంగా ఈ దిశగా చర్చ జరగనే లేదు. ఆకాశం నుంచి "స్కైలాబ్" పతనాన్ని గురించి శాస్త్రవేత్తలు జోస్యం చెబితే ఎవరికనుకూలంగా వాళ్ళు 'Panic reaction' బిల్డప్ చేసుకున్న పరిస్థితి లాంటి పరిస్థితి నెలకొని ఉంది. అటు వ్యాపార వర్గాలు, ఇటు అధికార యంత్రాంగం 'Openness' తో చర్చించుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

చట్టంలో దాదాపు 1996 ఏప్రిల్ వరకు వచ్చిన ప్రధానమైన ఈ మార్పులన్నింటిని ఈ 'ఎడిషన్'లో పరిచయం చేస్తున్నాం. ముఖ్యంగా పుస్తకంలో ఒక ప్రత్యేక అనుబంధాన్ని రూపొందించాం. దానిని వ్యాపార వర్గాలకు ఇటీవలి కాలంలో వచ్చినమార్పుల్ని చేర్పుల్ని సవిస్తారంగా వాళ్ళలో సహజంగా తలెత్తే అనేక ఆసక్తికరమైన అంశాల్ని సమగ్రంగా, తేటతెల్లం చేసే రీతిలో రూపొందించడం జరిగింది ఈ అనుబంధంలో ప్రత్యేకంగా -

వ్యాట్ కోసం ఒక ప్రత్యే వివరణ చేర్చబడింది.

సమాజంలో బహుముఖ కోణాల్లో సామాజిక, వైయక్తిక జీవితాన్ని స్పృశిస్తున్న ఈ చట్టాన్ని ఓం ప్రథమంగా తెలుగులో అందించేందుకు శ్రీకారాన్ని చుట్టినప్పుడు, చాలా భయ సందేహాలున్నాయి. అయినా - ప్రగతికాములు, సహజ జిజ్ఞాసువులు అయిన సహృదయులైన తెలుగు వారందరూ దీన్ని ఆదరించారు. నాకు ఉత్సాహాన్ని, స్ఫూర్తిని కలిగించారు.

వీలైనంత నిర్దుష్టంగా దీన్ని రాసి అందించాలన్న ప్రయత్నంలో ఎంత వరకు కృతకృత్యుణ్ణయిందీ మీరే నిర్ణయించాలి. ఇందులో ఎక్కడైనా తప్పులు దొర్లి ఉంటే - మీరిచ్చే సూచనల్ని చాలా **సీరియస్** గా తీసుకుంటానని సవినయంగా మనవి చేస్తున్నాను.

రిటర్నులు సమర్పించడం దగ్గర నుంచి అసెస్‌మెంటు దాకా ఉన్నఅన్ని దశల్లో ఇది అందరికీ **చేదోడు వాదోడు** కాగలిగితే తెలుగులో చట్టానికి రూపకల్పన చేసిన ఈ ప్రయత్నం కృతార్థమైనట్టుగా భావిస్తాను.

ఈ ప్రయత్నాన్ని ఆదరిస్తున్న మీ అందరికీ అభివాదాలతో

మీ

అవసరాన్ని గురించి అంత పట్టించుకొన్నట్లు కన్పించదు. వాళ్ళకున్న సాధక బాధకాల్ని మాత్రమే చెప్పుకుంటున్నట్లు కన్పిస్తుంది. అన్ని రంగాల్ని అభివ్యక్తీకరించేందుకు అన్ని అనుపానులు ఈ భాషకు ఉన్నాయంటానికి విద్యా, ప్రత్రికా రంగాలు సజీవ సాక్ష్యాలుగా కన్పిస్తున్నా - గుర్తించే శక్తి లోపించడం స్పర్శ కోల్పోయిన చర్మ సదృశంగా కన్పిస్తుంది. ఇదంతా చూస్తుంటే మన వాదనలతో అవతలి వాడి నోరు మూయించగలమే గాని మనస్సు మూయించలేమన్న సుభాషితం గుర్తుకు రాకపోదు.

మనకెంత వాదనా పాండిత్యం ఉందో, అంతకు అంత నిబద్ధత తక్కువైంది. ఇదంతా చూసి అధికార భాషా సంఘం ఆ మధ్యన 'తెలుగులో ఆలోచించి, తెలుగులో రాయండి' అని గొంతెత్తి అరచి చెప్పాల్సి వచ్చింది. మన మస్తిష్కాలు ఇప్పటికీ ఎంత ఋణగ్రస్తంగా పరాయిదనం మీద నిలిచి ఉంటాయో చెప్పడానికిది మచ్చుతునక. అణు విజ్ఞానం, అంతరిక్షం లాటి అనల్ప విషయాల్ని ప్రకటించే శక్తి ఉన్నప్పుడు, బిన్న సాంకేతిక కారణాలతో స్వభాషా వినియోగం వినిమయాల్లో వెనుకబడటం మనలో నిబద్ధత (కమిట్‌మెంట్) లోపించడమే. రెవెన్యూ రికవరీ చట్టంలోని ఫారాలను, భూసేకరణ చట్టంలోని ఫారాలను గ్రామీణ జన సామాన్యాన్ని దృష్టిలో ఉంచుకొని ఇంగ్లీషు వాడంతటి వాడు తెలుగులో రూప కల్పన చేసి, అమలు చేస్తే మనం మాత్రం రాను రాను ఇంగ్లీషులోనే రాస్తూ పోతున్నాము. మనం పోతోంది ముందుకా? వెనక్కా? అన్న డైలెమ్మా కొత్తగా ఏర్పడుతోంది.

అయితే - ఈ ఫిలాసఫీ అంతటి వెనుక నేపథ్యంలో ఒక్క నిజం మాత్రం లేక పోలేదు. చట్టాలు, చట్టాల్లో రూపొందించిన అధికార గణం, వాటి తాలుకు పదజాలం ఇంగ్లీషులోనే వాడాల్సి వస్తోందన్న మాట చాలా వరకు నిజం. అసలే బ్యూరోక్రసీకి భయభక్తులు సహజ కవచకుండలాలు. చట్టాల్లోని సాంకేతిక పదజాలాన్ని కొంచెం స్వతంత్రించి వాడితే న్యాయపరంగా తలెత్తే సమస్యలకు జవాబుదారీ ఎవరనే భయం ఉండటం సహజం. అందుకే మన చట్టాలు, మాన్యువల్స్ అన్నీ తెలుగులోకి వెంటనే దిగిరావాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అప్పటిదాకా స్వభాషా వినిమయాన్ని గురించి ఎంత అరిచినా, ఎదురుగాలిలో పొలికేకలా వినాల్సిన వాడి చెవిన బడదు.

ఇలాంటి తాత్విక నేపథ్యంలో వీటిని అధిగమించేందుకు నా వంతుగా చేసిన కృషికి ప్రతిబింబం ఈ చిన్న పుస్తకం. తెలుగు, ఇంగ్లీషు, సంస్కృత సాహిత్యాల్లో చిన్నప్పట్నుంచి ఉన్న అంతో యింతో పరిచయం వల్ల వల్ల నాలో తెలీకుండానే చోటుచేసుకున్న 'అనువాద ప్రియత్వం లేదా' 'అనువాద లోలుపత్వం' కూడా కొంత ఈ ప్రక్రియలో సహకరించింది. ఆంధ్రప్రదేశ్ వాణిజ్యపన్నుల సర్వీసులో చేరిన దగ్గర్నుంచి తటస్థించిన ఆయాపదాలకు అనువాదాలు కనుక్కోవడం 'హాబీ' గా మారింది. తర్వాత చట్టం నుంచి "కోర్ వొకాబులరీ" తయారుచేసుకొని చట్టాన్ని మొత్తంగా తెలుగులోకి తీసుకురావడం జరిగింది.

వెనకటికీ ఒక పెద్దామె షేక్స్పియర్ నాటకాన్ని చూసి - ఓస్ ఇంతేనా! షేక్స్పియిర్ అంటే ఏమిటో అనుకున్నాను. ఇవన్నీ మేం రోజూ వాడుకొనే పదాలేగా అందిట. అలా అను నిత్యం జీవితాల్లో మెలిగే పదాలను వాడటం సృజనాత్మక కళారూపాల్లో సాధ్యమౌతుంది. కాని, శాస్త్రాల్లో ముఖ్యంగా చట్టాల్లో ఉండే సాంకేతిక పదజాలం అంతపటిష్టంగా, నిర్దుష్టంగానూ ఉండకతప్పదు కాబట్టి కొంత క్లిష్టత తప్పిందికాదు. అయినా - జన ప్రచారంలోకి వచ్చేసిన పదాల్ని మాత్రం ఏమాత్రం మార్చకుండా అలాగే ఉంచడం జరిగింది. దీనివల్ల పఠనీయత అంతగా కుంటుపడలేదనే అన్పిస్తోంది. చట్టంలో మౌలికాంశాల్ని కనీసం పరిచయం చేస్తే, వీలైనంత సాదాసీదాగా చెప్తే బహుజనోపయోగంగా ఉంటుందన్న ఆలోచన కారణంగా సరళంగా వ్యాఖ్యానాన్ని అందించటం జరిగింది. అధికార భాషా వినియోగాన్ని త్వరితం చేయాలన్న ఆంతర్యంతో పదకోశాన్ని ప్రత్యేకించి ఈ పుస్తకంలో అనుబంధంగా చేర్చడం జరిగింది.

# విషయ సూచిక

# ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను రూల్సు, 1957

## 1. సంగ్రహనామము, విస్తృతి మరియు ప్రారంభము :

(1) ఈ చట్టమును "ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపుపన్ను చట్టము, 1957" అని పేర్కొనవచ్చును.

(2) ఇది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము అంతటికి విస్తరించును.

(3) ఈ సెక్షను వెంటనే అమలు లోనికి వచ్చును మరియు చట్టము యొక్క మిగతా భాగము, ఆంధ్రప్రదేశ్ రాజ పత్రము నందు నోటిఫికేషను ద్వారా, రాష్ట్ర ప్రభుత్వము నియతము చేయునట్టి తేదీన అమలులోనికి వచ్చును.

## వ్యాఖ్యానము

*అమ్మకపుపన్ను చట్టము 1939 లో సంయుక్త మదరాసు రాష్ట్రములో మొదటి సారిగా ప్రవేశ పెట్టబడింది. మద్యపాన నిషేధాన్ని అమలు జరపాలని అప్పటి ప్రభుత్వం నిర్ణయించడం కారణంగా రాష్ట్ర ప్రభుత్వానికొచ్చే ఆదాయంలో లోటు ఏర్పడింది. ఆ లోటును భర్తీ చేయటం కోసం అమ్మకపు పన్నును విధిస్తూ చట్టాన్ని రూపొందించడం జరిగింది. అప్పట్లో అది కేవలం 0.5 శాతం మాత్రమే ఉండేది. అన్ని రకాల సరుకుల అమ్మకాలు చట్టం పరిధిలోకి తేబడ్డాయి. అయితే - వీటి నుంచి స్థిరాస్తుల అమ్మకాలు, చర్యాయోగ్యమైన క్లెయిములు, స్టాకులు, షేర్లు, సెక్యూరిటీలు మినహాయించబడ్డాయి. అంతేకాక వ్యవసాయ సంబంధమైన, ఉద్యానవన సంబంధమైన ఉత్పత్తులు కూడ ఉత్పత్తిదారు చేత అమ్మబడినట్లయితే-మినహాయింపబడ్డాయి.*

*ఆ చట్టం కమీషన్ ఏజెంట్లను రెండు రకాలుగా పరిగణించింది. స్థానికేతర కమీషన్ ఏజెంట్లకు ఎలాంటి మినహాయింపు సౌకర్యము యివ్వబడలేదు. స్థానికులైన డీలర్ల కమీషన్ ఏజెంట్లకు మాత్రం లైసెన్సు తీసుకొని లైసెన్సు ప్రకారం నియమ నిబంధనల్ని పాటిస్తే మినహాయింపు సౌకర్యం యివ్వబడింది.*

*ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు 1వ తేదీన ఏర్పడిన తరువాత అంతవరకు మద్రాసు సాధారణ అమ్మకపు పన్ను చట్టములో మార్పులతో సహా ఆంధ్ర రాష్ట్రానికి కూడా అనువర్తింప చేయటం జరిగింది. ఆంధ్రరాష్ట్రము తెలంగాణాతో సహా కలిసి ఆంధ్రప్రదేశ్‌గా అవతరించేదాకా చాలా మార్పులు ప్రవేశ పెట్టబడ్డాయి. వాటిని ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు.*

*(1) పూలు, గ్రుడ్లు, పండ్లు, కూరగాయలు మొదలైనవి 1954 లో మిహాయించబడినాయి.*

*(2) మిల్లు తయారీ వస్త్రాలు, విలువైన రాళ్ళపై కూడా మొదటి అమ్మకము స్థానంలో పన్ను విధించబడింది. ముడి పొగాకు మీద మొదటి కొనుగోలు పైన, పొగాకు ఉత్పత్తులైన సిగరెట్లు, చుట్టలు మొదలైన వాటిపై మొదటి అమ్మకం పైన ,1955లో పన్ను విధించడం జరిగింది.*

*1955లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వ ఆదాయాన్ని పెంచేందుకు, వ్యవసాయ ఉత్పత్తులపై పన్ను విధించేందుకు తీసుకోవాల్సిన చర్యల్ని సూచించేందుకు ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ మధ్యంతర నివేదికలో వరిధాన్యం, బియ్యం, పసుపు, జనపనారల మీద కొనుగోలు పన్ను విధించవచ్చునని సూచించింది. ఫలితంగా **ఆంధ్రప్రదేశ్ సాధారణ కొనుగోలు చట్టము, 1956** ఏర్పడింది.*

*ఇంతేకాక - అదే కమిటీ ఈ క్రింది సూచనల్ని కూడా చేసింది. (1) ఇతర రాష్ట్రాలకు ఎగుమతి అయ్యే వ్యవసాయ ఉత్పత్తుల పై కొనుగోలు పన్నును ఏక స్థానంలోనే విధించడం (2) అదనపు సింగిల్ పాయింట్ సరుకుల జాబితాను మరింత పెంచడం (3) భోగవస్తువుల జాబితాను గుర్తించి పెంచడం (4) గరిష్ఠ టర్నోవరును అనుసరించి పన్నుకు బాధ్యమయ్యేటట్లు చేయటం.*

పరిస్థితుల్లో వ్యాపారమే కానప్పుడు దానిని నిర్వహించే వ్య ులరు కూడా కాడు. ఈ పరిస్థితుల నేపధ్యంలో 'లాభార్జనం' లేక పోయినా ప్రధాన వ్యాపారానికి సహాయకంగా ఉండే, ఇన్సిడెంటల్‌గా (ఆనుషంగికంగా) ఉండే చర్యలను కూడా 'వ్యాపారం' పరిధిలోకి తేచ్చేందుకు వీలుగా *1-4-66* నుంచి దీనిని నిర్వచించడం జరిగింది.

వర్తకం, వాణిజ్యం, సాహసకృత్యం, తయారీ స్వభావాలున్న అన్ని విధాలైన చర్యల్ని, లావాదేవీల్ని ఈ నిర్వచనం అర్థపరిధిలోకి తేవడం జరిగింది. అంతేకాక ప్రదాన వ్యాపారానికి ఇన్సిడెంటల్‌గా (ఆనుషంగికంగా), సహాయకంగా ఉండే చర్యలన్నీ దీని పరిధిలోనికి తేబడ్డాయి. ఫలితంగా తయారీలో వాడబడగా మిగిలిన వ్యర్థ పదార్థముల అమ్మకాల వంటి ఇన్సిడెంటల్ (ఆనుషంగిక) చర్యలు కూడా దీని పరిధిలోనికి వచ్చాయి.

(సి) **"క్యాజువల్ ట్రేడరు"** అనగా ప్రిన్సిపల్‌గా గాని, ఏజెంటుగా గాని, లేక మరే ఇతర అర్హత యందుగాని రొక్కము కొరకు, లేక వాయిదా పడిన చెల్లింపు కొరకు, లేక ప్రతిఫలము, కమీషను కొరకు గాని, లేక ఇతర విలువైన మూల్యము కొరకు గాని రాష్ట్రము నందు సరుకులను కొనుట, అమ్ముట, సరఫరా చేయుట లేక పంపిణీ చేయటలు ప్రమేయముగా గల అప్పుడప్పుడు ఉండే వ్యాపార వ్యవహారములు గల వ్యక్తి అని అర్థము.

## వ్యాఖ్యానము

నంతలు, ప్రదర్శన కేంద్రాలు అప్పుడప్పుడూ జరిగినా - అందులో జరిగే వ్యాపారం మాత్రం పెద్ద ఎత్తునే ఉంటుంది. ఇవి కూడా ఒక్కొక్క తరుణంలో (సీజన్) మాత్రమే జరుగుతుంటాయి. అలాంటి సందర్భాల్లో వివిధ ప్రాంతాల నుంచి వచ్చే డీలర్లు తమ దుకాణాన్ని తెరచి -ఆకాల వ్యవధిలో మాత్రమే వ్యాపారం చేసి వెంటనే వెళ్ళిపోతారు. ముఖ్యంగా ఇలాంటి సందర్భాల్లో ఇతర రాష్ట్రాల నుంచి వచ్చిపోయే డీలర్లపై అదుపు చాలా కష్టమౌతుంది. దీనిని దృష్టిలో ఉంచుకొని వీరిని కూడా దీని పరిధిలోకి తెచ్చేందుకు అనువుగా ఈ నిర్వచనమేర్పడింది.

(డి) **"వాణిజ్య పన్నుల అధికారి"** అనగా 4వ సెక్షను క్రింద వాణిజ్య పన్నుల అధికారిగా నియమింపబడిన ఎవరైనా వ్యక్తి అని అర్థము.

## వ్యాఖ్యానము

ఈ అధికార వర్గం చట్టం పుట్టుక నాటి నుంచి ఉన్నారు. పాలనా సంబంధమైన, అప్పిలేటు పరమైన మరియు పున:పరిశీలన అధికారిగా చాలా అధికారాలు మొదట్లో దఖలు చేయబడ్డాయి. కాని ప్రస్తుతం *15* లక్షలు దాటిన డీలర్ల పై అసెస్‌మెంట చేసే అథారిటీగా మాత్రమే వ్యవరిస్తున్నారు.

(డిడి) **"కమీషనరు"** అనగా 4వ సెక్షను క్రింద వాణిజ్య పన్నుల కమీషనరుగా నియమింపబడిన ఎవరైనా వ్యక్తి అని అర్థము.

(ఇ) **"డీలరు"** అనగా రొక్కమునకు గాని లేక వాయిదా పడిన చెల్లింపునకు గాని లేక కమీషను కొరకు గాని లేక ప్రతిఫలము కొరకు గాని లేక ఇతర విలువ గల మూల్యము కొరకు గాని సరుకులను కొనుట, అమ్ముట, సరఫరా చేయుట లేక సరుకులను పంపిణీ చేయుట లేక హైర్‌పర్చేజ్ లేక వాయిదాల ద్వారా చెల్లించే ఏ పద్ధతిపై నైనా సరుకులను బట్వాడా చేయుటలేదా ప్రత్యక్షముగా గాని మరే విధముగానైనా పదార్థముల వాడకము, లేక సరఫరాతో ప్రమేయమున్న ఏదైనా వర్క్స్ కాంట్రాక్టును కొనసాగించుట లేదా నిర్వహించుట చేయునట్టి వ్యాపారమును కొనసాగించునట్టి ఏ వ్యక్తియైనా అని అర్థము మరియు

(i) అట్టి వ్యాపారమును కొనసాగించెడి లోకల్ అథారిటీ, కంపెనీ, హిందూ అవిభక్త కుటుంబము లేక సహకార సొసైటీతో సహా ఏదైనా సొసైటీ, క్లబ్, ఫరమ్ లేక అసోసియేషను,

(యఫ్) **"డిక్లేరడ్ సరుకులు "** అనగా కేంద్ర అమ్మకపు పన్ను చట్టము, 1956 (1956 నందలి 74వ కేంద్ర చట్టము) యొక్క 14వ సెక్షను క్రింద అంతర్ రాష్ట్రీయ వర్తక లేక వాణిజ్యమందు ప్రత్యేక ప్రాధాన్యమున్న సరుకులుగా డిక్లేర్ చేయబడిన సరుకులు అని అర్థము.

## వ్యాఖ్యానము

*కేంద్ర అమ్మకపు పన్ను చట్టం 14వ సెక్షను కొన్ని సరుకులను అంతర్ రాష్ట్రీయ వర్తక వాణిజ్యాల్లో ప్రత్యేక ప్రాధాన్యం కలవిగా గుర్తించింది. వాటిని డిక్లేరడ్ గూడ్స్ (ప్రకటిత సరుకులు)గా పేర్కొన్నది. వీటిపై రాష్ట్ర ప్రభుత్వానికి పన్ను విధించే అధికారం కే.అ.ప. చట్టం 15 వ సెక్షనులో పేర్కొన్న షరతులు, పరిమితులకు లోబడియుంటుంది. వీటి పన్నురేటు, విధింపు, చెల్లింపు వంటి విశేషాలు ఆ.ప్ర.సా.అ.ప. చట్టము 6వ సెక్షను, మూడవ షెడ్యూలు, 17-డి, 27-ఎ రూల్సులోను ప్రస్తావించబడినవి.*

(యఫ్ -1) **'ఉపవాణిజ్య పన్నుల అధికారి'** అనగా 4 వ సెక్షను క్రింద ఉప వాణిజ్య పన్నుల అధికారిగా నియమించబడిన ఎవరైన వ్యక్తి అని అర్థము.

(జి) **'ఉపకమీషనరు'** అనగా 4 వ సెక్షను క్రింద వాణిజ్య పన్నుల ఉపకమీషనరుగా నియమించబడిన ఎవరైనా వ్యక్తి అని అర్థము.

(హెచ్) **సరుకులు** అనగా చర్యాయోగ్యమైన క్లెయిములు, స్టాకులు, షేర్లు మరియు సెక్యూరిటీల కన్నా ఇతరమైన అన్ని రకముల చరాస్తి అని అర్థము మరియు వర్క్సు కాంట్రాక్టు యొక్క నిర్వహణము నందు సరుకులుగా గాని మరో రూపంగా గాని ప్రమేయము గల సరుకులు లేదా చర లేక స్థిరాస్తుల యొక్క నిర్మాణము, అమరిక, పెంపు, మరమ్మత్తు కొరకు వాడిన లేక వాడబడే సరుకులన్నిటితో సహా అన్ని పదార్థములు, పరికరములు, వస్తువులు ఇందుచేరియుండును మరియు అమ్మకమునకు ముందుగా గాని లేక అమ్మకము కాంట్రాక్టు క్రింద గాని విచ్ఛేదనమునకు అంగీకరింపబడినట్టి అన్ని పెరుగుతున్న పైరులు, గడ్డి మరియు భూమికి అంటుకొని యున్న లేక భూమిలో భాగముగా యున్న అన్ని పదార్థములు కూడా ఇందు చేరియుండును మరియు **'మోటారు స్పిరిటు'** కూడా ఇందు చేరియుండును.

విశదీరణము : 'మోటారు స్పిరిటు' అనగా తనంతట తానుగాని, ఇతర పదార్థముల సమ్మిశ్రమముతో గాని ఆటోమోటివ్ లేక స్టేషనరీ ఇంటర్నల్ కంబష్టను ఇంజనులకు ప్రత్యక్షముగా గాని పరోక్షముగా గాని హేతుబద్ధముగా సమర్థ ఇంధనమును సమకూర్చుటకు సాధారణముగా వాడబడు ఏదైనా పదార్థము అని అర్థము మరియుదీనియందు **పెట్రోలు, డీజిల్ ఆయిల్ మరియు ఇతర ఇంటర్నల్ కంబష్టన్ ఆయిల్స్ చేరియుండును.** కాని దీనియందు **పవర్ ఆల్కహాల్, కిరోసిన్, ఫర్నేసు ఆయిల్, కోల్ లేక చార్ కోల్‌లు చేరియుండవు.**

(హెచ్-1) **'సరుకుల వాహనము'** అనగా సరుకులను మోసుకొని పోవుటకు వీలుగా నిర్మితమైన లేక మార్పు చేయబడిన ఏదైన మోటారు వాహనము లేదా అట్లు నిర్మితము కాకున్ననూ లేక మార్పు చేయబడకున్నను కేవలము సరుకులను మోసుకొని పోవుటకు లేదా ప్రయాణీకులకు అదనముగా సరుకులను మోసుకొనిపోవుటకు వాడినప్పుడు యే ఇతర మోటారు వాహనమైనను అని అర్థము.

(హెచ్ -2) **'సంయుక్త కమీషనరు'** అనగా 4వ సెక్షను క్రింద వాణిజ్య పన్నుల సంయుక్త కమీషనరుగ నియమింపబడిన ఎవరైనా వ్యక్తి అని అర్థము.

(ఐ) **'లైసెన్సు'** అనగా ఈ చట్టము క్రింద అనుదానము చేయబడిన లేక రెన్యూ చేయబడిన లైసెన్సు అని అర్థము.

(ఐ-1) **'మిల్లరు'** అనగా ఏదైనా బియ్యము మిల్లు, నూనెమిల్లు, పప్పుమిల్లు, అంపపు మిల్లు, జిన్నింగ్ మిల్లు లేక

## వ్యాఖ్యానము

'ప్రెస్క్రైబ్ చేయబడిన' అన్న పదం చట్టం అంతటా వాడబడుతుంది. దేనిచేత ప్రెస్క్రైబ్ చేయబడినది అన్నదానికి ఈ భాగం సమాధానం చెప్తోంది. చట్టము యొక్క 39వ సెక్షను ప్రకారం 'రూల్సు'ను రూపొందించేదుకు అధికారమివ్వబడింది. అట్లా సంక్రమించిన 'రూల్సు' ద్వారా ప్రెస్క్రైబ్ అయ్యే వాటినన్నిటినీ ఈ అర్థపరిధిలోనికి తేవచ్చును. చట్టంలో ఉండే సెక్షన్లు సాధారణంగా అధికార పరిధిని, నిర్వచనాలను, అమలుచేసే యంత్రాంగాన్ని, పన్ను అసెస్‌మెంటు, పన్ను విధింపు, పన్ను వసూలు, రిజిస్ట్రేషను వంటి ముఖ్యమైన విషయాలను స్పష్టీకరిస్తాయి. ఈ చట్టం క్రింద రూపొందే 'రూల్సు' మాత్రం మరింత సూక్ష్మంగా వివరాలను పేర్కొని, విధి, నిషేధాలను, పరిధులను స్పష్టము చేస్తాయి. అట్లా పేర్కొన్న విషయాలను 'ప్రెస్క్రైబ్ చేయబడినట్లుగా' చట్టం భావిస్తుంది.

(యమ్) **'రిజిస్టర్డు డీలరు'** అనగా ఈ చట్టము క్రింద రిజిస్టరయిన డీలరు అని అర్థము.

## వ్యాఖ్యానము

పన్ను వసూలుకు సౌకర్యార్థంగా డీలర్లును గుర్తించేందుకు రిజిస్టరు చేయడం ప్రాథమికంగా ఏర్పడినా డీలర్లు చట్టం తాలూకు సదుపాయాల్ని అంటే మినహాయింపులు, రాయితీలు, చట్ట విహితమైన ఫారాలు వంటి వాటిని పొంద డానికి ఎంతో వీలు ఏర్పడింది.

(యమ్-యమ్) **'రిటైల్ డీలరు'** అనగా సంబంధిత అసెస్‌మెంటు సంవత్సరము నందు డీలర్ల కన్నా భిన్నమయిన వ్యక్తులకు మాత్రమే సరుకుల అమ్మకము ద్వారా అయినది మరియు 10 లక్షల రూపాయిలకు మించని మొత్తము టర్నోవరు కలిగిన డీలరని అర్థము.

## వ్యాఖ్యానము

'రిటైల్ డీలరు' ను స్పష్టంగా నిర్వచించటం జరిగింది. వ్యాట్ క్రమంలో 'రిటైల్‌డీలరు' కు పన్ను బాధ్యత లేదు. రిటైలు డీలరు డీలర్లకు విక్రయించరాదు. అంటే అతను సరాసరి వినియోగదారులకు మాత్రమే సరుకులను అమ్మాలి. రిటైల్ డీలరుకు టర్నోవరు పరిమితి కూడా విధించడం జరిగింది. అది 10 లక్షల రూపాయిలకు మించరాదు. టర్నో వరు పరిమితిని దాటినా, అతను సరుకులను వినియోగదారులకు కాకుండా డీలర్లకు అమ్మినా వ్యాట్ పరిధిలోనికి వస్తాడని భావించాల్సి ఉంటుంది.

(యన్) **'అమ్మకము'** అనగా వ్యాకరణాత్మకమైన వైవిధ్యములు మరియు సజాతీయత గల వ్యక్తీకరణలన్నింటితో సహా ఒక కాంట్రాక్టు ననుసరించి లేక మరేవిధంగా నైనను సరుకుల రూపమైన ఆస్తిని అట్టి సరుకులుగా గాని లేక మరేరూపముగా నైనా గాని రొక్కము కొరకు లేక వాయిదాపడిన చెల్లింపు కొరకు లేక ఏ ఇతర విలువైన మూల్యము కొరకు వర్తక లేక వ్యాపారక్రమములో ఒక వ్యక్తి చేత మరొకరికి లేదా సహకార సంస్థతో సహా ఒక సొసైటీ, క్లబ్, ఫరమ్ లేక అసోసియేషన్ చేత తన సభ్యులకు సరుకుల సరఫరా లేక పంపిణీ యందు చేయబడే ప్రతి బదిలీ అని అర్థము. కాని సరుకుల మార్టిగేజ్, హైపోథికేషన్, ప్లెడ్జి లేక చార్జిలు ఇందు చేరి యుండవు.

**I వ విశదీకరణము:** అమ్మకం దారుడు ధర చెల్లింపు కొరకు సెక్యూరిటీగా సరుకులందు గల స్వామ్యహక్కును ఉంచుకొనుట వాస్తవమే అయినప్పటికి హైర్ పర్చేజ్ లేక వాయిదాల ద్వారా చెల్లింపు యొక్క ఏ విధానముపైనైనా సరుకులను బట్వాడా చేయుట అమ్మకముగా భావించబడును.

**IIవ విశదీకరణము :**

(ఎ) భారత సరుకుల అమ్మకపు చట్టము, 1930 (1930లో III వకేంద్ర చట్టము) నందు ఏమున్నప్పటికిని అమ్మకము లేక కొనుగోలు కాంట్రాక్టు ఎక్కడ జరిగినను సరుకులు రాష్ట్రమందు ఉన్నట్లయితే ఈ చట్టము ప్రయోజనార్థమై

వ్యక్తిచేత ఆ సరుకుల అమ్మకము చేయబడినట్లు భావించబడును.

**VIవ విశదీకరణము:** -ఎప్పుడైననూ ఏవైనా సరుకులు ఒక వర్క్స్ కాంట్రాక్టు నిర్వహణము నందు సరఫరా చేయబడినప్పుడు లేక వాడబడినప్పుడు, అట్టి వర్క్స్ కాంట్రాక్టు నిర్వహణ క్రమమునందు అట్లు సరఫరా చేయబడిన లేక వాడబడిన సరుకుల విలువ ప్రత్యేకముగా చూపబడినను లేకున్ననూ మరియు అట్టి సరుకులు లేక పదార్థము యొక్క విలువకాంట్రాక్టు ఫర్ సర్వీసు మరియుచేసిన వర్క్ నుంచి విడదీయగలిగినను లేక పోయినను అట్టి సరుకుల రూపమైన ఆస్తి బదిలీ ఉన్నట్లుగానే భావింపబడును.

**VII వ విశదీకరణము:** -సరుకుల అమ్మకపు చట్టం, 1930 నందు ఏమున్నప్పటికిని, 'లక్కీ గిఫ్ట్ స్కీము'గా లేక మరే ఇతర పేరుతో వ్యవహరిపంబడినప్పటికిని ఏదైనా స్కీము క్రమమునందు, అట్టి స్కీమును నడుపుచున్నవ్యక్తిచేత ఆ స్కీముకు చందాదారుగా నున్న ఏ ఇతర వ్యక్తికైననూ ఏ సరుకులైననూ బదిలీ చేయబడినట్లయితే, ఈ చట్ట ప్రయోజనార్థమై సరుకుల అమ్మకము లేక కొనుగోలు జరిగినట్లు భావించబడును.

**అయితే** - ఆ స్కీము యొక్క యజమానిచేత అమ్మబడుటకు అంగీకరింపబడిన లేక అతని చేత నిర్వహించ బడిన డ్రాలో విజేతకు ఇవ్వబడుటకు లేక అమ్మబడుటకు అంగీకరింపబడిన ఏదైనా వస్తువు యొక్క ధర కొరకు క్రమ వ్యవధులతో గాని లేక మరేవిధముగానైననూ ఒక నిర్దిష్ట మొత్తము చెల్లించుటకు ఆ స్కీము యొక్క అందరు చందా దారులు అంగీకరించబడి యుండవలెను మరియు డ్రాల సిరీస్ ముగిసే వరకూ చందా దారుని చేత బహుమతి గెలుచుకోబడనట్లయితే ఎంత మొత్తము అతని చేత చెల్లింపబడవలసి యుండునో ఆ మొత్తమంతయూ ఈ విశదీకరణము ప్రయోజనార్థము టర్నోవరుగా భావింపబడును.

**VIII వ విశదీకరణము :** - కేంద్ర ప్రభుత్వము లేక రాష్ట్ర ప్రభుత్వము చేత రొక్కము కొరకు లేక వాయిదా పడిన చెల్లింపు కొరకు లేక మరే ఇతర విలువైన మూల్యము కొరకు వ్యాపారక్రమము నందైననూ కాకున్ననూ చేయబడు ప్రతి సరుకుల రూపమైన ఆస్తియొక్క బదిలీ ఈ చట్ట ప్రయోజనార్థము అమ్మకముగా భావించబడును.

## వ్యాఖ్యానము

*చట్టం మొత్తం మీద ఇది అతికీలకమైన నిర్వచనం. మొదట్లో ఈ నిర్వచనం చాలా సాదా సీదాగా, స్పష్టంగా ఉండేది. 'అమ్మకాన్ని' నిర్వచించిన ప్రాథమిక చట్టం 'సరుకుల అమ్మకపు చట్టం' (సేల్ ఆఫ్ గూడ్స్ యాక్ట్) దాదాపు అందు మాదిరిగానే సరిసమానంగా ఉండేది. కాని రెండు కారణాలవల్ల విశిష్టమైన మార్పులు వచ్చాయి.*

*(1) ప్రభుత్వం తన ఆదాయ వనరులను సమీకరించుకొనేందుకు మరింత విస్తృతం చేయడం.*

*(2) వివిధ తీర్పుల కారణంగా ఏర్పడిన ఇబ్బందుల్ని అధిగమించేందుకు ప్రత్యేక సవరణలు చేయడం, ఏతావాతా మొత్తం మీద అర్థవిస్తృతి పెరిగి చట్టంలోనే ఇది అతి పెద్ద నిర్వచనంగా రూపు దిద్దుకొన్నది.*

*అమ్మకం నిర్వచనం మొదటిగా రోమన్ న్యాయశాస్త్రం నుంచి స్వీకరించబడింది. ఇందులో ఒక వ్యక్తి తన ఆస్తిని ఏదైనా మూల్యానికి వేరొక వ్యక్తికి బదిలీ చేయడము ప్రధానం. దీనినే విస్తరించి సరుకుల అమ్మకపు చట్టం పేర్కొన్నది.*

*1) అమ్మకం అనేది ఒప్పందం లేదా కాంట్రాక్టు (2) ఈ కాంట్రాక్టు నిరపేక్షంగా ఉండవచ్చు లేదా షరతులతో ఉండవచ్చు. (3) ఇందులో సరుకుల రూపమైన ఆస్తిని స్వంతదారు కొనుగోలు దారు అంగీకరించబడిన మూల్యానికి బదిలీ చేయడం జరుగుతుంది. (4) ఇందు నిమిత్తం ఉభయ పక్షాలు వ్రాతపూర్వకంగా గాని లేదా పరోక్షంగా గాని కాంట్రాక్టును కుదుర్చుకొన్నట్లు భావించబడుతుంది. మొత్తం మీద సారాంశ రూపంగా ఈ క్రింది అంశాలున్నట్లైతే అమ్మకం జరిగినట్లు లేదా ఉన్నట్లు భావించబడుతుంది.*

(iv) ఏదైనా సరుకులను వాడుకొనే హక్కును ఏ ప్రయోజనము కొరకైనను నిర్దిష్ట కాలవ్యవధి కొరకైనను కాకున్నను, రొక్కము, వాయిదా పడిన చెల్లింపు లేక ఇతర విలువైన మూల్యము కొరకు బదిలీ చేయుటపై పన్ను,

(v) ఏదైనా అన్ ఇన్ కార్పొరేటెడ్ అసోసియేషన్ లేక వ్యక్తుల సంఘటన చేత దాని యొక్క సభ్యునికి రొక్కము, వాయిదా పడిన చెల్లింపు లేక ఇతర విలువైన మూల్యము కొరకు చేయు సరుకుల సరఫరాపై పన్ను, లేదా

(vi) ఏదైనా సర్వీసు రూపముగా గాని లేక సర్వీసులో భాగంగా గాని లేక ఏమయినప్పటికి ఏ విధానము నందైనా ఆహారముగా లేక మానవ వినియోగము కొరకైన ఏదైనా ఇతర పదార్థముగా సరుకుల లేదా మత్తును కలిగించునదైననూ లేదా కలిగించనిదైననూ అయిన ఏ పానీయం యొక్క సరఫరాపైనైనా, అట్టి సరఫరా లేక సర్వీసు రొక్కము, వాయిదా పడిన చెల్లింపు లేక ఇతర విలువైన మూల్యము కొరకైనపుడు పన్ను ఇందుచేరి యుండును.

## వాఖ్యానము

*'పన్ను' అనే పదం కూడా ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టంలోనే నిర్వచించబడింది. దీనికి మాతృకగా ఉన్న మద్రాసు చట్టంలో ఇది నిర్వచించబడలేదు. అమ్మకాల మీద లేదా కొనుగోళ్ల మీద చెల్లించదగిన దానిని పన్నుగా పేర్కొనబడాలని ఈ నిర్వచనం తెలియచేస్తోంది. ఏది విధించబడుతుందో అది చెల్లించ దగినది అవుతుంది అని అర్థాన్ని అన్వయించుకోవాల్సి ఉంటుంది. 46వ రాజ్యాంగ సవరణ, తదుపరి చట్టంలో సవరణ ఆధారంగా వర్క్స్ కాంట్రాక్టులు, హైర్ పర్చేజ్ అమ్మకాలు, హొటళ్ళు సర్వీసులు కూడా అమ్మకాల పరిధిలోకి రావడం వల్ల వాటిపై చెల్లించ దగిన పన్ను కూడా దీని అర్థ పరిధిలోనికి వస్తుందని అర్థం చెప్పుకోవాలి.*

**(ఆర్) 'మొత్తము టర్నోవరు'** అనగా ఒక డీలరు యొక్క రాష్ట్రమందున్న అన్ని వ్యాపార ప్రదేశములందు అన్ని సరుకుల యందు టర్నోవరు వెరసి- 'మొత్తము టర్నోవరు' అనబడును. అట్టి టర్నోవరు మొత్తము లేక అందు ఏ భాగమైననూ పన్నుకు బాధ్యము కావచ్చును, కాకపోవచ్చును. అంతర్ రాష్ట్రీయ వర్తక లేక వాణిజ్య క్రమమునందు లేదా భారతదేశపు సరిహద్దునకు వెలుపలకు సరుకుల ఎగుమతి క్రమం నందు లేదా భారతదేశపు సరిహద్దులోనికి సరుకుల దిగుమతి క్రమంనందు అమ్మకములు లేదా కొనుగోళ్ల టర్నోవరులు కూడా ఇందు చేరి యుండును.

## వ్యాఖ్యానము

*దీనిని సాధారణంగా వా.ప.శా. వర్గాల్లో మొత్తము టర్నోవరుగా వ్యవహరిస్తూ ఉంటారు. మొత్తము టర్నోవరు లో ఈ క్రిందివన్నీ చేరి ఉంటాయి.*

*1) 5వ సెక్షను క్రింద పన్నుకు బాధ్యమయ్యే అమ్మకాలు.*

*2)6వ సెక్షను క్రింద పన్నుకు బాధ్యమయ్యే అమ్మకాలు.*

*3) 1,2,3 షెడ్యూళ్ళలో ప్రతి అంశమునకు ఎదురుగా పేర్కొన్న స్థానం కన్నాభిన్నమైన స్థానాల్లో అమ్మకాలు.*

*4) 4వ షెడ్యూలులోని సరుకుల అమ్మకాలు*

*5) కే.అ.ప. చట్టం తాలూకు అమ్మకాలు.*

*6) అంతర్ రాష్ట్రీయ అమ్మకాలు.*

*సాధారణంగా డీలరు ఏ మేరకు పన్నుకు బాధ్యుడౌతాడన్నది నిర్ణయించడానికి అతని మొత్తము టర్నోవరు నిర్ణయించబడాలి.*

(బి) అమ్మిన సరుకులకు సంబంధించి సరుకుల బట్వాడా సమయమున లేదా ముందుగా గాని చేయబడిన ఏ క్రియకైనను డీలరుచేత చార్జి చేయబడిన ఏదైనా ఇతర మొత్తము;

(సి) డీలరు చేత చార్జి చేయబడిన ఏ ఇతర మొత్తమైనను, వాటి వర్ణన, పేరు లేక లక్ష్యము ఏమైనప్పటికిని; మరియు

(డి) 5-సి సెక్షను క్రింద చార్జి చేయబడిన లేదా 5- ఇ సెక్షను క్రింద వసూలు చేయబడు మొత్తముల వెరసి ఇందు చేరియుండును.

అయితే - యజమానిగా గాని, ఫలసాయానుభవ తనఖాదారుగా గాని, కౌలుదారుగా గాని లేక మరే విధముగా నైనా ఆసక్తిగల భూమియందు పెంచబడిన లేదా తన చేత స్వయముగా పెంచబడిన వ్యవసాయిక లేదా ఉద్యానవన ఉత్పత్తులను తాను స్వయంగా గాని లేక ఏజెంటు ద్వారా గాని అమ్మదలచిన వ్యక్తి విషయమునందు అట్టి ఉత్పత్తి, వినియోగమునకు అర్హమగునట్లు చేయుటకు కేవలం శుభ్రము చేయుట, శ్రేణీకరించుట లేక రకాల వారిగా విడదీయుట కన్నా భిన్నమైన ఎటువంటి భౌతిక, రసాయనిక లేక ఇతర క్రియలకు లోబడకుండా ఏ రూపంలో ఉత్పత్తి అయినదో ఆ రూపంలోనే అమ్మినప్పుడు, అట్టి అమ్మకమునకు సంబంధించిన మూల్యపు మొత్తము అతని టర్నోవరు నుండి తీసివేయబడవలెను.

విశదీకరణము : -ఇందు నిమిత్తము ప్రెస్క్రైబ్ అయ్యే అట్టి షరతులకు మరియు పరిమితులకు, ఏవయినా ఉన్నట్లయితే, వానికి లోబడి

(i) ఏదైన అమ్మకమునకు సంబంధించి ధరపై అనుమతించబడిన ఏదైనా రొక్క లేక ఇతర రూపమైన ముదరా మరియు ఖాతాదారుల చేత త్రిప్పి పంపబడిన సరుకులకు సంబంధించి వాపసు ఇవ్వబడిన మొత్తము టర్నోవరు నందు చేర్చబడరాదు.

(ii) ఒక ప్రత్యేక ఖాతాదారును సర్దుబాటు చేసేందుకు వేరొక డీలరు నుండి సరుకులను పొంది మరియు ఆ డీలరు సదరు ఖాతాదారునకు తక్షణమే అమ్మినట్లయితే అట్టి సరుకులకు సంబంధించిన అమ్మకము అనంతర డీలరు యొక్క టర్నోవరు నందు చేర్చబడవలెను, కాని మొదటి వానికి సంబంధించిన టర్నోవరు నందు కాదు.

## వ్యాఖ్యానము

టర్నోవరును నిర్ణయించడమే శాఖవారు తీసుకొనే ప్రాథమిక చర్య. దీనిని బట్టే పన్ను అసెస్‌మెంటు, విధింపు ఉంటాయి. ఇక్కడ డీలరు యొక్క టర్నోవరును నిర్వచించడం జరిగింది.

1)సాధారణంగా డీలరు అమ్మకాల బిల్లుల్లో సూచించే మొత్తం టర్నోవరుగా భావించబడుతుంది. అయితే - ఎంత మొత్తానికి అమ్మకం జరిగిందీ అమ్మకం బిల్లు సరిగా చూపించనపుడు గాని, బిల్లే జారీ చేయనపుడు గాని టర్నోవరును అసెసింగ్ అథారిటీ నిర్ణయిస్తాడు.

కొన్ని సందర్భాలలో డీలరు చేత కొనుగోళ్ళు లేదా అమ్మకాలు ప్రత్యక్షంగా జరగవచ్చు లేదా మరెవరి ద్వారానైనా జరగవచ్చు లేదా తన ఖాతాలో గాని లేదా ఇతరుల నిమిత్తంగా గాని జరగవచ్చు. వాటన్నిటినీ డీలరు టర్నోవరుగానే వ్యవహరించు కోవాలని 1985 నుంచి వచ్చిన సవరణ స్పష్టం చేస్తోంది. అయితే అసెసింగ్ అథారిటీ కొనుగోళ్లు లేక అమ్మకాల మూల్యాన్ని లేదా వస్తువుల విలువలను కూడా నిర్ణయించేందుకు అస్కారమ్విబడింది.

ఇవేకాక వర్క్స్ కాంట్రాక్టులు, వాయిదా చెల్లింపుల ద్వారా గాని మరేవిధంగా అద్దె కొనుగోలు సరుకుల విలువ మూల్యాన్ని నిర్ణయించి టర్నోవరుగా పరిగణించవచ్చు.

(iii) చైర్మనుతో సహా చైర్మనుకత స్థాపించబడిన వేరొక సభ్యునితో కూడిన ధర్మాసనము చేత కాని, లేక

(iii - ఎ) చైర్మను సెలవు కారణంగా గైరుహాజరయినప్పుడు లేదా బదిలీ అయినప్పుడు లేదా మరియే ఇతర కారణముల చేతనైనా చైర్మను కార్యస్థానము ఖాళీగా యున్నప్పుడు తక్కిన యిద్దరు సభ్యులతో కూడిన ధర్మాసనము చేత కాని, లేక

(iv) 5 లక్షలకు దాటని టర్నోవరు గల కేసులందు చైర్మనుతో స్థాపించబడిన ట్రిబ్యునలు యొక్క ఏక సభ్యునితో కాని నిర్వర్తింపబడవచ్చును.

విశదీకరణము : –(iv) వ అంశము నందు పేర్కొనబడిన ఏక సభ్యుడు స్వయముగా చైర్మను గాని లేదా యే ఇతర సభ్యుడు గాని కావచ్చును.

(బి) అప్పిలేటు ట్రిబ్యునలు యొక్క ముగ్గురు సభ్యులు ఒక అప్పీలును లేదా దరఖాస్తును విచారించినప్పుడు అట్టి ఏ అంశము లేక అంశములపైనైనా సభ్యులు విభేదించినప్పుడు అట్టి అంశము లేక అంశములు మెజారిటీ అభి ప్రాయము ప్రకారము నిర్ణయించబడవలయును.

(సి) ఇద్దరు సభ్యులతో కూడిన ధర్మాసనము చేత ఏదేని అప్పీలు లేక దరఖాస్తు విచారింపబడినప్పుడు - అట్టి ధర్మాసనము నందు చైర్మను సభ్యుడైనప్పటికి కానప్పటికి ఏదేని ఒక అంశము లేక అంశములపై సభ్యులు విభేదించినపుడు అట్టి అంశము లేక అంశములు మొత్తము ముగ్గురు సభ్యులతో కూడిన అప్పిలేటు ట్రిబ్యునలునకు పంపబడవలయును.

(డి) చైర్మను కానట్టి ఏక సభ్యుని ముందు లేక చైర్మను సభ్యుడు కాని ధర్మాసనము ముందు కాని చట్ట పరమైన ప్రశ్న ప్రమేయము గల ఏ కేసునైనా అట్టి ఏక సభ్యుడు లేక ధర్మాసనము తన విచక్షణాధికారము ననుసరించి చైర్మను సభ్యుడుగా గల ధర్మాసనము చేత నిర్ణయము కొరకు అట్టి కేసును రిజర్వు చేయవచ్చును.

(3ఎ) (ఎ) (1) వ సబ్-సెక్షను నందు ఏమున్నప్పటికినీ, ప్రభుత్వము ఏ సమయమునందైనా ఉత్తర్వు ద్వారా ఇద్దరు సభ్యులతో, వారిలో ఒకరు జిల్లా జడ్జి గ్రేడ్-II అయ్యుండి మరియు మరియొకరు రాష్ట్రప్రభుత్వము యొక్క వాణిజ్యపన్నుల శాఖలో సంయుక్త కమీషనరు స్థాయికి తగ్గని అధికారి అయ్యుండవలెను. ట్రిబ్యునలు యొక్క అదనపు ధర్మాసనమును వారు దానియందే నిర్దిష్టపరచు నట్టి వ్యవధి కొరకు మరియు అట్టి ప్రదేశము వద్ద నిర్వర్తించుటకు స్థాపించవచ్చును.

(బి) ఏదయినా అంశము లేక అంశములను విచారించుటలో అదనపు ధర్మాసనము యొక్క సభ్యులు సమానముగా విభేదించనపుడు వారు దేనిపై విభేదించుచున్నరో ఆ అంశము లేక అంశములను పేర్కొనవలెను మరియు స్వయముగా ఆ అంశము లేక అంశములను ఆ మీదట విచారించు చైర్మనుకు రెఫరెన్సు చేయవలెను మరియు చైర్మను మరియు ధర్మసనము యొక్క సభ్యులు ఆ కేసును విచారించి సదరు అంశము లేక అంశములను మెజారిటీ అభిప్రాయము ప్రకారం నిర్ణయించవలెను.

(సి)(4)వ సబ్-సెక్షను క్రింద చేయబడిన రెగ్యులేషన్సు ఈ సెక్షను క్రింద స్థాపించబడిన ధర్మాసనమునకు కూడా వర్తించును.

(4) రాష్ట్ర ప్రభుత్వము యొక్క పూర్వానుమతితో ఈ చట్టము యొక్క నిబంధనలకు, మరియు దాని క్రింద చేయబడిన రూల్సుకు అనుగుణముగా అప్పిలేటు ట్రిబ్యునలు తన కార్య సరళిని మరియు తన వ్యవహార వినియోగమును క్రమబద్ధం చేసే నిమిత్తము, రెగ్యులేషన్లు చేయవచ్చును.

(5) (4) వ సబ్-సెక్షను క్రింద చేయబడిన రెగ్యులేషన్స్ ఆంధ్రప్రదేశ్ రాజపత్రము నందు ప్రకటింపబడవలయును.

(4) ఈ చట్టము క్రింద పన్నులు ప్రెస్క్రైబ్ చేయబడే అట్టి విధానమునందు అసెస్ చేయబడవలెను, విధించబడవలెను మరియు వసూలు చేయబడవలెను.

అయితే - (i) ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి రూల్సు చేత నిర్ణయింపబడినట్లుగా ఒక వ్యవహారము సంబంధంగా అమ్మకం దారుడు లేక కొనుగోలుదారుడు పన్నుకు గురి కావలయును. కాని ఉభయులూ మాత్రం కాదు.

(ii) ఈ ప్రొవిజో యొక్క (i) వ క్లాజునందు నిర్దేశితమైన రూల్సు ననుసరించి ఏ సరుకుల యొక్క కొనుగోలుపైనైనను ఒక డీలరు పన్నుకు గురి కాబడినట్లయితే, అతని చేత ప్రభావితమయ్యే సదరు సరుకుల ఏ అమ్మకము సంబంధంగానైనా అతడు పన్నుకు గురికారాదు.

## వ్యాఖ్యానము

ఇది చట్టంలో అతి కీలకమైన సెక్షను. దీనిని చార్జింగ్ సెక్షనుగా వ్యవహరిస్తారు. దీని ఆధారంగానే డీలర్లపై పన్ను విధించడం జరుగుతుంది. ఆయా స్థానాల్లో షెడ్యూళ్లలో పేర్కొన్న రేట్ల ప్రకారం తన టర్నోవరులోని ప్రతి రూపాయికి పన్నును చెల్లించాలని ఈ సెక్షను ఆదేశిస్తోంది.

ఒకటవ షెడ్యూలులోనున్న సరుకుల్ని అమ్మే డీలరు ఆ అంశము ఎదురుగా పేర్కొన్న రేటు ప్రకారము టర్నోవరుతో నిమిత్తం లేకుండా పన్నును చెల్లించాల్సి ఉంటుంది.

రెండవ షెడ్యూలులోనున్న సరుకులు - వాటికెదురుగా సూచించిన కొనుగోలు స్థానాన్ని, రేటు ననుసరించి టర్నోవరుతో నిమిత్తం లేకుండా పన్నును చెల్లించాల్సి ఉంటుంది.

మూడవ షెడ్యూలులో ఉన్న సరుకులు - వాటికెదురుగా సూచించిన కొనుగోలు లేదా అమ్మకం స్థానం, దాని రేటుననుసరించి టర్నోవరుతో నిమిత్తం లేకుండా పన్నును చెల్లించాల్సి ఉంటుంది.

"బెల్లం" మీద ప్రత్యేకంగా ఉన్న పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని ఐదవ షెడ్యూలు రూపొందించబడింది.

ఆరవ షెడ్యూలులో కల్లు, సారాయి మినహా అన్ని మద్యాలపై పన్ను విధించబడింది. ఆఖరి అమ్మకం మినహా అన్ని అమ్మకపు స్థానాల్లో 25 శాతం చొప్పున, ఆఖరి అమ్మకంపై 5 శాతం చొప్పున పన్ను విధించబడింది.

పైన చెప్పబడిన ఆరు షెడ్యూళ్లలోనూ లేని సరుకులు ఏడవ షెడ్యూలులోనికి చేరతాయి. వీటిని సాధారణంగా 'జనరల్ గూడ్సు' అని పేర్కొంటారు. 1989 నుంచి 'జనరల్ గూడ్సు'ను కూడా షెడ్యూళ్ళలోనికి తీసుకొని రావడం జరిగింది. జనరల్ గూడ్సుపై సాధారణంగా 5 శాతం చొప్పున ప్రతి దశలోనూ అనగా ఒక డీలరు నుంచి వేరొక డీలరుకు అమ్మబడినపుడల్లా పన్నును వసూలు చేయడం జరిగేది. ఇందువల్ల అంతిమంగా సామాన్య ప్రజానీకముపై పన్ను భారం అధికంగా ఉండేది. ఈ పన్ను భారాన్ని తగ్గించేందుకు షెడ్యూళ్ళలోనికి తీసుకురావడం వల్ల జనరల్ గూడ్సుపై ఒకే ఒక స్థానంలో అనగా రాష్ట్రంలోని మొదటి అమ్మకం స్థానంనందు మాత్రమే పన్ను విధించబడుతుంది అని స్పష్టం చేసినట్లయింది. పన్ను రేటును 5 నుంచి 6 శాతానికి పెంచడం కూడా రెవిన్యూ ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొని చేయటం జరిగింది.

మొట్టమొదట బహు స్థానీయంగా ఉన్న పన్ను విధింపు ఏక స్థానీయంగా మారుతూ వచ్చింది. అధికార వర్గానికి పన్ను వసూలు సులభతరం కావటం వల్ల పన్ను ప్రభావం మొత్తం మీద తగ్గటం వల్ల దాదాపు అన్ని సరుకులపై పన్ను విధింపు ఏక స్థానీయంగా మారింది.

కొనేందుకు హేతుబద్ధమైన అవకాశమిచ్చి వ్రాతపూర్వకమైన ఉత్తర్వు ద్వారా -

(i) అట్టి డీలరును (1)వ సబ్-సెక్షను యొక్క ప్రోవిజో క్రింద ప్రెస్క్రైబ్ చేయబడిన ఏ డిక్లరేషను ఫారములనైనను ఉపయోగించుకొనుటకు అనర్హుని చేయవచ్చును మరియు ఏవైనా డిక్లరేషను ఫారములు అతనికి జారీ చేయబడినట్లయితే వాటిని తక్షణమే తనకువశం చేయాల్సిందిగా కోరవచ్చును, మరియు

(ii) తన చేత వాడబడని ఫారములను సమర్పణ చేసే తేదీవరకు (1) వ సబ్-సెక్షను యొక్క ప్రోవిజో క్రింద తన చేత సమర్పించబడిన డిక్లరేషను ఫారముల ఆధారముగా కొనుగోలుచేయబడిన సరుకుల యొక్క టర్నోవరుపై విధింపదగిన పన్ను మొత్తమునకు 3 రెట్లకు తగ్గకుండా, కాని 5 రెట్ల వరకు విస్తరించే మొత్తమును జరిమానాగా అతనిపై విధించవచ్చును.

(సి) ఏ డీలరు విషయములో ఈ సబ్-సెక్షను(బి) క్లాజు క్రింద ఉత్తర్వు చేయబడిందో ఆ డీలరు జరిమానాను చెల్లించి, ఇందు నిమిత్తము అసెసింగ్ అథారిటీ తాను ఉచితమని భావించి విధించిన షరతులను పాటించినట్ల యితే అసెసింగ్ అథారిటీ తన విచక్షణానుసారము సదరు డీలరును పునరారంభముగా ప్రెస్క్రైబ్ చేయబడిన డిక్లరేషను ఫారములను పొందుటకు మరియు వాటిని ఉపయోగించి రాష్ట్రమునందు రాయితీ యివ్వబడిన రేటుతో సరుకులను కొనుగోలు చేయుటకు అనుమతింపవచ్చును.

విశదీకరణము : ఈ సెక్షను ప్రయోజనార్థమై

(i) 'ముడిసరుకులు' అను మాటకు తనంతట తనదిదా కాని లేదా ఇతరముడి పదార్థముల సంయోగముతో గాని తయారీ ప్రక్రియ ద్వారా వేరొక ఉత్పత్తిని చేయుటకు వీలయినది ఏ పదార్థమైననూ అని అర్థము.

(ii) **'కాంపొనెంట్ పార్టు' 'సబ్ - అసెంబ్లీ భాగము' మరియు 'ఇంటర్మీడియట్ భాగము'** అనుమాటలకు అంతిమ ఉత్పత్తి యొక్క గుర్తింపదగిన భాగమై యుండి మరియు ఇతర సరుకులతో కూడి అంతిమ ఉత్పత్తిని నిర్మించు పరికరము అని అర్థము.

## వ్యాఖ్యానము

*తయారీదారులు తమ ఉత్పత్తులను తయారుచేసుకొనేందుకు విడిభాగాల్ని, సంఘటక (కాంపొనెంట్స్) భాగాల్ని, ఇంటర్మీడియట్‌లను వాడతారు. ఆ భాగాలపై పన్ను రేటు అధికంగా ఉండటం వల్ల వాటిని ఇతర రాష్ట్రాలనుంచి ఆ భాగాలను కొనుగోలు చేస్తారు. కేంద్ర అమ్మకపు పన్ను రేటు రాష్ట్రానికి సంబంధించిన స్థానిక రేటు కన్నా తక్కువగా యుండటంతో ఇతర రాష్ట్రాల నుంచి ఆ భాగాలను కొనుగోలు చేసినప్పుడు పన్ను భారం, రవాణా మొదలైన ఖర్చులు కలిపినా కూడా రాష్ట్రంలోని స్థానిక పన్నుభారం కన్నా తక్కువగా యుండటంతో ఇతర రాష్ట్రాల నుంచి ఆయా భాగాలను కొనుగోలుచేసి, దిగుమతి చేసుకోవటం ఆరంభమయింది. భూతలింగం కమిటీ ఈ విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి దీనిని అరికట్టేందుకు పన్ను రేట్లో రాయితీని ఇవ్వాలని సిఫార్సు చేసింది. దాని ఫలితంగానే 5-బి సెక్షను రూపుదిద్దుకుంది.*

## 5-సి. రెస్టారెంట్లు లేక ఆహారశాలలు లేక హోటళ్లు నందు ఆహారము లేక పానీయ పదార్థముల సరఫరాకి సంబంధించి పన్ను :-

ఏ పేరుతో వ్యవహరింపబడినప్పటికిని, ఏదైనా రెస్టారెంటు లేక భోజనశాల లేక హోటలును నడుపుతున్న ప్రతి డీలరు ఏదైనా సర్వీసు రూపముగా గాని లేక సర్వీసులో భాగంగా గాని లేదా మరేరూపముగానైనా సరుకులను అనగా

*వాదించడం సబబు కాదు. అందువల్ల 6వ సెక్షనుకు జరిగిన సవరణ ఇంతకుముందే జరిగిన లావాదేవీలన్నింటికి మాన్యత కల్గిస్తోంది. 'శ్రీకృష్ణ ఎంటర్ ప్రైజెస్ మరియు ఇతరులు వర్సెస్ ఆంధ్ర ప్రదేశ్' కేసు నందు సుప్రీం కోర్టు దీనిని మరింతగా స్పష్టం చేస్తూ పేర్కొన్నది.*

*'46వ రాజ్యాంగ సవరణ' వల్ల భావించబడిన ప్రయోజనాన్ని ఈ సవరణ జరిగేంత వరకూ ఉన్న కాల వ్యవధికి కూడా విస్తరించబడినట్లయింది.*

## 5 -డి. కొన్ని సందర్భములలో అసెస్‌మెంటు మరియు రీ - అసెస్ మెంటు.

(1) ఏదైనా న్యాయస్థానము లేక ఏ ఇతర అథారిటీ యొక్క తీర్పు, డిక్రీ లేక ఉత్తర్వునందు ఏమున్నప్పటికిని, ఆహారము లేక మానవ వినియోగమునకైన ఏ ఇతర పదార్థము లేదా మత్తును కలిగించెడి లేదా కలిగించని ఏ పానీయము యొక్క, సరఫరాకి సంబంధించిన తన యొక్క టర్నోవరు పై ప్రధాన చట్టమునకు ఆంధ్ర ప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను (సవరణ) చట్టము, 1985 సవరణ ననుసరించి

(ఎ) 1978 సెప్టెంబరు 7వ రోజున ఆ తరువాత మరియు 1983 ఫిబ్రవరి 2వ రోజుకు ముందు వరకు గల ఏ సమయమునందైనను తన వ్యాపార క్రమములో ఏ పేరుతో పిలువబడినప్పటికి రెస్టారెంటు లేక భోజనశాల లేక హోటలును నిర్వహించిన ఏ డీలరు చేతనైనను; లేక

(బి) 1972 జనవరి 4వ రోజున ఆ తరువా త మరియు 1983 ఫిబ్రవరి 2వ రోజుకు ముందు వరకు ఏ సమయము నందైనను ఏ పేరుతో పిలవబడిన్పటికి రెస్టారెంటు లేక భోజనశాల లేక హోటలు కానట్టి ఎస్టాబ్లిష్‌మెంటును నడుపుతున్న ఏ డీలరు చేతనైనను

చెల్లించబడవలసిన పన్నును అసెసింగ్ అథారిటీ అసెస్ చేయవచ్చును లేక రీ - అసెస్ చేయవచ్చును.

(2) 14వ సెక్షను లేక 24-ఎ సెక్షను నందు నిర్దిష్టపరచబడిన ఏకాల వ్యవధికి సంబంధించిన పరిమితి ముగింపుతో నిమిత్తం లేకుండా 1983 ఫిబ్రవరి 1వ తేదీ నుండి 4 సంవత్సరముల వ్యవధి లోపు (1)వ సబ్-సెక్షను క్రింద అసెస్‌మెంటు లేక రీ-అసెస్‌మెంటు చేయబడవచ్చును.

## 5 -ఇ. సరుకులను ఉపయోగించు కొనుటకు ఏదైనా హక్కు విషయములో వసూలు చేయబడిన మొత్తముపై పన్ను:-

ఈ చట్టము నందు ఏమున్నప్పటికినీ -

(ఎ) ఎవరయినా లెస్సీ లేక లైసెన్సుదారునకు రొక్కము కొరకుగాని వాయిదా చెల్లింపుకు గాని లేదా ఇతర విలువయిన మూల్యము కొరకు గాని, ఏదయినా నిర్దిష్ట వ్యవధికైననూ కాకున్ననూ, ఏమయినప్పటికి, అతని వ్యాపార క్రమములో ఏవయినా సరుకులను ఏప్రయోజనము కొరకయిననూ ఉపయోగించుకొను హక్కును బదిలీ చేయు ప్రతి డీలరు అట్టి సరుకులను ఉపయోగించుకొను హక్కు యొక్క బదిలీ లేక బదిలీలపై రొక్కరూపమునగాని లేక మరే రూపముగా నయినా గాని లెస్సీ లేక లైసెన్స్ దారునుండి తన చేత వసూలు చేయబడిన లేక చేయదగిన వెరసి మొత్తముపై, తమ సంవత్సరక్రమము నందు అతని చేత వసూలు చేయబడిన లేక చేయదగిన అట్టి వెరసి మొత్తము యొక్క ప్రతిరూపాయి నందు 5 పైసలు రేటు చొప్పున పన్ను చెల్లింపవలెను.

(బి) ఏ డీలరు చేతనయిననూ ఏవైనా అట్టి సరుకులను ఉపయోగించుకొనుటకు హక్కు యొక్క బదిలీ, ఆ సరుకులు

క్రమమందు అమ్మకము ఏర్పాటు చేసినట్లయితే, కాని ఇతర రాష్ట్రముల నుండి పొందబడిన లేక కొనుగోలు చేయబడిన మరియు వర్క్సు కాంట్రాక్టు యొక్క నిర్వహణ యందు ఉపయోగించబడిన సరుకులు ఇందు చేరియుండరాదు.

అయితే - మొత్తంగా లేక భాగంగా వర్క్సు కాంట్రాక్టు యొక్క నిర్వహణము కొరకు మూల్యముగా సబ్-కాంట్రాక్టరుకు చెల్లించబడిన మొత్తములకు సంబంధించిన టర్నోవరుపై ఈ సెక్షను క్రింద ఎట్టి పన్ను, అట్టి సబ్-కాంట్రాక్టరు ఈ చట్టం క్రింద పన్నుకు బాధ్యమయ్యే ఒక రిజిస్టర్డు డీలరని మరియు అట్టి చేత దాఖలు చేయబడిన టర్నోవరు యొక్క రిటర్ను నందు అట్టి మొత్తము యొక్క టర్నోవరు చేర్చ బడినది అనుటకు ఆధారమును సమర్పించుటకు లోబడి, చెల్లింపబడనవసరం లేదు.

## వ్యాఖ్యానము

*వాణిజ్యరంగం విస్తృతం కావటం వల్ల వర్క్సు కాంట్రాక్టుల్లో భారీ ఎత్తున లావాదేవీలు చోటు చేసుకొన్నాయి. రాజ్యాంగ సవరణ కారణంగా 'అమ్మకం' ప్రాతిపదిక విస్తృతమయింది. అన్ని తరహాల వర్క్సు కాంట్రాక్టుల్లో రకరకాల వస్తువులు వినియోగమవుతున్నాయి. వాటన్నిటిని పన్ను పరిధిలోనికి తీసుకొనిరావటానికి ఈ సెక్షను ద్వారా ప్రయత్నం జరిగింది. వర్క్సు కాంట్రాక్టునందు జరిగే సరుకుల బదిలీ లన్నింటిని దీని పరిధిలోనికి తీసుకొని వచ్చి, 6 శాతము పన్ను విధించడం జరుగుతుంది.*

*డిక్లేర్డు సరుకుల విషయంలో ఈ క్రింది రెండు పరిస్థితులలో పన్ను చెల్లించనవసరం లేదు.*

*1. అంతకు ముందే సదరు సరుకులు పన్ను విధింపబడినవై యుండాలి.*

*2. సదరు సరుకులు కాంట్రాక్టరు నుండి కాంట్రాక్టీకి బదిలీ చేయబడేటప్పుడు కొనుగోలు చేసినప్పటి రూపంలోనే ఉండాలి. మిగతా సందర్భాల్లో మాత్రం 4 శాతం పన్ను విధించాలి. అన్నిటికి 6శాతం సాధారణ లెవీ ఉండటం వల్ల, డిక్లేర్డ్ సరుకుల విషయంలో మాత్రము 4 శాతం మాత్రమే చెల్లించాలని ఈ ప్రొవిజో ప్రత్యేకంగా పేర్కొంటుంది.*

*4 వ షెడ్యూలు లోని సరుకుల విషయంలో కాంట్రాక్టును నుండి కాంట్రాక్టీకి బదిలీ చేసేటప్పుడు కొనుగోలు చేసినప్పటి రూపంలోనే సరుకులు ఉన్నట్లయితే ఎటువంటి పన్ను చెల్లించనవసరం లేదు.*

*కేంద్ర అమ్మకపు పన్ను చట్టంలోని 3, 4, 5 సెక్షనుల క్రింద వచ్చే అమ్మకాలపై పన్ను విధించరాదని కూడా స్పష్టం చేయటం జరిగింది. ఇతర రాష్ట్రాల నుంచి కొని రాష్ట్రము నందు వర్క్సు కాట్రాక్టులో వాడితే మాత్రం పన్ను చెల్లించక తప్పదు.*

*కాంట్రాక్టరు మొత్తం పనులన్నీ తానే స్వయంగా చేయకుండా, అనేక రకాల ఆపరేషన్నును సబ్ -కాంట్రాక్టరు కు ఇవ్వటం జరుగుతోంది. అయితే మొత్తాలపై పన్ను విధింపు కాంట్రాక్టరు మీదనా? లేదా సబ్-కాంట్రాక్టరు మీదనా? అనే ప్రశ్నకు కూడా ఈ సెక్షను వివరణ ఇస్తోంది. సబ్-కాంట్రాక్టరు రిజిస్టర్డ్ డీలర్లై యుండి, అతని రిటర్ను సదరు టర్నోవరును చూపించిన పక్షంలో ఆ మేరకు కాంట్రాక్టరు ఆధారము చూపించినట్లయితే అంత మొత్తానికి కాంట్రాక్టరు పన్ను చెల్లించనవసరం లేదు. అది సబ్-కాంట్రాక్టరు పన్ను మదింపులో పరిశీలించబడుతుంది.*

### 5 - జి : 5 - యఫ్ సెక్షను క్రింద చెల్లించ వలసిన పన్ను యొక్క రాజీ:

(1) 5 - యఫ్ సెక్షను క్రింద పన్ను చెల్లించుటకు బాధ్యమయ్యే ఒక డీలరు, ఆ ప్రదేశం యొక్క అసెసింగ్ అథారిటీ ప్రెస్క్రైబ్ చేయబడే అట్టి పరిస్థితులు మరియు అట్టి షరతులకు లోబడి, సంవత్సర క్రమం నందు చెప్పబడిన సెక్షను క్రింద అతని చేత చెల్లింపబడవలసిన పన్ను యొక్క మొత్తమునకు బదులుగా, అట్లు కోరుకున్నట్లయితే రాజీ మార్గంలో అతని మొత్తం టర్నోవరుపై నాలుగు శాతము రేటు చొప్పున ఒక మొత్తాన్ని అంగీకరించవచ్చు.;

నందు నిర్దిష్ట పరచబడిన వడ్డీ రేట్ల చొప్పున, ఉపేక్షించిన తేదీ నుండి అట్టి మొత్తము చెల్లించిన తేదీవరకు, వడ్డీని చెల్లించుటకు భాధ్యమగును.

(5) (2) వ సబ్-సెక్షను ననుసరించి మినహాయింపు ద్వారా చెల్లింపు, వర్క్స్ కాంట్రాక్టు, నిర్వహించుచున్న డీలరు నుండి ఈ చట్టము క్రింద బాకీ అయిన పన్ను యొక్క ఏ ఇతర విధమైన వసూలు పద్ధతికి భంగం కాదు.

(6) (2) వ సబ్-సెక్షను క్రింద వర్క్స్ కాంట్రాక్టు సంబంధంగా పన్ను చెల్లించ బడినపుడు, అట్టి వర్క్స్ కాంట్రాక్టు సంబంధంగా డీలరు చేత చెల్లించ బడవలసిన పన్నునుండి చెప్పబడిన సబ్-సెక్షను క్రింద ఇంతకు ముందే చెల్లింపబడిన పన్ను మొత్తము తగ్గించబడవలెను.

అయితే-అట్టి వర్క్స్ కాంట్రాక్టు పై పన్ను ఇంతకు ముందే చెల్లింపబడినదని నిరూపించుకొను మరియు అట్లు చెల్లింపబడిన పన్ను యొక్క పరిమాణమును నిరూపణ చేయు భారము తగ్గింపును కోరుచున్న డీలరు పైననే ఉంటుంది.

## వ్యాఖ్యానము

*ఈ రోజుల్లో రాష్ట్ర ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వాలు, పబ్లిక్ రంగ సంస్థలు, చట్టపరమైన సంస్థలు, స్థానిక సంస్థలు టెండర్లు రూపకంగా అనేక వర్క్స్ కాంట్రాక్టులను ఇస్తున్నాయి. వాటిపై పన్నును వీలైనంత సరళంగానూ, పటిష్టంగా వసూలు చేసేందుకు ఈ సెక్షను రూపొందించటం జరిగింది. దీని ప్రకారం 4 శాతం చొప్పున పన్నును లెక్కగట్టి చెల్లించాల్సిన మొత్తం నుంచి, సదరు పన్నును మినహాయించుకొని దానిని వారం రోజుల లోపు సేల్సు టాక్సు హెడ్డు క్రింద జమ చేయాలి. ఆ మేరకు సదరు కాంట్రాక్టరుకు సర్టిఫికెట్‌ను ఇవ్వాలి. అయితే అట్లా మినహాయించడంలో సంబంధిత ప్రభుత్వ శాఖలు వగైరా విఫలమైతే ఏమౌతుంది? విఫలమయిన తేదీనుంచి ఆ మొత్తం పన్ను + 16వ సెక్షను క్రింద పేర్కొన్న వడ్డీని కూడా చెల్లించాల్సి ఉంటుంది. పన్నును మినహాయించుకొనే బాధ్యత మూలస్థానంలో ఉన్న ప్రభుత్వ శాఖలదే గాని నాకేం సంబంధం లేదని కాంట్రాక్టరు వాదించటానికి వీలు లేకుండా (5)వ సబ్-సెక్షను వివరంగా పేర్కొంటుంది. సంబంధిత శాఖల మీద చర్యే కాకుండా, డీలరు నుంచి కూడా అన్ని రూపాల్లో పన్ను వసూలు చేయటానికి వీలుంటుందని ఈ (5)వ సబ్-సెక్షను స్పష్టం చేస్తోంది.*

*అయితే - (2) వ సబ్-సెక్షను క్రింద పన్ను మినహాయించబడి, చెల్లించబడిందని ఎంత మొత్తం చెల్లించబడిందనే అంశాలను నిరూపణ చేయాల్సిన బాధ్యత డీలరుదే.*

### 6. డిక్లేర్డ్ సరుకులకు సంబంధించి పన్ను :-

5వ సెక్షను నందు ఏమున్నప్పటికీ, డిక్లేర్డ్ సరుకులలో డీలరుచేత చేయబడిన అమ్మకాలు లేక కొనుగోళ్ళు అట్టి సరుకులందు అతని టర్నోవరు యొక్క పరిమాణంతో నిమిత్తం లేకుండా ప్రతి సంవత్సరం అట్టి అమ్మకాలు లేక కొనుగోళ్ళును మూడవ షెడ్యూలు నందు ప్రతిదాని ఎదురుగా నిర్దిష్టమైన రేటు చొప్పున మరియు అమ్మకపు లేక కొనుగోలు స్థానం నందు మాత్రమే తన టర్నోవరుపై పన్నుకు బాధ్యమగును మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన విధానముతో పన్నును అసెస్ చేయుట, విధించుట, వసూలు చేయుట చేయవలెను.

17-డి మరియు 27-ఎ రూల్సును, ఫారము -యఫ్ మరియు యఫ్-1లను చూడుము

అయితే అట్లు పన్ను విధింపబడిన సరుకులు అంతర్ రాష్ట్రీయ వర్తక లేక వాణిజ్య క్రమములో అమ్మబడినప్పుడు

(సి) అంతర్-రాష్ట్రీయ వర్తక లేక వాణిజ్య క్రమంలో అమ్మకం లేక కొనుగోలు యొక్క ప్రత్యక్ష ఫలితంగా కాక మరే విధంగానైనా రాష్ట్రము వెలుపలి ప్రదేశమునకు పంపినట్లయితే.

పైన పేర్కొన్న పరిస్థితులు నెలకొనడం వల్ల తప్పితే పైన చెప్పిన కొనుగోలుకు సంబంధించిన టర్నోవరుపై 5వ లేక 6వ సెక్షనుల క్రింద ఏ రేటు ప్రకారం సదరు సరుకులపై పన్ను విధింపబడునో అట్టి పన్నును ప్రతి డీలరు చెల్లించవలెను.

## వ్యాఖ్యానము

అన్ని విధాల పన్ను చెల్లింపునకు అర్హమైనప్పటికీ కొన్ని ప్రత్యేక పరిస్థితులలో పన్ను విధింపు, వసూలు కష్టతరమౌతుంది. చిన్న వ్యాపారులు చేసే అమ్మకాలు, ఉదా : పాలు మొదలైనవి, రిజిష్టర్డు కాని డీలర్ల అమ్మకాలు పన్నుల నుంచి తప్పుకొంటాయి. అట్లాంటి వాటి విషయాల్లో పన్నును కొనుగోలు స్థానంలో విధించేందుకు అనువుగా దీనిని రూపొందించడం జరిగింది.

ఈ సెక్షను కొనుగోలు పన్ను విధించబడటానికి 5 పరిస్థితుల్ని పేర్కొంటోంది.

*1) 5వ సెక్షను క్రిందగాని, 6వ సెక్షను క్రింద గాని ఏ పన్నును చెల్లించాల్సిన బాధ్యత లేనట్టి ఒక రిజిష్టర్డు డీలరు నుండి కొనుగోలు చేసినప్పుడు.*

*2) పన్నుకు బాధ్యమయ్యే సరుకుల్ని ఒక రిజిష్టరు కాని డీలరు నుంచి కొనుగోలు చేసినప్పుడు.*

*3) అట్టి సరుకులను అమ్మకము నిమిత్తమైన ఇతర వస్తువుల తయారీలో వాడేసినప్పుడు లేక మరే విధంగానైనా వాడినప్పుడు*

*4) అమ్మకము రూపంగా కాకుండా మరే విధంగానైనా వాడినప్పుడు.*

*5) ఇతర రాష్ట్రానికి అమ్మకం లేదా కొనుగోలు రూపంగా కాకుండా పంపబడినప్పుడు.*

*దీనిని బట్టి అన్ని స్థానాల్లో పన్ను మినహాయించబడినట్లయితే ఈ సెక్షను వర్తించదు. డీలరు కన్నా భిన్నమైన వ్యక్తి కొనుగోలు చేసినప్పుడు కూడా ఇది వర్తించదు. కొన్ని తరగతులకు చెందిన డీలర్లకు మాత్రమే వర్తించే మినహాయింపు కొనుగోలు చేస్తున్న డీలరుకు కూడా వర్తించాలని లేదు కాబట్టి పన్నుకు బాధ్యుడౌతాడు.*

**6 - బి - తొలగించబడినది**

**6 - సి :- ప్యాకింగు పదార్థములపై పన్ను విధింపు:**

5 వ సెక్షను, 5-యఫ్ సెక్షను, 6వ సెక్షను, 6-ఎ సెక్షనులందు ఏమున్నప్పటికినీ, ప్యాకింగు పదార్థములకు మరియు ప్యాక్ చేయబడిన లేదా నింపబడిన సరుకుల కొరకు ప్రత్యేకముగా అమ్మకము లేదా అమ్మకము కొరకు ఒప్పందం ఉన్నప్పటికీ లేకున్నప్పటికి, సరుకులతో పాటు అమ్మబడిన ప్యాకింగ్ పదార్థముల మీద, ప్యాక్ చేయబడిన లేదా నింపబడిన సరుకులకున్న రేటు ప్రకారమే పన్ను రేటు ఉంటుంది.

## వ్యాఖ్యానము

ఈ సెక్షను ప్రకారము పదార్థాల్ని ప్యాక్ చేసేందుకు వాడే పదార్థాలపై ప్యాక్ చేయబడిన వస్తువుకు ఏ రేటు వర్తిస్తుందో ఆ రేటే వర్తిస్తుంది. దీనిని 1983 నుంచి ప్రవేశ పెట్టారు. అయితే 1983 కన్నా ముందు జరిగిన అమ్మకాల్లో స్పష్టంగా, అంతర్నిహితంగా వస్తువుతో పాటు ప్యాకింగ్ పదార్థాల్ని అమ్మేందుకు ఒప్పందం ఉందా? లేదా కేవలం ప్యాకింగ్ మెటీరియల్ రైకబారుగా లభించగల రవాణా సాధనం మాత్రమేనా? అన్నది పరిశీలించి మాత్రమే అసెస్మెంటు చేయాలని కోర్టులు తీర్పు

ఆ ఆర్టికల్ ఆధారంగా ఎగుమతి అమ్మకం మీద గాని దిగుమతి కొనుగోలు మీదగాని రాష్ట్ర ప్రభుత్వమునకు పన్ను విధించే అధికారం లేదు.

అందువల్ల రాష్ట్రము వెలుపలికి ఎగుమతి కావటానికి ముందు ఏది ఆఖరి అమ్మకం అవుతుందో లేదా రాష్ట్రంలోకి దిగుమతి అయ్యే సరుకులందు ఏది మొదటి కొనుగోలు అవుతుంది అనేది నిర్ధారించబడితే కాని రాష్ట్ర ప్రభుత్వానికి అట్టి వ్యవహారములపై పన్ను విధించుటకు వీలు కాదు. అందువల్ల ఈ చట్టంలో దీనిని వివరించేందుకు 7వ సెక్షను ప్రత్యేకించి రూపొందించబడింది.

(1)వ సబ్-సెక్షను యొక్క (ఎ) క్లాజు, ఆంధ్ర ప్రదేశ్‌లోకి దిగుమతి అయ్యే సరుకులకు సంబంధించి ఏది మొదటి అమ్మకము లేదా కొనుగోలు అవుతుందో వివరిస్తోంది.

అమ్మకపు స్థానమునందు పన్నుకు బాధ్యమయ్యే దిగుమతి అయ్యే సరుకుల విషయంలో దిగుమతి దారుడు సరుకులను దిగుమతి చేసుకొనిన అనంతరము దిగుమతి దారుని చేతిలో జరిగే అమ్మకము మొదటి అమ్మకం గాను, కొనుగోలు స్థానము నందు పన్నుకు బాధ్యమయ్యే సరుకుల విషయంలో దిగుమతి దారుని నుండి కొనుగోలు చేసిన మొదటి వ్యక్తి 'కొనుగోలు'ను మొదటి కొనుగోలుగాను నిర్ధారించవలెను.

అట్లాగే ఎగుమతి దారునకు చేయబడిన అమ్మకము ఆఖరి అమ్మకంగాను, ఎగుమతి దారుని చేత చేయబడిన కొనుగోలు ఆఖరి కొనుగోలు గాను భావించబడుతుంది. కేంద్ర అమ్మకపు పన్ను చట్టము నందు 5వ సెక్షనులోని 3వ సబ్-సెక్షను నందు చేయబడిన సవరణ దృష్ట్యా ఈ సెక్షనుని కూడా మార్చవలసిన అవసరమున్నది.

## 7-ఎ. పన్ను మరియు జరిమానాల చెల్లింపుకు డీలరు యొక్క బాధ్యత మరియు నిరూపణ భారంః-

(1) 5వ సెక్షను యొక్క (2)వ సబ్-సెక్షను క్రిందగాని, 6వ సెక్షను క్రిందగాని లేక 9వ సెక్షను క్రింద జారీ చేయబడిన నోటిఫికేషను క్రిందగాని అసెస్‌మెంటు చేయబడిన సందర్భమునందు డీలరు చేత చేయబడిన ఏదైనా అమ్మకము లేక కొనుగోలు పన్నుకు బాధ్యముకాదని లేక తగ్గింపు రేటు వద్ద పన్నుకు బాధ్యమని నిరూపించుకోవలసిన భారం డీలరుపైననే యున్నది.

ఫారము - XIII ను చూడుము

(1 - ఎ) : ఈ చట్టములోగాని లేదా ఏ ఇతర చట్టములో గాని ఏ మున్నప్పటికినీ రాష్ట్రము నందు అమ్మకం లేదా కొనుగోలునకు సంబంధించి పన్నుకు బాధ్యమయ్యే ఏ సరుకుల డీలరయిననూ అట్టి సరుకులకు, అమ్మకం దారుడు లేక కొనుగోలుదారుడుగా, సందర్భానుసారంగా ఏదయితే అది, భావించబడతాడు. మరియు అట్టి సరుకులకు సంబంధించి అమ్మకాలు లేక కొనుగోళ్ళ అతని టర్నోవరుపై తదనుసారంగా పన్ను చెల్లించుటకు, అమ్మబడిన లేదా కొనబడిన సరుకులు, సందర్భానుసారంగా ఏదయితే అది, ఈ చట్టము క్రింద పన్నుకు ఇంతకు క్రితమే గురి అయ్యాయని అసెసింగ్ అథారిటీ సంతృప్తి చెందేటట్లు నిరూపించితే తప్ప, బాధ్యుడగును.

(2) ఏ ఇతర డీలరు చేత లేక తన చేత చేయబడిన అమ్మకము లేక కొనుగోలు వ్యవహారము పన్నుకు బాధ్యముకాదని లేక తగ్గించిన రేటు ప్రకారం పన్నుకు బాధ్యమని ఏదైనా క్లెయిమ్ చేయు లేక మద్దతునిచ్చే దృష్టితో ఒక తప్పుడు బిల్లు, వోచరు, డిక్లరేషను, ధృవపత్రము లేక ఇతర పత్రాన్ని కాని ఒక డీలరు జారీ చేసిన లేక సమర్పించిన, అసెసింగ్ అథారిటీ అట్టి జారీ లేక సమర్పణను కనుగొనిన తర్వాత, అట్టి పత్రమును జారీచేసిన లేక సమర్పించిన డీలరును జరిమానా రూపంగా

(i) మొదటి సారిగా అట్లు కనుగొన్నప్పుడు ఆ వ్యవహారానికి సంబంధించిన పన్ను బాకీకి 3 రెట్లు; మరియు

(ii) రెండవ సారి లేక తదనంతరము కనుగొన్నప్పుడు ఆ వ్యవహారానికి సంబంధించిన పన్ను బాకీకి 5 రెట్లు చెల్లించమని ఆదేశించవలెను.

(ii) తమ టర్నోవరు యొక్క భాగము లేక మొత్తము సంబంధంగా ఏదైనా నిర్దిష్ట వర్గము యొక్క వ్యక్తుల చేత ఈ చట్టము క్రింద చెల్లించబడవల్సిన ఏ పన్ను లేక వడ్డీని మినహాయించుట లేక రేటును తగ్గించుట కాని చేయవచ్చును.

(2) (1)వ సబ్ - సెక్షను క్రింద నోటీపై చేయబడిన ఏ పన్ను లేక వడ్డీ మినహాయింపు గాని లేదా పన్ను రేటు తగ్గింపు గాని

(ఎ) రాష్ట్రమంతటికి గాని లేదా దానియందు ఏదైనా ప్రదేశము లేక ప్రదేశాలకు గాని విస్తరించవచ్చును.

(బి) లైసెన్సులు మరియు లైసెన్సు రుసుములకు సంబంధించిన షరతులతో సహా నోటిఫికేషను నందు నిర్దిష్టమయ్యే పరిమితులకు మరియు షరతులకు లోబడియుండవచ్చును.

## వ్యాఖ్యానము

ఇది నిర్దిష్టమైన మినహాయింపులను ఇచ్చుటకు ఉద్దేశింపబడింది. ఈ సెక్షను ద్వారా రాష్ట్ర ప్రభుత్వమునకు ఏదైనా అమ్మకము లేదా కొనుగోలును పన్ను విధింపు నుండి మినహాయించుటకు అధికార మివ్వబడినది. ఏదైనా నిర్దిష్ట వర్గమునకు చెందిన సరుకులను అన్ని స్థానములలో లేదా ఏవైనా నిర్దిష్ట స్థానములలో మినహాయించుటకు లేదా ఏదైనా ఒక ప్రత్యేక తరగతికి చెందిన వ్యక్తుల 'మొత్తపు' లేక ఏదైనా 'భాగపు' టర్నోవరును మినహాయించుటకు రాష్ట్ర ప్రభుత్వము నోటిఫికేషను జారీ చేయవచ్చును. ఈ సెక్షను ప్రకారము పన్ను రేటును తగ్గించుటకు కూడా రాష్ట్ర ప్రభుత్వమునకు అధికారము కలదు. ఈ విధంగా చేసే మినహాయింపు, పన్ను రేటు తగ్గింపు రాష్ట్రములోని ఏ భాగానికైనా లేక రాష్ట్రమంతటికైనా వర్తించవచ్చు.

దీని ప్రకారము రాష్ట్ర ప్రభుత్వానికి మినహాయింపును గాని లేక పన్ను రేటు తగ్గింపును గాని ప్రకటించేందుకు మాత్రమే అధికారమున్నది. దాన్ని రద్దు చేసేందుకు అధికారము లేదు అని కొందరు డీలర్లు అభ్యంతరాన్ని లేవనెత్తగా మినహాయింపును అనుదానము చేసే ప్రభుత్వానికి మినహాయింపును రద్దు చేసే అదికారము కూడా యుంటుందని కోర్టులు తీర్పు చెప్పాయి.

**10. తొలగించబడినది.**

**11. తొలగించబడినది.**

**12. డీలరుల రిజిస్ట్రేషను:-**

(1) క్యాజువల్ ట్రేడరు కన్నా భిన్నమైనట్టి, ఏ సంవత్సరము నందైననూ మొత్తము టర్నోవరు 50,000 రూపాయలకు తగ్గని ప్రతి డీలరు విధిగాను మరియు ఏ ఇతర డీలరైనను ఐచ్ఛికముగాను ఈ చట్టము క్రింద రిజిస్టరు చేయించుకొనవలెను.

| 8, 9, 28 మరియు 54 రూల్సును ఫారములు ఎ, ఎ-1, డి, డి-1, XII మరియు XXV లను చూడుము |
|---|

(2) (1) వ సబ్-సెక్షను నందు ఏమున్నప్పటికి -

(ఎ) ఒకటవ, రెండవ, మూడవ, ఐదవ మరియు ఆరవ షెడ్యూళ్ళ నందున్న అన్ని లేక ఏ సరుకులతో నైనా వ్యాపారము కొనసాగించునట్టి;

(బి) ఏ వర్క్స్ కాంట్రాక్టులనైననూ కొనసాగించునట్టి లేక నిర్వహించునట్టి;

(సి) ఎవరైనా ఇతర వ్యక్తికి తన వ్యాపార క్రమములో ఏ ప్రయోజనార్థమైననూ (నిర్దిష్ట వ్యవధికైననూ కాకున్ననూ) ఏ సరుకునైననూ ఉపయోగించుకొనేందుకు హక్కును బదిలీ చేయునట్టి;

నిర్దిష్టమయ్యే అట్టి సెక్యూరిటీని డీలరు సమకూర్చవలెనను రిక్వైర్‌మెంటును రిజిస్ట్రేషను ధృవపత్రము యొక్క జారీ కొరకు షరతుగా విధించవచ్చును.

(8) (6)వ సబ్-సెక్షను క్రింద ఎవరికైతే దరఖాస్తు చేయబడినదో ఆ అథారిటి దరఖాస్తు సదుద్దేశ్య పూర్వకమయినదని మరియు సక్రమముగా నున్నదని మరియు ఈ చట్టము యొక్క నిబంధనలు మరియు దాని క్రింద చేయబడిన రూల్సు కనుగుణంగా యున్నదని మరియు (7)వ సబ్-సెక్షను క్రింద విధించబడిన షరతులు, ఏవయినా విధించబడితే, పాటింపబడినవని సంతృప్తి చెందినట్లయితే, ఆ దరఖాస్తుదారును రిజిస్టరు చేయవలెను - మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారము నందు అతనికి రిజిస్ట్రేషను ధృవ పత్రమును అనుదానము చేయవలయును.

(9) ఏ అట్టి డీలరైనను ఒకటి కన్నా ఎక్కువ దుకాణములను లేక వ్యాపార ప్రదేశములను (కేవలము సరుకులను నిల్వ చేసే స్థలం వినా) కలిగియున్నట్లయితే అతడు అట్టి ప్రతి దుకాణానికి లేక వ్యాపార ప్రదేశానికి ఇరవై రూపాయల మొత్తము యొక్క చెల్లింపు పై రిజిస్ట్రేషను కొరకు దరఖాస్తు చేసి మరియు అట్టి ప్రతి దుకాణము లేక వ్యాపార ప్రదేశానికి విడి విడిగా రిజిస్ట్రేషను ధృవ పత్రాన్ని పొందవలయును.

(10) ఈ సెక్షను క్రింద రిజిస్ట్రేషను ధృవపత్రాన్ని అనుదానము చేసే అథారిటి, ఈ చట్టము క్రింద చెల్లించవలసిన పన్ను లేక ఇతరబాకీల సముచిత వసూలు కొరకు లేక (7) వ సబ్-సెక్షను నందు నిర్దేశితమైన ఫారముల సముచిత సంరక్షణ మరియు వాడకము కొరకు అట్లు చేయుట అవసరమనిపించినపుడు, అట్టి ధృవ పత్రము అమలులో యున్నట్లయితే ఎప్పుడయినను, వ్రాత పూర్వకమైన ఉత్తర్వు ద్వారా మరియు దాని యందు రికార్డు చేయదగిన కారణముల కొరకు, రిజిస్ట్రేషను ధృవపత్రము ఎవరికి జారీ చేయబడినదో ఆ డీలరును ఆ ఉత్తర్వు నందు నిర్దిష్టమైన అట్టి సమయము లోపల మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన విధానమునందు అట్టి సెక్యూరిటీ లేదా ఈ సెక్షను క్రింద లేక (7) వ సబ్-సెక్షను క్రింద ఉత్తర్వును అనుసరించి ఏదయినా సెక్యూరిటీని డీలరు అప్పటికే సమకూర్చినట్లయితే అట్టి అదనపు సెక్యూరిటీని ఉత్తర్వులో నిర్దిష్టమయ్యే పైన పేర్కొనబడిన ఏదైనా లేక అన్ని ప్రయోజనాల నిమిత్తము సమకూర్చవలసిందిగా కోరవచ్చును.

(11) డీలరుకు తన వాదనను వినిపించుకొనేందుకు అవకాశమివ్వబడితే తప్ప, (7)వ సబ్-సెక్షను క్రింద ఏ సెక్యూరిటీ గాని లేక (10)వ సబ్-సెక్షను క్రింద ఏ సెక్యూరిటీ లేక అదనపు సెక్యూరిటీగాని సమకూర్చమని అపేక్షింపబడరాదు మరియు అట్లు అపేక్షింపబడిన సెక్యూరిటీ లేక అదనపు సెక్యూరిటీ, యొక్క మొత్తము, ఏ సంవత్సరంలో సదరు సెక్యూరిటీ లేక అదనపు సెక్యూరిటీ, సందర్భానుసారముగా ఏదైతే అది, సమకూర్చబడవలసినదిగా అపేక్షింపబడినదో ఆ సంవత్సరం సదరు డీలరు యొక్క టర్నోవరుపై సదరు అథారిటీ యొక్క అంచనా ననుసరించి ఈ చట్టము క్రింద చెల్లింపవలసిన పన్నుకు సమానమైన మొత్తమును మించరాదు.

(12) (7)వ సబ్-సెక్షన్ క్రింద లేక (10)వ సబ్ సెక్షను క్రింద సమకూర్చబడిన సెక్యూరిటీ హామీపత్రము రూపములో ఉన్నపుడు సదరు హామీదారుడు మరణించినను లేక దివాళా తీసినను, డీలరు అట్టి సంఘటన సంభవించిన ముప్పైరోజులలోపు ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీకి తెలియచేయవలయును మరియు సదరు సంఘటన సంభవించిన తొంభైరోజుల లోపు పత్రము లోని మొత్తానికి కొత్త హామీ పత్రమును ఇవ్వవలెను.

(13) ఈ సెక్షను క్రింద రిజిస్ట్రేషను ధృవపత్రాన్ని అనుదానము చేసే అథారిటీ ఉత్తర్వుద్వారా మరియు యోగ్యమైన

1) సాలీనా 50, 000రూ. తగ్గని మొత్తపు టర్నోవరు కలిగిన ప్రతి డీలరు.

2) ఏ డీలరైనా స్వచ్ఛందంగా రిజిస్ట్రేషను చేయించుకొనగోరితే ఆ డీలరు.

3) ఒకటవ, రెండవ, మూడవ, ఐదవ, ఆరవ షెడ్యూళ్ళనందు పేర్కొనబడిన సరుకులందు వ్యాపారము చేయు చున్న ప్రతి డీలరు.

4) వర్క్సు కాంట్రాక్టర్లు.

5) సరుకులను వాడుకొనేందుకు హక్కును బదిలీ చేసే ప్రతి డీలరు.

6) కే.అ.ప. చట్టము క్రింద రిజిస్ట్రేషను పొందునట్టి ప్రతి డీలరు.

7) రాష్ట్రము నందు స్థానీయేతర ప్రిన్సిపలుకు ఏజెంటుగా వ్యవహరించే ప్రతి వ్యక్తి.

8) అన్నిరకాల ఏజెంట్లు (ఉదా॰ కమీషను ఏజెంటు, బ్రోకరు, డెల్‌క్రెడరు ఏజెంటు, వేలంపాటదారు, మరే విధమైన మర్కెంటైల్ ఏజెంటు).

9) ప్రతి మిల్లరు.

**ఎవరు రిజిస్ట్రేషను చేస్తారు?**

సాధారణంగా ప్రధాన వ్యాపార ప్రదేశము ఉండే ప్రదేశము మీద అధికార పరిధిగల సహాయ వాణిజ్య పన్నుల అధికారి రిజిస్ట్రేషను అథారిటీగా వ్యవహరిస్తాడు.

అయితే - కొన్ని సందర్భాలలో డీలరు రాష్ట్రానికి వెలుపల ఉండి, రాష్ట్రంలో ఇది అని నిర్దిష్టంగా ఒక చోట స్థిరంగా ఉండకుండా అమ్మకాలను, సరఫరాలను చేయటం కాని చేస్తుంటాడు లేదా రాష్ట్రంలో వర్క్సు కాంట్రాక్టు చేస్తుంటాడు లేదా రాష్ట్రం లో తన ప్రతినిధి ద్వారా లేక ఉద్యోగి ద్వారా సరుకులు పంపిణీ చేస్తుండవచ్చు. అలాంటి సందర్భాల్లో "ఇది' అని నిర్దిష్టంగా ఒక ప్రదేశం లేదు కాబట్టి రిజిస్ట్రేషను నిమిత్తం దరఖాస్తును కమీషనరుకు గాని అతని చేత అధికార మివ్వబడిన ఇతర అధికారికి గాని సమర్పించాలి.

**రిజిస్ట్రేషను ఎలా జరుగుతుంది?**

ఫారము 'డి' అనేది రిజిస్ట్రేషను కోసం నిర్దిష్టంగా పేర్కొనబడిన నమూనా ఫారము. నింపబడిన ఫారముతో బాటు ఈ క్రింది వాటిని కూడా జత చేయాలి.

1) ప్రధాన వ్యాపార ప్రదేశానికి రూ.100/- మరియు ఇతర ప్రతి వ్యాపార ప్రదేశానికి రూ.20/- చొప్పున, చెల్లించి నదరు చలానాను.

2) ఫారము XII(రిటర్నులపై సంతకము చేయటానికి అధికారమివ్వబడిన వ్యక్తుల వివరాలు)

3) ఫారము XXV (లెక్కలను నిర్వహించడం, దాఖలు చేయడం వగైరా చేసేందుకు అధికార మివ్వబడిన వ్యక్తులు)

4) ఫారము XXIX (నోటీసులు వగైరాను అందుకొనేందుకు అధికారమివ్వబడిన వ్యక్తులు)

5) 'ఏ' రిటర్ను

రిజిస్ట్రేషను చేసే అథారిటీ పై దరఖాస్తును అందుకొన్న అనంతరము విచారణ జరపవలసి ఉంటుంది. దరఖాస్తు సంపూర్ణంగా, యదార్థంగా ఉందని సంతృప్తి చెందాల్సి ఉంటుంది. అనంతరం 'డి-1' ఫారమునందు రిసిస్ట్రేషను ధృవపత్ర మివ్వబడుతుంది. చట్టంలో రూపొందించిన కొత్త సవరణ కారణంగా దరఖాస్తునందుకున్న 30 రోజులలోపు దరఖాస్తును తిరస్కరించడం గాని, ధృవపత్రాన్ని ఇవ్వడంగాని చేయాలి. డీలర్ల సాధక బాదకాలను దృష్టిలో ఉంచుకొని కాల నియమాన్ని ప్రత్యేకించి నిబంధించడం జరిగింది. దరఖాస్తును తిరస్కరించవలసి వస్తే డీలరుకు కారణాలను పేర్కొంటూ నోటీసును ఇవ్వాల్సి

*బి) బహుస్థానీయ పన్ను నుంచి ఏకస్థానీయ పన్నుకు మారడమనేది ఈ చట్టంలో వచ్చిన ప్రధానమైన మార్పు. మినహాయింపును కోరే డీలరు తన స్థానాన్ని నిరూపించుకోవడం ఈ విధానంలోనే సాధ్యం.*

*సి) చట్టరీత్యా కొన్ని ఫారములు, రాయితీలను పొందాలంటే విధిగా రిజిస్ట్రేషను ఉండి తీరాలి.*

## 12-ఎ. తొలగింపబడినది.

## 12-బి. తొలగింపబడినది.

## 13. డీలరు చేత టర్నోవరు యొక్క రిటర్ను సమర్పణ:-

ఈ చట్టము యొక్క 12వ సెక్షను క్రింద తనను రిజిష్టరు చేయించుకొనవలసిన బాధ్యత గల ప్రతి డీలరు ప్రెస్క్రైబ్ చేయబడినట్టి విధానము నందు, అట్టి కాల వ్యవధి లోపల మరియు అట్టి అథారిటీకి తన టర్నోవరునకు సంబంధించిన అట్టి రిటర్ను లేక రిటర్నులను సమర్పించ వలెను.

| |
|---|
| 17, 17-బి, 17-సి, 17-యఫ్, 18, 19-ఎ, 19-బి, 35, 37, 50, 54, 58 రూల్సును, ఫారములు ఎ-2, ఎ-5, బి-2, బి-3, సి, ఇ, యమ్ మరియు XXIXలను చూడుము. |

### వ్యాఖ్యానము

*ఈ సెక్షను రిజిస్ట్రేషనుకు గాని, పన్నుకుగాని, బాధ్యుడయ్యే ప్రతి డీలరు తన టర్నోవరునకు సంబంధించి రిటర్నులను దాఖలు చేయాల్సి యుంటుందని ఆదేశిస్తోంది. ఇది కర్తవ్యాదేశమైన (మాండెటరీ) నిబంధన కావడం వల్లడీలరు విధిగా పాటించి తీరాల్సి యుంటుంది. ప్రతి రిటర్నును (1) ప్రెస్క్రైబ్ చేయబడినవిధానముతో (2) సదరు వ్యవధిలో (పీరియడ్స్) (3) ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీలకు సమర్పించాల్సి యుంటుంది. ఏయే రిటర్నులను దాఖలు చేయాలో పరిశీలిద్దాము.*

***ఫారము 'ఎ' : అంచనా వేయబడిన టర్నోవరు యొక్క రిటర్ను :***

*7వ రూలు మరియు 9 (1) మరియు (2) రూల్సు దీనిని గురించి పేర్కొంటున్నాయి. ప్రధాన వ్యాపార ప్రదేశము మీద అధికార పరిధి కల అసెసింగ్ అథారిటీకి తన వ్యాపారమును ప్రారంభించిన 30 రోజుల లోపల ప్రతి డీలరు (క్యాజువల్ ట్రేడరు మినహా) ఈ రిటర్నును దాఖలు చేయవలసి యుంటుంది.*

***ఫారము 'ఎఎ' : క్యాజువల్ ట్రేడరు చేత, అంచనా వేయబడిన టర్నోవరు యొక్క రిటర్ను :***

*దీనిని 14వ రూలు వివరిస్తోంది. రాష్ట్రంలోకి క్యాజువల్ ట్రేడరు ప్రవేశించిన 24 గంటలలోపు ఈ రిటర్నును క్యాజువల్ ట్రేడరు దాఖలు చేయవలసి యుంటుంది.*

***ఫారము ఎ-1 : వార్షిక టర్నోవరును సూచించే రిటర్ను :***

*దీనిని 7 మరియు 15వ రూల్సు వివరిస్తున్నాయి. దీనిని 'ఎ' రిటర్నును దాఖలు చేసిన ప్రతి డీలరు మరియు షెడ్యూళ్ళలో పేర్కొనబడిన సరుకులందు వ్యాపారము చేయుచున్న ప్రతి డీలరు (టర్నోవరుతో నిమిత్తము లేదు) స్థానీయేతర డీలరుకు ఏజెంటుగా వ్యవహరించుచున్న ప్రతి వ్యక్తి (టర్నోవరుతో నిమిత్తము లేదు) సాధారణ సరుకులందు 50 వేలు టర్నోవరు దాటిన ప్రతి డీలరు ఈ రిటర్నును దాఖలు చేయవలసి యుంటుంది.*

***ఫారము ఎ-2 : నెలవారీ టర్నోవరు యొక్క రిటర్ను :***

*దీనిని 7వ, 17వ రూల్సు వివరిస్తున్నాయి.*

ఏ బ్యాంకింగు సంస్థ అయినా ప్రతి నెల తత్ పూర్వ నెలలో ముదరా ఇవ్వబడిన, క్లియర్ చేయబడిన లేక బదిలీ చేయబడిన సరుకులకు సంబంధించిన బిల్లులు మరియు తన చేత లేక తన ద్వారా వ్యాపారం జరుపబడిన సరుకుల కొనుగోలు లేక అమ్మకముకు సంబంధించిన వసూళ్ళు మరియు చెల్లింపుల రిటర్నును ప్రెస్క్రైబ్ చేయబడినట్టి విధానమునందు మరియు అట్టి వ్యవధిలోపల ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారమునందు సమర్పించవలెను.

56 - ఎ రూలును చూడుము.

## వ్యాఖ్యానము

*కాలక్రమంలో వ్యాపార వ్యవహారాలు బహుముఖంగా విస్తరించాయి. ఇందులో చెల్లింపులు, చెల్లింపులను స్వీకరించడం వంటి అంశాలే కాక డీలరు యొక్క ఆర్థికపరమైన లావాదేవీలను కూడా డీలరు తరపున బ్యాంకులే నిర్వ హించడం ఆరంభించాయి. వాణిజ్య పన్నుల శాఖలో సమర్పించబడిన రిటర్నుల యదార్థత్వాన్ని పరిశీలించేటప్పుడు ఒక నిర్దిష్ట వాస్తవము పూర్తిగా యదార్థమా కాదా? అన్నది తెలుసుకోవాల్సి వచ్చినప్పుడు సమాచారపు భోగట్టాకోసం వివిధ ఏజెన్సీలపై ఆధారపడాల్సి వస్తుంది. అయితే -వాణిజ్య బ్యాంకులు వ్యాపార సంబందమైన కారణాల వల్ల, కొన్ని పరిమితుల వల్ల తమ దగ్గరనున్న సమాచారాన్ని అందించటానికి సుముఖంగా యుండవు. అందువల్ల వాణిజ్య బ్యాంకులకు ఆదేశాత్మకంగా యుండేటట్లుగా ఈ సెక్షను రూపొందించబడింది.*

### 13 - సి. బిల్లులను జారీ చేయుటః

(1) సంవత్సరానికి లక్షరూపాయలకు తక్కువ కానట్టి మొత్తము టర్నోవరు కలిగిన ప్రతి డీలరు వందరూపాయలకు తక్కువ కానట్టి మొత్తమును ప్రమేయము కల్గినట్టి ప్రతి అమ్మకానికి సంబంధించి మరియు వంద రూపాయల కంటే తక్కువ మొత్తం ప్రమేయమున్న అమ్మకానికి సంబంధించి కొనుగోలు దారుని చేత అభ్యర్థించ బడినప్పుడు గాని ప్రెస్క్రైబ్ చేయబడిన బిల్లును లేదా నగదు మెమోరాండంను జారీచేయాలి. కొనుగోలు దారునికి జారీచేయబడిన అట్టి ప్రతి బిల్లు యందును సరుకుల యొక్క విలువ మరియు దానిపై వసూలు చేయబడిన పన్ను మొత్తము ప్రత్యేకముగా చూపబడవలెను.

45(2) వ రూలును, XIX వ ఫారమును చూడుము.

(2) (1)వ సబ్-సెక్షను యొక్క నిబంధనలు ఉల్లంఘించిన ప్రతి డీలరు అట్టి ప్రతి లోపానికి వెయ్యిరూపాయిల మొత్తము లేదా ప్రతి బిల్లులోని పన్ను బాకీకి అయిదురెట్లకు సమానమైన జరిమానా, ఏది ఎక్కువయితే దానికి, బాధ్యుడగును.

### 14. పన్ను యొక్క అసెస్‌మెంటు :-

(1) అసెసింగ్ అథారిటీ 13వ సెక్షను క్రింద సమర్పించబడిన ఏ రిటర్ను అయిననూ సరియైనది మరియు సంపూర్ణమైనది అని సంతృప్తిచెందినట్లయితే దాని ఆధారముగా డీలరు చెల్లించవలసిన పన్ను మొత్తాన్ని అసెస్ చేయవచ్చును. కాని ఆ రిటర్ను సరియైనది కానట్లు లేక అసంపూర్ణముగా నున్నట్లు కనిపించినట్లయితే అతని చేత సమర్పించబడిన రిటర్ను యొక్క సరిదనాన్ని మరియు సంపూర్ణత్వాన్ని నిరూపించుకొనేందుకు డీలరుకు హేతుబద్ధమైన అవకాశమును ఇచ్చిన తర్వాత మరియు తాను అవసరమని భావించునట్టి విచారణను చేసిన అనంతరము, డీలరు నుండి బాకీయైన పన్ను మొత్తమును తన యొక్క బెస్టు జడ్జిమెంటు రీత్యా అసెస్‌చేయవలెను. ఈ సెక్షను క్రింద అసెస్‌మెంటు, ఆ అసెస్‌మెంటు దేనికి చెందినదో ఆ సంవత్సర సమాప్తి నుండి మూడు సంవత్సరముల వ్యవధిలోపు చేయబడవలెను.

(సిసి) ఏ తగ్గింపు లేక మినహాయింపైననూ తప్పుగా అనుమతించబడిన సందర్భములలో చెల్లించాల్సిన సరైన పన్ను **మొత్తము**ను **అ**సెస్ చేయవలెను;

**(డి)** లైసెన్సు రుసుము చెల్లింపవల్సిన టర్నోవరును తనయొక్క బెస్టు జడ్జిమెంటు రీత్యా నిర్ణయించిన తర్వాత అట్టి లైసెన్సు రుసుమును శిధింపవలెను;

(ఇ) విధింపు నుండి తప్పుకొన్న రిజిస్ట్రేషను రుసుమును విధించవలెను;

(యఫ్) రిజిస్ట్రేషను రుసుముగాని లేక లైసెన్సు రుసుము గాని సరైన రేటు కన్నా తక్కువ రేటు చొప్పున విధింపబడిన సందర్భాలలో అట్టి రుసుము యొక్క సరియైన మొత్తమును విధించవలెను;

ఈ సబ్-సెక్షను క్రింద అసెస్ చేయబడిన పన్ను లేక విధింపబడిన రుసుముకు అదనంగా (8)వ సబ్-సెక్షను క్రింద నిర్దిష్టపర్చబడినట్టి జరిమానాను కూడా చెల్లించవలసినదిగా అసెసిగ్ అథారిటీ డీలరును ఆదేశించవచ్చును.

(4-ఎ) అసెస్మెంటు లేక విధింపు యొక్క ఏ ఉత్తర్వు అయినా డీలరుకు అందచేయబడిన తేదీ నుండి నాలుగు సంవత్సరముల వ్యవధి లోపు (4)వ సబ్-సెక్షను క్రింద ఏ అసెస్మెంటు లేక విధింపు యైనా చేయబడవలెను.

(4-బి) (2)వ సబ్-సెక్షను 93)వ సబ్-సెక్షను లేక (4)వ సబ్ సెక్షను క్రింద ఏ జరిమానా నైననూ చెల్లించమని ఏ ఆదేశము నైనా జారీ చేసే ముందు అసెసింగ్ అథారిటీ టర్నోవరును వెల్లడి చేయుటలో గాని, లేక ఏ వివరములనైననూ సరిగా సమకూర్చుటలోగాని గల కార్యలోపమును వివరించుటకు డీలరుకు హేతుబద్ధమైన అవకాశమును ఇవ్వవలెను మరియు తాను అవసరమని పరిగణించునట్టి విచారణను చేయవలెను.

(4-సి) (4)వ సబ్-సెక్షను కింద అసెసింగ్ అథారిటీకి దత్తము చేయబడిన అధికారములు, అట్టి అథారిటీ విషయమందు వర్తించునట్టి అవే షరుతులకు లోబడి సహాయ కమీషనరు (ఇంటలిజెన్స్), ఉపకమీషనరు మరియు సంయుక్త కమిషనరుతో సహా అసెసింగ్ అథారిటీ కంటే ఉన్నత అథారిటీల చేత కూడా వినియోగింపబడవచ్చును.

(5) ఏ కేసునందైనను హైకోర్టు చేత అనుదానము చేయబడిన ఏ "స్టే" ఉత్తర్వు కారణంగా గాని, లేక ప్రసక్తములో నున్న అసెస్మెంటుపై ప్రత్యక్ష ప్రభావము కలిగినట్టి చట్టపరమైన ప్రశ్నతో ప్రమేయమైన అప్పీలు లేక ఇతర ప్రొసీడింగ్సు హైకోర్టు లేక సుప్రీం కోర్టు ముందు పెండింగులో నుండిన వాస్తవం కారణంగా గాని, ఈ సెక్షను కింద ఒక అసెస్ మెంటు వాయిదావేయబడినపుడు అసెస్మెంటు చేయు నిమిత్తము ఈ సెక్షను నందు నిర్దిష్టపరచబడిన నాలుగు సంవత్సరములు లేక ఆరు సంవత్సరముల, సందర్భానుసారముగా ఏదయితే అది, కాలవ్యవధిని లెక్కించేటప్పుడు, అట్టి స్టే ఉత్తర్వు అమలులోనున్నట్టి లేదా అట్టి అప్పీలు లేదా ప్రొసీడింగు పెండింగులో నున్నట్టి వ్యవధి మినహాయించబడవలెను.

(6) వాణిజ్య పన్నుల కమీషనరు తనకు నిర్దేశితమైన ఏదైనా ప్రశ్నను పెండింగులో నుంచుతూ అట్టి ప్రశ్న అసెస్మెంటుపై ప్రత్యక్ష ప్రభావము కల్గియున్నప్పుడు అసెసింగ్ అథారిటీని సామాన్య లేక విశేష ఆదేశము ద్వారా ఏదైనా సరుకుల వర్గానికి సంబంధించి గాని లేక ఏదేని డీలర్ల వర్గానికి సంబంధించి గాని అసెస్మెంటును వాయిదా వేయమని ఆదేశించుట చట్ట రీత్యా యోగ్యమైనదే. అసెస్మెంటు కొరకు ఈ సెక్షను క్రింద నిర్దిష్టమయ్యే నాలుగు సంవత్సరాల లేక ఆరు సంవత్సరాల కావ్యవధిని, సందర్భానుసారముగా ఏదైతే అది, లెక్కించేటప్పుడు సదరు ఆదేశము ఇవ్వ

వ్యవహరించబడుతుంది. ఈ అసెస్‌మెంటు అనేది చట్టంలో చాలా ప్రాముఖ్యాన్ని వహిస్తుంది. ఎందువల్లనంటే అసెస్‌మెంటు జరగని పన్ను ఏ ప్రమాణంలో ఉంటుందో తెలియదు కాబట్టి పన్ను విధింపు కష్టమౌతుంది. **"పన్ను విధించబడనిదే వసూలు చేయబడరాదనేది"** స్థిరపడిన సూత్రం. అందువల్ల పన్ను వసూలు చేయబడదు. అంతిమంగా చట్టం పరమార్థమైన రాష్ట్ర రెవిన్యూ ప్రయోజనాలు దెబ్బతింటాయి. కాబట్టే 'అసెస్‌మెంటు' అతి కీలకమైన సాంకేతికాంశంగా భావించడం జరుగుతోంది.

*(1) వ సబ్ - సెక్షను అసెస్‌మెంటు జరిగే కార్యసరళిని (ప్రొసీజరును) వివరిస్తోంది. డీలరు 13వ సెక్షను క్రింద రిటర్నులను సమర్పిస్తాడు. అట్లా సమర్పించబడిన రిటర్నులను రెండు అంశాల ఆధారంగా అసెసింగ్ అథారిటీ పరిశీలించ వలసి యుంటుంది.*

*1) సమర్పించిన రిటర్ను సరైన దేనా?*

*2) సమర్పించిన రిటర్ను సంపూర్ణమైనదేనా?*

ఈ రెండు విషయాలపై సదరు అథారిటీ సంతృప్తి చెందితే ఆ రిటర్నును అంగీకరించి పన్నును నిర్ణయించవచ్చు, కాని పక్షంలో తనకు ఉచితమనిపించిన బెస్టు జడ్జిమెంటు రీత్యా పన్నును అసెస్ చేయవచ్చును. అయితే ఇలా బెస్టు జడ్జిమెంటు రీత్యా అసెస్ చేసేటప్పుడు విధిగా ఈ క్రింది విషయాలను పాటించాలి.

*1) సమర్పించిన రిటర్నులు సరైనవేనా అనేది పరిశీలించేందుకు వీలుగా విచారణ చేయాలి.*

*2) డీలరును తాను సమర్పించిన రిటర్ను సరైనదని, సంపూర్ణమైనదని నిరూపించుకోమని కోరాలి. ప్రతి అసెస్‌మెంటు అది ఏ సంవత్సరానికి చెందిందో దాని నుంచి మూడు సంవత్సరాల లోపు జరగాలి. అయితే ఈ సందర్భంలో కొన్ని క్లాజులపై కోర్టులిచ్చిన తీర్పులు చాలా ఆసక్తి దాయకంగా ఉన్నాయి.*

*'అనిపించినప్పుడు' అన్న మాటకు కేవలం అనుమానం గాని సందేహం గాని అని అర్థం కాదు. సహేతుకమైన నమ్మకం అని చెప్పుకోవాలి. అంటే ఒక విషయాన్ని నమ్మడానికి కావల్సిన సమాచారంగాని, భోగట్టాగాని తనవద్ద ఉండాలి.*

***హేతుబద్ధమైన అవకాశం :*** *ఇది అసెసింగ్ అథారిటీ ఇష్టాయిష్టాల మీద ఆధారపడి యుండదు. న్యాయ సమ్మతంగా యోగ్యంగా ఉండే అవకాశమని భావించాలి.*

***బెస్టు జడ్జిమెంటు అంటే ఏమిటి?***

తన ముందున్న సమాచారం, భోగట్టా ఆధారంగా అసెసింగ్ అథారిటీ టర్నోవరు గురించి ఊహిస్తాడు. అది కేవలం ఊహాజనితం కారాదు. తన ముందున్న సమాచారాన్ని నిజాయితీతో కూడిన వాస్తవికమైన అంచనా చేసినప్పుడు మాత్రమే అది బెస్టు జడ్జిమెంటు అనిపించుకుంటుంది. ఇలా న్యాయ నిర్ధారణ చేసేటప్పుడు పక్షపాత రహితంగా, వేధించే ఉద్దేశ్యం లేకుండా, దురుద్దేశ్యము ఏదీ లేకుండానే చేయాలి. ఇలా న్యాయ నిర్ధారణ ఫలానా ప్రకారంగానే చేయాలని కూడా నిర్ణయించలేమని కోర్టులు తీర్పునిచ్చాయి. తన మానసిక, బుద్ధిపరమైన శక్తులను నిజాయితీగా వినియోగిస్తూ తన ముందున్న సమాచారాన్ని, వాస్తవాలను సమన్వయించుకొని టర్నోవరును నిర్ణయించవలసి యుంటుంది.

కొన్ని సందర్భాలలో అధికార యంత్రాంగం ఆకస్మిక తనిఖీలను జరిపి కొంత టర్నోవరు లెక్కల్లో చూపబడనట్లు కనుగొనవచ్చు. అలాంటి సందర్భాలలో డీలరు రిటర్నును సరిచేసి, మార్చి దాఖలు చేసినట్లయితే అట్లా సమర్పించబడిన రిటర్ను సరైనది కాదని, సంపూర్ణమైనదికాదని అసెసింగ్ అథారిటీ నిర్ణయించవచ్చు. అయితే ఇందుకు ముందుగా డీలరుకు అవకాశమిచ్చి తీరాలి.

*(2) వ సబ్ - సెక్షను జరిమానా విధించేందుకు అవకాశమిస్తోంది. దేనికి ఏ రూపంగా జుల్మానా విధించాలో (8)వ సబ్-సెక్షను వివరిస్తోంది. ఇది పన్ను గాక అదనంగా చెల్లించబడే మొత్తము, డీలరు తన రిటర్నులో యదార్థంగా చూపాల్సిన టర్నోవరును చూపనప్పుడే ఇది తలెత్తుతుంది. జరిమానా విధించేముందు తప్పనిసరిగా తన వాదనను వినిపించుకొనేందుకు డీలరుకు అవకాశమివ్వాలి. అయితే - జరిమానా విధించేటప్పుడు సాధారణంగా ఈ క్రింది సూత్రాలు పాటించబడతాయి.*

(6)వ సబ్ - సెక్షను కూడా కాలపరిమితిని మరొక సందర్భంలో విస్తృతి పరుస్తోంది. ఇది ఈ క్రింది సందర్భాలలో తలెత్తుతుంది.

శాఖవారి యోచనా విధానం స్పష్టీకరించమని కమీషనరును నిర్దిష్టంగా ఎవరైనా కోరినట్లైతే దానితో ప్రభావితమయ్యే అసెస్‌మెంటులనన్నిటినీ వాయిదా వేయమని కమీషనరు కోరవచ్చును. అలాంటి సందర్భాలలో స్పష్టీకరణ వెలువడే దాకా ఉన్న వ్యవధిని సాధారణ కాలపరిమితి నుంచి తీసివేయవచ్చును.

కొన్ని సందర్భాల్లో అంతకు ముందు చేయబడిన అసెస్‌మెంటులను కోర్టులు రద్దు పరచవచ్చు. అలాంటి సందర్భాలలో కూడా స్వతహాగా మొటి పర్యాయం అసెస్‌మెంటు జరిగినప్పటి నుంచి కోర్టు రద్దు పరచే పర్యంతము ఉన్న కాల వ్యవధిని కాల పరిమితి గణనం నుంచి మినహాయించాలి. ఈ విషయాన్ని (7)వ సబ్ - సెక్షను స్పష్టం చేస్తుంది.

డీలరుకు నోటీసు నివ్వగానే కొన్ని సందర్భాల్లో డీలరు తన రిజిస్టర్లు వగైరా సమర్పించడంలో ఆలస్యం చేసినందువల్ల సకాలంలో అసెస్‌మెంటు పూర్తిగాక కాలం చెల్లిపోవడం జరుగుతుంది. మరికొన్ని సందర్భాలలో డీలర్లు తమ సంజాయిషీలను సమర్పించడంలో కూడా ఆలస్యం చేయడం వల్ల కూడా ఈ ఇబ్బంది కల్గుతోంది. అలాంటి సమయాల్లో అధికార వర్గం జవాబు దారీగా మారే ప్రమాదముంది. దీనిని దృష్టిలో ఉంచుకొనే (7-ఎ) సబ్ - సెక్షను రూపొందించబడింది.

దీని ప్రకారం లెక్కల్ని అసెస్‌మెంటు నిమిత్తం దాఖలు చేయమని అధికారి కోరినప్పటి నుంచి డీలరు వాస్తవంగా లెక్కల్ని దాఖలు చేసే పర్యంతం ఉన్న వ్యవధిని మినహాయించి కాల పరిమితిని గణించాలి.

అసెస్‌మెంటు నోటీసు జారీ అయినప్పటి నుంచి వాస్తవంగా అభ్యంతరాలను దాఖలు చేసిన తేదీ వరకు ఉన్న వ్యవధిని కూడా మినహాయించవచ్చు.

(8)వ సబ్ - సెక్షనులో అపరాధాలు (1) ఉద్దేశ్యపూర్వకంగా ఉండేవి (2) ఉద్దేశ్య పూర్వకం కానివి అని రెండు తరగతులుగా విభజించబడ్డాయి. సబ్ - సెక్షను (2) (3) (4) నందున్న అపరాధాలు లేదా వైఫల్యాలు ఉద్దేశ్య పూర్వకంగా జరిగాయని అసెసింగ్ అథారిటీ నమ్మితే విధించదగిన పన్ను లేదా రుసుముకు 3 రెట్లు జరిమానాను విధించవచ్చు. సదరు వైఫల్యం లేదా అపరాధం ఉద్దేశ్యపూర్వకం కానట్లైతే పన్ను లేదా రుసుములో సగభాగాన్ని మాత్రమే విధించవచ్చు.

## 14 - ఎ ధరల మార్పుల సందర్భము నందు అసెస్‌మెంటు :-

17 - హెచ్ రూలు మరియు ఫారము ఎ - 7 ను చూడుము.

(1) 14వ సెక్షను నందు ఏమున్నప్పటికినీ,

(ఎ) ధరల మార్పుల కారణంగా ఏ సంవత్సరమునందైననూ, తత్పూర్వ సంవత్సరము నందు అతని చేత స్వీకరించబడినట్లయితే ఆ సంవత్సరపు అతని టర్నోవరు నందు చేర్చదగినట్టిదైన, ఏదైనా మొత్తమును డీలరు స్వీకరించినట్లయితే, దేనియందు అట్టి మొత్తము స్వీకరింపబడినదో ఆ సంవత్సరాంతము నుండి ముప్పై రోజుల లోపు అతను ప్రిస్క్రైబ్ చేయబడినట్టి ఫారము నందు అసెసింగ్ అథారిటీకి ఒక రిటర్నును సమర్పించవలెను మరియు ఆ మీదట అసెసింగ్ అథారిటి అట్టి మొత్తముపై చెల్లింపదగిన పన్నును అసెస్ చేయుటకు ఉపక్రమించవలెను.

(బి) క్లాజు (ఎ) క్రింద సమర్పించబడిన ఏ రిటర్ను అయిననూ సరియైనది మరియు సంపూర్ణమైనది అని అసెసింగ్ అథారిటీ సంతృప్తి చెందినట్లయితే అతడు దాని యొక్క ఆధారముపై ఆ డీలరుచేత చెల్లింపబడవలసిన పన్ను మొత్తమును అసెస్ చేయవచ్చును. కాని అట్టి రిటర్ను సరియైనది కానిదిగా మరియు సంపూర్ణమైనది కానిదిగా అతనికి కన్పించినట్లయితే, తనచేత సమర్పించబడిన రిటర్ను యొక్క సంపూర్ణత్వము మరియు సరిదనమును

## వ్యాఖ్యానము

పన్నును ఎగవేసే ఉద్దేశ్యంతో కొన్ని సందర్భాల్లో కొందరు డీలర్లు వాస్తవానికన్నా చాలా తక్కువ ధరల్ని తమ లెక్కల్లో చూపించవచ్చు. ఇట్టి విషయం అసెసింగ్ అథారిటీ దృష్టికి వస్తే అప్పటికే అసెస్‌మెంట్ పూర్తి అయినప్పటికీ తిరిగి అసెస్‌మెంటును అసెస్‌మెంటు ఆదేశాలందిన 3 సంవత్సరములలోపు ఎప్పుడైనా చేయవచ్చు. తిరిగి చేసే అసెస్‌మెంటును ప్రొసీజరునంతా పాటించిన తర్వాత బెస్టు జడ్జిమెంటు రీత్యా చేయవచ్చును. చాలా సంస్థలు తమ అమ్మకాల బిల్లులలో తక్కువ ధరను సూచించడం వల్ల ప్రభుత్వాదాయానికి పెద్ద ఎత్తున గండి పడింది. దీనిని నివారించేందుకు ఈ ప్రత్యేక సెక్షనును ఏర్పరచడం జరిగింది. అయితే- ఈ సెక్షను ద్వారా దత్తం చేయబడిన అధికారాలను అదుపు లేని విధంగా, నిరంకుశంగా కూడా అసెస్ చేసే అధికారులు వినియోగించవచ్చా? అలాంటి పరిస్థితి ఉత్పన్నమవుతుందనే హైకోర్టు "డీలక్సు వైన్సు, హైదరాబాదు వర్సెస్ ఆంధ్ర ప్రదేశ్" కేసులో తీర్పు చెప్పింది. వర్తమాన మార్కెట్టు విలువను నిర్ణయించేందుకు శాసన సభ మార్గదర్శక సూత్రాలను కూడా రూపొందించి ఉంటే బాగుండేదని అభిప్రాయపడింది.

### 14-సి : మొత్తము టర్నోవరుపై పన్ను చెల్లించుటకు ప్రత్యేక నిబంధన :

(1) ఈ సెక్షను యొక్క (1) (2) నుంచి (5) వరకు గల సబ్ - సెక్షనులందు నిర్దిష్ట పర్చబడిన షరతులకు లోబడి క్యాజువల్ ట్రేడర్ లేదా స్థానికేతర డీలరు యొక్క ఏజెంటు లేదా కేంద్ర అమ్మకపు పన్ను చట్టము, 1956 యొక్క 7వ సెక్షను క్రింద రిజిస్టరైన, డీలరు కంటే భిన్నమైనవాడైయుండి సంబంధిత అసెస్‌మెంటు సంవత్సరానికి అయిదులక్షల రూపాయిలు దాటనట్టి టర్నోవరు కలిగిన ఏ డీలరయిననూ మొత్తము టర్నోవరుపై రెండు శాతము రేటు చొప్పున పన్ను మొత్తాన్ని ఈ చట్టము యొక్క ఇతర నిబంధనల క్రింద చెల్లించ వలసిన పన్నుకు బదులుగా తన ఇచ్ఛా పూర్వకంగా చెల్లించ వచ్చు.

| 15-సి రూలును, ఫారము ఎ-9, డి-2, డి-3, బి-7 లను చూడుము. |
|---|

(2) ప్రభుత్వము చేత ఆయా సమయాల్లో నోటిపై చేయబడునట్టి వస్తువులందు వ్యాపారము చేస్తున్న డీలర్లకు ఈ సెక్షను యొక్క నిబంధనలు వర్తించవు.

(3) ఏ డీలరయిననూ ఈ చట్టము క్రింద రిజిస్ట్రేషను తేదీ నుంచి మూడు సంవత్సరముల పాటు (1)వ సబ్ - సెక్షను క్రింద పన్ను చెల్లించేందుకు ఎంపిక చేసుకొనుటకు అర్హుడు కాదు.

(4) అంతకు ముందున్న మూడు సంవత్సరాలలో ఏ సంవత్సరమునందైనా డీలరు యొక్క మొత్తము టర్నోవరు అయిదు లక్షల రూపాయిలు దాటినట్లైతే అతడు (1)వ సబ్ - సెక్షను క్రింద పన్ను చెల్లించేందుకు ఎంపిక చేసుకొనుటకు అర్హుడు కాదు.

(5) ఏ డీలరయినా ప్రభుత్వానికి పన్ను చెల్లించుటలో మూడు సంవత్సరముల లోపు బకాయిలున్నట్లయితే మరియు తత్పూర్వ 3 సంవత్సరములందు ఏ సంవత్సరము నందైనా చట్టము యొక్క 14 (4) సెక్షను క్రింద ఎవరికి వ్యతిరేకంగా ప్రొసీడింగ్సు పెండింగులో నున్నవో లేదా చర్య తీసుకొనబడినదో అట్టి ఏ డీలరైననూ (1)వ సబ్ - సెక్షను క్రింద పన్ను చెల్లించేందుకు ఎంపిక చేసుకొనుటకు అర్హుడు కాదు.

(6) ప్రిస్క్రైబ్ చేయబడినట్టి పద్ధతి యందు సదరు వివరాలు మరియు నిరూపణతో డీలరు తన రిటర్ను దాఖలు చేసినపుడు (1)వ సబ్ - సెక్షను క్రింద పన్ను అసెస్‌మెంటు పూర్తి అయినట్లుగా భావించబడును.

(7) (1) వ సబ్ - సెక్షను క్రింద డీలరు చేత దాఖలు చేయబడిన రిటర్ను సరియైనది కానిదిగా లేక అసమగ్రమైనదిగా

(ii) అసెస్‌మెంటు సంవత్సరము నందు పన్నుకు అర్హమైన నికర టర్నోవరు యందు పెరుగుదల అంతకు ముందు సంవత్సరము అట్టి టర్నోవరుపై ఇరవై అయిదు శాతము కంటే తక్కువ ఉన్నప్పుడు లేదా;

(iii) అంతకు ముందు మూడు సంవత్సరములలో ఏ సంవత్సరమునందైననూ డీలరు యొక్క మొత్తము టర్నోవరు ఇరవై అయిదు లక్షల రూపాయిలు దాటినట్లయితే; లేదా

(iv) డీలరు ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్ను బకాయిల్లో ఉన్నప్పుడు; లేదా

(v) ఒక డీలరు తన వ్యాపారము యొక్క టర్నోవరులో కొంత భాగము లేదా మొత్తమును నిగ్రహించెనని నమ్ముటకు లేదా డీలరు పన్ను చెల్లింపును ఎగవేయుచున్నాడని నమ్ముటకు డీలరు యొక్క వ్యాపార ప్రదేశము యొక్క తనిఖీ పై లేదా మరే విధంగానైనా కారణం ఉన్నప్పుడు; లేదా

(vi) అంతకు ముందు మూడు సంవత్సరములలో ఏ సంవత్సరము నందైననూ ఏదైనా ప్రొసీడింగు పెండింగులో ఉన్నప్పుడు లేదా చట్టము యొక్క 14 (4) లేదా 14 (8) సెక్షన్ల క్రింద చర్య తీసికొనబడినపుడు; లేదా

(vii) సంబంధిత సంవత్సరం జరుగుతున్న కాలములో వే బిల్లులు, సి- ఫారమ్‌లు, యఫ్ - ఫారమ్‌లు, హెచ్ - ఫారమ్‌లు మరియు జి-ఫారమ్‌లు వంటి చట్ట సంబంధమైన ఫారమ్‌ల వాడకం యొక్క వివరాలను దాఖలు చేయుటలో డీలరు విఫలమైనట్లయితే.

(4) సవివరమయిన సూక్ష్మ పరిశోధన మరియు పరిశీలన అవసరమని భావించిన సందర్భములో 14వ సెక్షను క్రింద అసెస్‌మెంటు చేయుటకు కావలసినంత మంది డీలర్ల రిటర్న్‌లను అసెస్ చేయుటకు అసెసింగ్ అథారిటీకి అర్హత కలదు.

(5) (1)వ సబ్ సెక్షను క్రింద ఒక రిటర్ను దాఖలు చేయబడిన అన్ని సందర్భములందు, (3) వసబ్ - సెక్షను క్రింద లేదా (4)వ సబ్ - సెక్షను క్రింద అసెస్‌మెంటు చేపట్టబడనప్పుడు అట్లు దాఖలు చేయబడిన రిటర్ను అనుమతించబడినట్లుగా భావించబడును మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన విధానము నందు ఉత్తర్వులు పాస్ చేయబడవలెను.

(6) 14వ సెక్షను యొక్క (4) వ సబ్-సెక్షను నిబంధనలు ఈ సెక్షను క్రింద అసెస్‌మెంటుకు అవసరమయిన మార్పులలో సందర్భోచితంగా వర్తించును.

## వ్యాఖ్యానము

*14 -డి సెక్షను క్రింద, 25 లక్షల రూపాయల కన్నా తక్కువ టర్నోవరు గల డీలరు టర్నోవరు యొక్క స్వయం అసెస్‌మెంటుకు హక్కుదారుడు మరియు సంవత్సరము యొక్క ముగింపు నుండి ముప్పై రోజులలోపు ఒక రిటర్నుని దాఖలు చేయవలెను. క్యాజువల్ ట్రేడరు లేదా 14-సి సెక్షను క్రింద చెల్లింపును ఎంపిక చేసుకొన్న డీలరు లేదా స్థానికేతర డీలరు యొక్క ఏజెంటు చేత ఈ సెక్షను క్రింద స్వయం అసెస్‌మెంటు యొక్క సౌకర్యము ఉపయోగించుకొనబడరాదు.*

*17 లేక 15వ రూలు క్రింద, సందర్భానుసారముగా ఏదయితే అది, దాఖలు చేయబడవలసిన ఎ2 లేక ఎ1 రిటర్నులకు అదనముగా ఈ సెక్షను క్రింద ఒక రిటర్నుని డీలరు దాఖలు చేయవలెను.*

*క్రొత్తగా రిజిస్టరు అయిన డీలర్లు రిజిస్ట్రేషను తేదీ నుండి మూడు సంవత్సరముల వరకు స్వయం అసెస్‌మెంటు కొరకు రిటర్నును దాఖలు చేయుటకు అర్హులు కారు.*

*స్వయం అసెస్‌మెంటు కొరకు డీలరు చేత దాఖలు చేయబడిన రిటర్ను ఈ క్రింది సందర్భాలలో అంగీకరించబడదు.*

*ఎ) డీలరు చేత దాఖలు చేయబడిన రిటర్ను సరిఅయినది లేక సమగ్ర మయినది కానపుడు లేదా దానిపై బాకీ అయిన పన్ను పూర్తిగా చెల్లించబడనట్లైతే,*

(2) ఏదేని కాలవ్యవధి కొరకు చేయబడిన తాత్కాలిక అసెస్‌మెంటు అతి తక్కువ టర్నోవరుపై లేకఅతి తక్కువ రేటుతో లేదా అతి ఎక్కువ టర్నోవరుపై లేక అతి ఎక్కువ రేటుతో చేయబడినదని అసెసింగ్ అథారిటీ నమ్మడానికి కారణమున్నట్లయితే, అతడు అట్టి తాత్కాలిక అసెస్‌మెంటును, సందార్భానుసారంగా ఏదయితే అది, హెచ్చించవచ్చు లేదా తగ్గించవచ్చు.

అయితే- పైన చెప్పబడిన విధంగా తాత్కాలిక అసెస్‌మెంటు యొక్క హెచ్చింపు చేసేముందు అసెసింగ్ అథారిటీ తత్పూర్వ సంవత్సరము కొరకు అంతిమముగా నిర్ణయించబడిన టర్నోవరు ఆధారముగా అట్టి, హెచ్చింపు చేయు నపుడు తప్ప డీలరులకు దానిపై ఒక నోటీసును జారీ చేయవలెను మరియు తాను అవసరమని భావించిన అట్టి విచారణను చేయవలెను.

(3) తాత్కాలికముగా అసెస్ చేయబడిన పన్ను సంవత్సర క్రమం నందు ముందుగా నెలవారీ లేక ఇతర ప్రెస్క్రైబ్ చేయబడిన వాయిదాల యందుగానీ లేదా తరువాత ఏ సమయము నందైనా ఏకమొత్తంగా గాని విధించబడి మరియు వసూలు చేయబడవచ్చును.

(4) పన్ను చెల్లించుటకు బాధ్యమగు ఏ డీలరైననూ, ఈ చట్టము యొక్క నిబంధనలు లేదా దాని క్రింద చేయబడిన రూల్సు చేత అపేక్షితమైన విధంగా రిటర్ను సమర్పించడంలో విఫలమయిన లేక 13వ సెక్షను క్రింద అతని చేత సమర్పించ బడిన రిటర్ను ఆధారంగా పన్ను బాకీని చెల్లించటంలో విఫలమయిన లేక తాత్కాలికముగా అసెస్ చేయబడిన పన్నును చెల్లించటంలో విఫలమయిన వారెవరైనా జరిమానా రూపముగా

(ఎ) డీలరు పన్నును కొనుగోలుదారు నుండి చార్జిచేసినపుడు పన్నుకు సమానమైన మొత్తాన్ని; మరియు

(బి) ఏ ఇతర సందర్భమునందైనా పన్ను మొత్తంలో సగభాగమును మించని మొత్తాన్ని చెల్లించుటకు బాధ్యుడగును.

అయితే - అట్టి జరిమానాను విధించుటకు ముందు అసెసింగ్ అథారిటీ డీలరుకు తన వాదాన్ని విన్పించుకొనేందుకు హేతుబద్ధమైన అవకాశాన్ని ఇవ్వాలి.

## వ్యాఖ్యానము

ఈ విధానము క్రింద అసెసింగ్ అథారిటీ తాత్కాలికంగా సంవత్సరానికి చెల్లించవలసిన పన్నులను లేదా నెలవారీ చెల్లించవలసిన పన్నులను అసెస్ చేయటానికి వీలు కల్పిస్తోంది. సంవత్సరాంతంలో 30 రోజుల లోపు ఆ సంవత్సరానికైన మొత్తం టర్నోవరు లేదా నికర టర్నోవరును సూచిస్తూ ఎ-1 రిటర్నును దాఖలు చేయాల్సి యుంటుంది.

*(1) 10 లక్షల రూపాయల కన్నా తక్కువ 'మొత్తము టర్నోవరు' కల్గిన ప్రతి డీలరు (2) 12 వేల రూపాయలకు మించని పన్నుకు బాధ్యమయ్యే ప్రతి డీలరు ఈ తాత్కాలిక అసెస్‌మెంటుకు బాధ్యులౌతారు.*

*(1) వ సబ్-సెక్షను ప్రకారము అంచనా వేయబడిన టర్నోవరు లేదా 9 (1) మరియు 9 (2) రూల్సు ప్రకారము దాఖలు చేయబడిన రిటర్నుల ఆధారంగా సంవత్సర కాలంలో ముందుగానే తాత్కాలిక అసెస్‌మెంటు జరిపేందుకు వీలు కల్పించబడింది. అట్టి అసెస్‌మెంటు ద్వారా తేల్చబడిన పన్ను నెలవారీ లేదా ఇతర ప్రెస్క్రైబ్ చేయబడిన వాయిదాలలో చెల్లింపబడవలసి యుంటుంది.*

*(2)వ సబ్-సెక్షను అసెసింగ్ అథారిటీకి సంవత్సర కాలం జరుగుతున్నప్పుడు అవసరమైతే టర్నోవరులను గాని లేదా పన్ను రేట్లను గాని మార్పు చేయటానికి వీలు కల్పిస్తోంది. అయితే టర్నోవరులను గాని పన్ను రేట్లను గాని మార్పు చేసే ముందు డీలరుకు అవకాశాన్ని ఇవ్వవలసి యుంటుంది. అయితే అంతకు ముందు సంవత్సరపు టర్నోవరు ఆధారంగా మార్పు చేస్తే అట్టి నోటీసును ఇవ్వవలసిన అవసరము లేదు.*

విరమణ లేక రద్దు సంభవించిన, ఆ ప్రొసీడింగు విరమణ లేక రద్దు సంభవించిన సమయమునందు సదరు ఫరం యొక్క భాగస్వామి లేక సదరు హిందూ అవిభక్త కుటుంబము లేక అసోసియేషను యొక్క సభ్యుడు, సందర్భానుసారముగా ఎవరయితే వారు, లేదా మరణించిన ఏ అట్టి వ్యక్తి యొక్క చట్టపరమైన ప్రతినిధి యైన ప్రతివ్యక్తిపై సదరు విరమణ లేక రద్దు సమయమునందు ఆ ప్రొసీడింగు ఏ దశ వద్ద ఉండినదో అచటి నుండి కొనసాగించబడును మరియు ఈ చట్టపు అన్ని నిబంధనలు వలసినంత మేరకు, తదనుసారముగా వర్తించును.

## వ్యాఖ్యానము

ఒక్కొక్కప్పుడు వ్యాపారం చేస్తున్న హిందూ అవిభక్త కుటుంబము, అసోసియేషన్లు, ఫరములు తమ వ్యాపారాన్ని తాత్కాలికంగా గాని, శాశ్వతముగా గాని విరమించవచ్చు లేదా కారణాంతరాల వల్ల రద్దు చేసుకోవచ్చు. అలాంటి సందర్భాలలో అసెస్‌మెంటు, పన్ను విధింపు, వసూలు విషయంలో చాలా క్లిష్టత ఏర్పడవచ్చు. అలాంటి సందర్భాలలో అసెస్‌మెంటు వగైరా ఎలా చేయాలో ఈ సెక్షను వివరిస్తోంది. వాస్తవంగా విరమణ లేదా రద్దు పరచటం జరిగినప్పటికీ సాంకేతికంగా జరగనట్లే భావించుకొని అసెస్‌మెంటు వంటివి జరపాలని ఈ సెక్షను పేర్కొంటోంది. ఏదైనా ప్రొసీడింగు జారీ అయిన తర్వాత రద్దు కావడం లేక విరమించడం జరిగితే ఏమి చేయాలి? అనే ప్రశ్నకు (2)వ సబ్ - సెక్షను సమాధానం చెప్తోంది. సంస్థలో భాగస్వామి, హిందూ అవిభక్త కుటుంబ సభ్యుడు, అసోసియేషను సభ్యుడు, చట్టపరమైన ప్రతినిధి ఎవరుంటే వారి మీద చర్య తీసుకొనవచ్చునని ఈ సెక్షను చెప్తోంది.

## 16. చట్టము క్రింద చెల్లింపవలసిన పన్ను మరియు ఇతర బాకీల చెల్లింపు :

(1) ఈ చట్టము యొక్క నిబంధనల క్రింద తాత్కాలికముగా గాని లేక అంతిమముగా గాని అసెస్ చేయబడిన పన్ను మరియు విధించబడిన జరిమానా, సదరు నోటీసు నందు నిర్దిష్టమయ్యే అట్టి విధానమునందు మరియు జరిమానా విధింపు లేక అసెస్‌మెంటు నోటీసు అందచేయబడిన తేదీ నుండి పదిహేను రోజులకు తగ్గని అట్టి సమయము లోపల డీలరుచేత చెల్లించబడవలెను.

అయితే- ఈ సబ్ సెక్షను క్రింద ఒక నోటీసుకు సంబంధించిన పదిహేను రోజుల కాల వ్యవధి క్యాజువల్ ట్రేడర్లకు వర్తించదు.

అంతే గాక - అసెసింగ్ అథారిటీ, వ్రాతపూర్వకముగా రికార్డు చేయదగిన యోగ్యమైన మరియు తగిన కారణముల కొరకు డీలరును, అసెస్ చేయబడిన పన్ను లేక విధింపబడిన జరిమానాను, అసెస్ మెంటు నోటీసు అందచేయ బడిన తేదీ నుండి ఏడు రోజులకు తగ్గని, నోటీసు నందు నిర్దిష్టపరిచే అట్టి సమయములోపల చెల్లింప వలసినదిగా అపేక్షించవచ్చును.

62వ రూలును చూడుము.

(2) (ఎ) (1)వ సబ్ - సెక్షను నందు ఏమున్నప్పటికినీ, అసెసీ చేత చేయబడిన దరఖాస్తుపై ఉపకమీషనరు ప్రతి కేసు యొక్క పరిస్థితులను పరిగణనలోనికి తీసుకుని, ఉత్తర్వు ద్వారా ఈ చట్టము క్రింద బాకీయైన ఏ పన్ను, జరిమానా లేక ఇతర మొత్తము యొక్క చెల్లింపు కొరకు సమయమును పొడిగించ వచ్చును లేదా సదరు ఉత్తర్వు నందు నిర్దిష్టమయ్యే అట్టి షరతులకు లోబడి మరియు అట్టి వ్యవధుల లోపల అట్టి వాయిదాల యందు ఆ యొక్క చెల్లింపును అనుమతించ వచ్చును.

(బి) సదరు చెల్లింపుకు సమయము యొక్క పొడిగింపు అనుమతించబడిన లేదా వాయిదాల యందు సదరు చెల్లింపు అనుమతించబడిన ప్రతి కేసునందు, డీలరు సదరు పన్ను, జరిమానా, వాయిదా లేక ఇతర మొత్తమునకు అదనంగా

అలా సకాలంలో పన్ను, జరిమానా, వాయిదాను గాని చెల్లించక పోతే ప్రతి వంద రూపాయలకు, లేదా అందులో భాగం పై గాని నెలకు లేదా అందులో భాగంపై గాని ఒక రూపాయి యాభై పైసల చొప్పున వడ్డీని చెల్లించాల్సి యుంటుందని ఈ సెక్షను వడ్డీ వసూలు చేయడానికి అవకాశాన్ని ఇస్తోంది.

*(4)*వ సబ్ - సెక్షను ప్రకారం చెల్లించాల్సిన పన్నును గాని, విధింపబడిన జరిమానాను గాని, చెల్లించాల్సిన వడ్డీని గాని, వాయిదాను గాని, రిజిస్ట్రేషను రుసుమును గాని సకాలంలో చెల్లించకపోయినట్లయితే ఆ మొత్తాన్ని భూమి శిస్తు బకాయిగా వసూలు చేయవచ్చు. రెవెన్యూ రికవరీ చట్టం ప్రకారం, కలెక్టరుగాని, కలెక్టరు చేత అధికారమివ్వబడిన తహశీల్దారు హోదాకు తగ్గని అధికారి గాని చెల్లించబడని రెవెన్యూ బకాయిలను వసూలు చేసుందుకు స్థిర, చరాస్తులను జప్తు చేయవచ్చు. వాటిని వేలం ద్వారా అమ్మి రావల్సిన మొత్తాన్ని ప్రభుత్వ ఖజానాకు జమ చేయవచ్చు. అమ్మకపు పన్నులకు సంబంధించిన బకాయిలను రెవెన్యూ బకాయిలుగా పరిగణించడం వల్ల రెవెన్యూ రికవరీ చట్టం క్రింద బలాత్కార విధానాలతో కూడా వసూలు చేయడానికి ఆస్కారము కల్పించబడింది.

పన్నుల వసూలు విధానంలో సూటిగా ఉంటే ఒక నిర్దిష్ఠ విధానాన్ని పాటించాలని లేదు *(4)* వ సబ్ - సెక్షను ప్రకారం రెవెన్యూ రికవరీ చట్టపు నిబంధనలను వర్తింపచేయొచ్చు. *(5)*వ సబ్ - సెక్షను ప్రకారం ప్రాసిక్యూషను కూడా చేయొచ్చు. ఈ చర్యలు పరస్పర భంగాన్ని కలిగించవు.

## 16 - ఎ ఫరమ్స్ విషయములో బాధ్యత :

ఏ ఫరమ్ అయినను ఈ చట్టము క్రింద ఏ పన్ను లేక ఇతర మొత్తమును చెల్లించుటకు బాధ్యమయినప్పుడు, ఆ ఫరమ్ మరియు ఆ ఫరమ్ యొక్క ప్రతి భాగస్వామి సమిష్టిగా మరియు విడి విడిగా అట్టి చెల్లింపుకు బాధ్యులగుదురు.

## వ్యాఖ్యానము

ఒక ఫరమ్ పన్ను రూపంగా గాని లేదా మరే విధంగా గాని బాకీ పడితే ఎవరి నుంచి వసూలు చేయాలన్న విషయాన్ని ఈ సెక్షను వివరిస్తోంది. ఆ ఫరమ్ మరియు అందులోని ప్రతి భాగస్వామి సంయుక్తంగా లేదా విడి విడిగా కూడా పన్ను చెల్లించే విషయంలో బాధ్యులౌతారు.

## 16 - బి. పరిసమాప్తినందున్న ప్రైవేటు కంపెనీ యొక్క డైరక్టర్ల బాధ్యత :

ఏదైనా ప్రైవేటు కంపెనీ పరిసమాప్తి పొందేటపుడు మరియు దాని యొక్క పరిసమాప్తికి ముందుగానీ లేక క్రమం నందుగానీ లేక అనంతరం గానీ, ఏ వ్యవధి కొరకైననూ ఈ చట్టము క్రింద ఆ కంపెనీపై ఏదైనా పన్ను అసెస్ చేయబడి వసూలు చేయబడలేనపుడు, ఏ వ్యవధి కొరకు పన్ను బాకీ అయినదో అందు ఏ సమయమునందైనా ఆ ప్రైవేటు కంపెనీ యొక్క డైరెక్టరుగా ఉన్న ప్రతి వ్యక్తియు అట్టి పన్ను యొక్క చెల్లింపు కొరకు సమిష్టిగా మరియు విడి విడిగా అతడు, ఆ వసూలు కాకపోవుట ఆ కంపెనీ వ్యవహారాల సంబంధంగా తన భాగము యొక్క స్థూల నిర్లక్ష్యము, అపకార్యాల, కర్తవ్య ఉల్లంఘనకు సంబంధించదని నిరూపించకపోయిన, బాధ్యుడగును.

## వ్యాఖ్యానము

ఒకకంపెనీ 'లిక్విడేట్' అయినప్పుడు పన్ను చెల్లించవలసిన బాధ్యత ఎవరిమీద ఉంటుంది? అన్న అంశాన్ని ఈ సెక్షను వివరిస్తోంది. పన్ను ఏ సమయంలో బాకీ అయ్యిందో ఆ సమయంలో కంపెనీకి డైరెక్టర్లుగా వ్యవహరించిన వారందరూ విడి విడిగా మరియు సంయుక్తంగా కూడా చెల్లింపుకు బాధ్యులౌతారు.

తర్వాత మాత్రమే డీలరు వద్ద నుంచి వాణిజ్య పన్నుల శాఖ వారు రాబట్టుకొనటానికి వీలవుతుంది. దీనిలో చాలా సాధక బాధకాలున్నాయి. అలా కాకుండా - డీలరుకు బాకీపడిన వ్యక్తుల నుంచి కాని బాకీ పడే వ్యక్తుల నుంచి కాని నేరుగా రాబట్టుకోవటానికి వీలుగా ఈ సెక్షను పొందుపర్చబడింది. అయితే అట్టి మొత్తాన్ని వసూలు చేసేందుకు ఈ సెక్షను క్రింద జారీ అయిన నోటీసును ఉపసంహరించుకొనేందుకు, నిలిపి వేసేందుకు అసెసింగ్ అథారిటీకి అవకాశముంది.

ఈ సెక్షను క్రింద నోటీసును అందుకొన్న వ్యక్తి ఆ మొత్తాన్ని చెల్లించినట్లయితే అంత మేరకు బాకీ నుంచి డీలరు విషయంలో విముక్తుడైనట్లేనని *(3)* వ సబ్ - సెక్షను తెలియచేస్తోంది. నోటీసును అందుకున్న తర్వాత కూడా సదరు వ్యక్తి శాఖ వారికి పన్ను చెల్లించకుండా, నేరుగా డీలరుకే సొమ్మును చెల్లించినట్లయితే ఆ మేరకు ఆ వ్యక్తి వ్యక్తిగతంగా పన్ను చెల్లింపుకు బాధ్యుడౌతాడు.

డీలరుకు తాను బాకీ పడలేదని నిరూపించు కొనవలసిన బాధ్యత నోటీసును అందుకొన్న వ్యక్తి మీదే యుంటుంది. అలా నిరూపించుకొన్న పక్షంలో ఈ నోటీసు అమలులోనికి రాదు.

డీలరు కాకపోయినప్పటికీ ఈ సెక్షను క్రింద బాకీ పడుతున్న ప్రతి వ్యక్తి బాకీ కూడా రెవిన్యూ రికవరీ చట్టం క్రింద వసూలు చేయబడుతుంది.

బాకీ పడిన వ్యక్తే చెల్లిస్తాడు, నా మీద బాధ్యత లేదన్నట్లుగా డీలరు ఉండటానికి వీలు లేదు. ఎందుకంటే *(6)*వ సబ్ - సెక్షను, బాకీ పడిన వ్యక్తుల నుంచి సొమ్మును రాబట్టుకొనటానికి తీసుకొనే చర్యలు డీలరుపై చర్య తీసుకొనటానికి అవరోధం కాబోవు అని వివరిస్తోంది.

## 17-ఎ. రెవిన్యూను మోసగించేందుకు చేసిన బదిలీలు చెల్లక పోవుట :

ఈ చట్టము క్రింద ఏ డీలరైనా ఏదైనా ప్రొసీడింగు పెండింగులో నున్నప్పుడు లేదా అది ముగిసిన తర్వాత రెవిన్యూను మోసగించే ఉద్దేశ్యంతో సృష్టించే ఏదైనా చార్జ్ కానీ లేదా తన స్వాధీనములో నున్న ఆస్తులను అమ్మకము, తాకట్టు, బహుమతి, మార్పిడి లేక (1) ఏ ఇతర రూపమైన బదిలీ గానీ ఇతర వ్యక్తికి అనుకూలముగా వదులుకున్నట్లయితే అట్టి చార్జ్ లేక బదిలీ పై చెప్పబడిన ప్రొసీడింగు ముగిసిన కారణంగా గానీ లేదా మరి ఏ విధంగానైనా డీలరు చేత చెల్లింపబడవలసిన ఏదైనా పన్ను లేక ఏ ఇతర మొత్తము యొక్క క్లెయిము కారణంగా చెల్లనేరవు.

అయితే అట్టి చార్జ్ లేక బదిలీ చెల్లుబాటు అగుటకు అవి

(i) చాలినంత మూల్యముతో చేయబడినపుడు మరియు ఈ చట్టము క్రింద అట్టి ప్రొసీడింగు పెండింగులో నున్నదని నోటీసు లేనప్పుడు, డీలరు చెల్లించవలసిన అట్టి పన్ను లేక ఇతర మొత్తమునకు, సందర్భాను సారంగా ఏదైతే అది, నోటీసు లేనపుడు; లేదా

(ii) అసెసింగ్ అథారిటీ యొక్క పూర్వానుమతితోజరిగిన అట్టి చార్జ్ లేదా బదిలీ అయ్యుండ వలెను.

**విశదీకరణము :** ఈ సెక్షను నందు ఆస్తులు అనగా భూమి, భవనము, యంత్ర సామాగ్రి, ప్లాంటు, షేర్లు, సెక్యూరిటీలు మరియు బ్యాంకు నందున్న స్థిరాస్తులు పైన చెప్పబడిన ఆస్తులు డీలరు యొక్క వ్యాపారమునకు సంబంధించిన స్టాకులలో భాగము కానంత వరకు చేరి యుండును.

## వ్యాఖ్యానము

కొన్ని సందర్భాలలో డీలర్లు పన్నును ఎగవేసే ఉద్దేశ్యంతో ఏదైనా పన్ను విధింపు ప్రొసీడింగు పెండింగులో ఉండగానో లేదా సదరు ప్రొసీడింగు పూర్తి కాగానే తమ ఆస్తులపై ఏదైనా ఋణాల్ని చూపించడం లేదా తాకట్టు, దానం, పరస్పర మార్పిడి ద్వారా

రెంట్ అండ్ రెవిన్యూ సేల్స్ యాక్ట్, 1839 క్రింద మండల రెవిన్యూ అధికారులకు గల అదికారములను (3)వ సబ్ - సెక్షను యొక్క నిబంధనలకు లోబడి కలిగి యుందురు.

(3) ఆంధ్ర ప్రదేశ్ రెంట్ అండ్ రెవిన్యూ సేల్స్ యాక్ట్, 1839 నందు ఏమున్నప్పటికినీ, (2)వ సబ్ - సెక్షను క్రింద దత్తము చేయబడిన అధికారములను వినియోగించుట యందు ఉప వాణిజ్య పన్నుల అదికారి ఉప కమీషనరు యొక్క అదుపు మరియు పర్యవేక్షణకు లోబడి ఉండును.

## వ్యాఖ్యానము

1989 నుంచి ఈ నిబంధనను అదనంగా చేర్చడం జరిగింది. పన్నులను వసూలు చేసేటప్పుడు కొన్ని సందర్భాల్లో బలవంతపు విధానాన్ని అమలు చేయాల్సి వస్తుంది. సరళంగా ప్రత్యక్షంగా పన్ను వసూలు చేయటానికి వీలుకానప్పుడు స్థిరాస్తుల్ని, చరాస్తుల్ని జప్తు చేయాల్సి వస్తుంది. ఇలాంటి సందర్భాల్లో రెవెన్యూ రికవరీ చట్టం క్రింద కలెక్టరు మొదలైన రెవెన్యూ అధికారులకు మాత్రమే అధికారమివ్వబడింది. అందువల్ల అమ్మకపు పన్ను బకాయిలు త్వరితంగా వసూలు కావడం కష్ట సాధ్యమౌతున్న దృష్ట్యా రెవెన్యూ రికవరీ చట్టం క్రింద వాణిజ్య పన్నుల అధికార యంత్రాంగానికి అధికారాలనిస్తూ ఈ నిబంధన రూపొందించబడింది.

దీని ప్రకారం రెవెన్యూ రికవరీ చట్టం క్రింద కలెక్టరు కున్న అధికారాలను ఉప కమీషనరులకు కూడా ఇవ్వడం జరిగింది. మండల రెవెన్యూ అదికారులు వినియోగించే అధికారాలన్నీ ఉపవాణిజ్య పన్నుల అధికారులకు ఇవ్వబడినాయి. ఆంధ్ర ప్రదేశ్ రెంట్ అండ్ రెవెన్యూ సేల్సు చట్టం క్రింద స్వాధీన పరచుకొన్న ఆస్తిని అమ్మేటప్పుడు ఉప కమీషనరు యొక్క అదుపు మరియు పర్యవేక్షణకు లోబడి యుండాలని కూడా ఈ సెక్షను నిర్దేశిస్తుంది.

### 18. డీలరు యొక్క వ్యాపారము బదిలీ చేయబడినపుడు పన్ను యొక్క వసూలు :

పన్ను చెల్లింపుకు బాధ్యత గల డీలరు యొక్క వ్యాపారము యొక్క ఓనరు షిప్ బదిలీ చేయబడినప్పుడు, సదరు వ్యాపారమునకు సంబంధించి ఈ చట్టము క్రింద చెల్లింప బడవలసిన ఏ పన్ను లేక ఇతర మొత్తము మరియు ఆ బదిలీ సమయానికి చెల్లింపబడక మిగిలిన, బదిలీ కర్త నుండి దాని యొక్క వసూలు కొరకు తీసికొనబడే ఏ చర్యలకు భంగం కలగకుండా బదిలీ స్వీకర్త నుండి, అట్టి పన్ను లేక ఇతర మొత్తము చెల్లింపుకు బాధ్యమగు డీలరు అతడే అన్నట్లుగా, వసూలు చేయబడవచ్చును.

## వ్యాఖ్యానము

కొన్ని పరిస్థితులలో డీలరు పన్ను చెల్లించ వలసియున్నప్పటికీ పన్ను ఎగవేసే ఉద్దేశ్యంతో తనకున్న వ్యాపారాన్ని వేరొకరికి బదిలీ చేయవచ్చును. ఆ బదిలీ స్వీకర్త నుంచి (ట్రాన్స్‌ఫరీ) పన్నును రాబట్టుకొనేందుకు రాష్ట్ర ప్రభుత్వానికి అధికారము లేదు. ఆ బదిలీ స్వీకర్త నుంచి కూడా పన్నును రాబట్టు కొనేందుకు ప్రభుత్వయంత్రాంగానికి అధికార మివ్వాలన్న స్ఫూర్తితో ఈ సెక్షను రూపొందించబడింది.

బదిలీ స్వీకర్త బదిలీ సమయానికి బదిలీ కర్త (ట్రాన్స్‌ఫరర్) చెల్లించవలసిన పన్నులు మరియు ఇతర మొత్తాలను చెల్లించటానికి పూర్తిగా బాధ్యత వహించాల్సి యుంటుంది. బదిలీ సమయానికి బాకీగా ఏర్పడని ఏ మొత్తానికి అతడు బాధ్యుడు కాడు.

అలాగే అతని బాధ్యత బదిలీ అయిన ఆస్తుల విలువ ఎంత ఉన్నదో అంత వరకే పరిమితమై యుంటుంది. కేవలం వ్యాపారాన్ని మాత్రమే బదిలీ చేసి దాని ఓనర్‌షిప్‌ను బదిలీ చేయనప్పుడు కూడా యిది వర్తించదు.

చేయబడిన అట్టి ప్రొసీజరు రూల్సుకు లోబడి

(ఎ) అసెస్‌మెంటు లేక జరిమానాను లేక రెండింటినీ స్థిరపరచవచ్చును, తగ్గించవచ్చును, హెచ్చించవచ్చును లే: రద్దు చేయవచ్చు; లేదా

(బి) ఆ అసెస్‌మెంటు లేక జరిమానా లేక రెండింటిని రద్దు చేయవచ్చును మరియు ఆదేశింపబడే అట్టి తదుపరి విచారణను చేసిన అనంతరము తాజా ఉత్తర్వును పాస్ చేయమని అసెసింగ్ అథారిటీని ఆదేశించవచ్చును; లేదా

(సి) తాను సముచితమని భావించు అట్టి ఇతర ఉత్తర్వులను పాస్ చేయవచ్చును.

(4) (3)వ సబ్ - సెక్షను క్రింద ఉత్తర్వులను పాస్ చేయబోయే ముందు అప్పిలేటు అథారిటీ తాను సముచితమని భావించు అట్టి విచారణను చేయవచ్చును లేదా ఏ సబార్డినేటు అధికారి లేక అథారిటీకైననూ, ఏవయినా నిర్దిష్ట అంశము లే: అంశములపై విచారణ మరియు నివేదికల నిమిత్తము కేసును రిమాండు చేయవచ్చును.

(5) ఈ సెక్షను క్రింద అప్పీలు నందు పాస్ చేయబడిన ప్రతి ఉత్తర్వు 20, 21, 22 మరియు 23 సెక్షనుల నిబంధనలకు లోబడి అంతిమము.

35వ రూలును చూడుము.

## వ్యాఖ్యానము

*ఇది చట్టంలో మొదటి అప్పీళ్ళకు సంబంధించిన నిబంధన, వాణిజ్య పన్నుల ఉపకమీషనరు లేదా సంయుక్త కమీషనరు మినహాయించి తదితరులు చేసిన ఉత్తర్వులు లేక ప్రొసీడింగ్సు పై అప్పీలు చేసుకొనేందుకు ఈ సెక్షను వీలు కల్పిస్తోంది. అప్పీలును డీలరు తనకు ఉత్తర్వులు అందిన తదుపరి 30 రోజులలోపు చేయాల్సి ఉంటుంది. అయితే ఇక్కడ గమనించాల్సిన విషయమేమంటే ఒక అధికారి ఉత్తర్వుల వల్ల గాని లేక ప్రొసీడింగ్సు వల్ల గాని ఆర్తుడైన డీలరు అప్పీలు చేసుకోవచ్చునని సెక్షను పేర్కొంటుండగా, ఏ వ్యక్తి అయినా అప్పీలు చేసుకొనవచ్చునని సంబంధిత 33వ రూలు పేర్కొంటోంది. ఒక సెక్షనుకు, రూలుకు వైరుధ్యమేర్పడితే సెక్షనును మాత్రమే పరిగణనలోనికి తీసుకోవాల్సి ఉంటుందన్నది స్థాపిత వాస్తవం కాబట్టి ఇది డీలర్లకు మాత్రమే వర్తిస్తుందనుకోవాలి.*

*అయితే 30 రోజుల కాలవ్యవధి దాటితే అట్టి అప్పీలు స్వీకరింపబడరాదా? అంటే స్వీకరించవచ్చుననే ప్రొవిజో వివరిస్తోంది. అప్పిలేటు అథారిటీ ఈ క్రింది రెండు సూత్రాల్లో సంతృప్తి చెందితే స్వీకరించవచ్చు.*

*1) డీలరు బాకీగా అంగీకరించే సొమ్మును గాని, అనుదానం చేయబడిన వాయిదాలను గాని చెల్లించినప్పుడు.*

*2) సకాలంలో అప్పీలు చేయక పోవడానికి గల కారణం సముచితంగా ఉన్నప్పుడు.*

*33వ రూలు ఉపకమీషనరును మొదటి స్థాయి అప్పిలేటు అథారిటీగా పేర్కొన్నది. అప్పీలు ఫారము - 1 నమూనాలో ఉండాలి. రెండు ప్రతులలో సమర్పించబడాలి. పన్నులో 2 శాతము భాగాన్ని కాని **50** నుండి **1000/-** రూ. రుసుమును గాని చెల్లించి చలానాను జతచేయాలి (రూలు 33 (2))*

*(2-ఎ) సబ్-సెక్షను ప్రకారము కేసు పూర్తిగా పరిష్కారమయ్యేదాకా అప్పిలేటు అథారిటీ డీలరు యొక్క విన్నపం ఆధారంగా "స్టే"ను మంజూరు చేయవచ్చును. డీలరు సదరు విన్నపాన్ని ఫారము **XXII** నందు రెండు ప్రతులలో సమర్పించాలి. **1985** సవరణ ప్రకారం సెక్యూరిటీ సమకూర్చబడితేగాని, లేదా నిర్దిష్ట వ్యవధిలోపు వివాదగ్రస్తమైన పన్నులో భాగాన్ని చెల్లిస్తేగాని స్టే మంజూరు చేయబడరాదు అని పేర్కొనబడింది.*

*సబ్ సెక్షను (2-ఎ) ప్రకారము, డీలరు విన్నవించుకొన్నప్పటికీ "స్టే" మంజూరు కానట్లయితే సంయుక్త కమీషనరుకు*

దత్తము చేయబడిన అధికారములు డీలరుకు ఆ ఉత్తర్వు అంద చేయబడిన తేదీన నుండి నాలుగు సంవత్సరములకు మించని ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి వ్యవధులలో మాత్రమే వినియోగింప బడవలెను.

(4) ఏదయినా అసెస్‌మెంటును హెచ్చించుతూ (1) వ సబ్ - సెక్షను లలేక (2) వ సబ్ - సెక్షనుల క్రింద ఏ ఉత్తర్వు, ప్రతి పాదించబడిన హెచ్చింపుకు వ్యతిరేకముగా కారణమును చూపుటకు అసెసీకి అవకాశము ఇవ్వబడితే తప్ప పాస్ చేయబడరాదు.

(5) ఈ సెక్షను క్రిద పాస్ చేయబడిన ఏ ఉత్తర్వు అయిననూ ఏదయినా న్యాయ స్థానము లేక ఈ చట్టము క్రింద ఇతర కాంపిటెంట్ అథారిటీ చేత ఏ కారణము కొరకైననూ రద్దు చేయబడినసప్పుడు ఈ సెక్షను క్రింద క్రొత్త రివిజను, ఏదయినా ఉన్నట్లయితే, చేయు ప్రయోజనార్థము (3)వ సబ్ - సెక్షను నందు నిర్దిష్టపర్చబడిన నాలుగు సంవత్సరముల కాలవ్యవధిని లెక్కించునపుడు సదరు ఉత్తర్వు యొక్క తేదీ మరియు అట్లు రద్దు చేయబడిన తేదీకి మధ్యనున్న వ్యవధి మినహాయింపబడవలెను.

(6) ఏ కేసునందైననూ, హైకోర్టు చేత అనుదానము చేయబడిన "స్టే" ఉత్తర్వు కారణంగా గాని లేదా ప్రసక్తము లోనున్న ప్రొసీడింగు లేక ఉత్తర్వుపై ప్రత్యక్ష ప్రభావం గల చట్టపరమైన ప్రశ్న ప్రమేయం గల అప్పీలు లేక ఇతర ప్రొసీడింగు హైకోర్టు లేక సుప్రీంకోర్టు ముందు పెండింగులలో నున్న వాస్తవం కారణంగా గానీ, ఈ సెక్షను క్రింద ఏ ప్రొసీడింగైననూ వాయిదా వేయబడినపుడు, ఈ సెక్షను క్రింద అధికారాన్ని వినియోగించే నిమిత్తము ఈ సెక్షను నందు నిర్దిష్టపరచబడిన నాలుగు సంవత్సరముల వ్యవధిని లెక్కించునపుడు, ఆ "స్టే" ఉత్తర్వు అమలులో నున్న లేక సదరు అప్పీలు లేక ప్రొసీడింగు పెండింగులో నున్న వ్యవధి మినహాయించబడవలెను.

## వ్యాఖ్యానము

*క్రింది తరగతి అధికార వర్గం చేసిన ఉత్తర్వులను రివిజను చేసేందుకు కమీషనరు, సంయుక్త కమీషనరు, ఉపకమీషనరు, వాణిజ్య పన్నుల అధికారులకు చట్టపరమైన అధికార మిచ్చేందుకు ఈ సెక్షను పొందు పరచబడింది. అయితే ఈ అధికారం స్వయం ప్రేరితంగానే వినియోగించబడాలి. 44-ఎ రూలు ఏఏ అధికార వర్గానికి సంబంధించిన ప్రొసీడింగును ఏ ఏ ఉన్నతాధికార వర్గం పునఃపరిశీలన చేయాలో వివరిస్తోంది.*

*పునఃపరిశీలనాధికారము పై అధికార వర్గానికి ఎందుకు అప్పగించ బడింది ? అని పరిశీలిస్తే, క్రింది అధికారులు చేసే ఉత్తర్వులు-*

*1) చట్టబద్ధంగా ఉన్నాయా ? లేవా ?*

*2) ప్రొసీడింగ్సు క్రమబద్ధమైనవేనా ? కావా ?*

*3) అట్టి ఉత్తర్వులు ఎంతవరకు సముచితము*

*అనే విషయాల్ని పరిశీలించి తెలుసు కోవాల్సిన బాధ్యత పరిపాలనా పరంగా ఉన్నది. అయితే 1985 తర్వాత ప్రధానమైన సవరణ జరిగింది. చట్టానికున్న ప్రధాన లక్ష్యం రాష్ట్ర ఖజానాకు రెవెన్యూను సమకూర్చడం కాబట్టి 'రెవెన్యూ ప్రయోజనాలను కాపాడేందుకు' అనే ప్రమాణాన్ని కొత్తగా చేర్చడం వల్ల ఏ పునఃపరిశీలన జరిగినా అది రెవెన్యూ ప్రయోజనాల నుద్దేశించి అని చెప్పడం వల్ల పునఃపరిశీలనాధికారం సంకుచితమైనప్పటికీ పుపఃపరిశీలన ఆదర్శం మాత్రం స్పష్టంగా పేర్కొన్నట్లయింది.*

*ఈ అధికారము 'డీలరుకు ఉత్తర్వులు అందచేసిన 4 సంవత్సరముల లోపు' వినియోగించబడాలని ఈ సెక్షను చెప్తోంది. పుపఃపరిశీలన చేసే ముందు సహజన్యాయ సూత్రాలను విధిగా పాటించాలని కూడా చట్టం స్పష్టం చేస్తోంది.*

అయితే- అట్టి కొట్టివేత ఉత్తర్వు తెలియచేయబడిన తేదీ నుండి ముప్పై రోజుల లోపు డీలరు చేత చేయబడిన దరఖాస్తుపై మరియు విచారణకొరకు ఆ అప్పీలు పిలువబడినపుడు హాజరు కాకపోవుటకు అతనిచేత చూపబడిన తగిన కారణముపై అప్పిలేటు ట్రిబ్యునలు, దాఖలు చేయబడిన అప్పీలు ఏ అథారిటీ ఉత్తర్వు లేక ప్రొసీడింగుకు వ్యతి రేకముగా చేయబడినదో ఆ అథారిటీకి ఇందు నిమిత్తము నోటీసు నిచ్చిన అనంతరము ఆ అప్పీలును తాను సముచితమని భావించు అట్టి నిబంధనలపై పునః స్వీకరించవచ్చును.

(6) 20వ సెక్షను యొక్క (2)వ సబ్ - సెక్షను క్రింద స్వయంప్రేరితంగా లేక 14వ సెక్షను యొక్క (4-సి) సబ్ - సెక్షను క్రింద వాణిజ్య పన్నుల ఉపకమీషనరు చేత పాస్ చేయబడిన ఉత్తర్వు లేక రికార్డు చేయబడిన ప్రొసీడింగునకు అభ్యంతరం తెలుపుతూ డీలరు చేత అప్పిలేటు ట్రిబ్యునలుకు అప్పీలు దాఖలు చేయబడినపుడు, సంయుక్త కమీషనరు, డీలరు చేత దాఖలు చేయబడిన దరఖాస్తుపై, తాను సముచితమని భావించు అట్టి నిబంధనలు, షరతులకు లోబడి అప్పిలేటు ట్రిబ్యునలు చేత అప్పీలు యొక్క పరిష్కారము కొనసాగుతున్నప్పుడు, వివాదమునందున్న పన్ను యొక్క వసూలుకు 'స్టే' ను ఉత్తర్వు చేయవచ్చును.

(6-ఎ) మొదటి అప్పిలేటు అథారిటీ యొక్క లేదా 20వ సెక్షను క్రింద రివిజను యందు లేక 14వ సెక్షను యొక్క (4-సి) సబ్ - సెక్షను క్రింద స్వయం ప్రేరితంగా ఉపకమీషనరు యొక్క ఉత్తర్వులను అనుసరించి బాకీయైన, ఏదయినా ఉన్నట్లయితే, ఏ పన్ను మరియు జరిమానా చెల్లింపు, (1)వ సబ్ - సెక్షను క్రింద తత్సంబంధముగా అప్పీలు దాఖలు చేయబడినపుడు ఆ అప్పీలు పరిష్కారము కొనసాగుతున్నపుడు 'స్టే' చేయబడరాదు.

(7) ఈ చట్టము క్రింద చేయబడిన రూల్సులో పొందుపరచబడినట్లు తప్ప, అప్పిలేటు ట్రిబ్యునలు అప్పీలు యొక్క ఏ పక్షమునకైననూ ఖర్చులను ప్రదానము చేయుటకు అధికారమును కలిగియుండదు.

(8) (4)వ సబ్ - సెక్షను క్రింద అప్పిలేటు ట్రిబ్యునలు చేత పాస్ చేయబడిన ప్రతి ఉత్తర్వు డీలరుకు, ఎవరి ఉత్తర్వుకు వ్యతిరేకముగా అప్పీలు దాఖలు చేయబడినదో ఆ అథారిటీకి, వాణిజ్య పన్నుల కమీషనరుకు మరియు ప్రెస్క్రైబ్ చేయబడే అట్టి ఇతర అథారిటీలకు దాని చేత తెలియచేయబడవలెను.

(9) (4)వ సబ్ - సెక్షను క్రింద అప్పిలేటు ట్రిబ్యునలు చేత పాస్ చేయబడిన ప్రతి ఉత్తర్వు 22వ సెక్షను యొక్క నిబంధనలకు లోబడి అంతిమము.

## వ్యాఖ్యానము

*అప్పిలేటు ట్రిబ్యునలును-అప్పీళ్ళను గురించి ఈ సెక్షను వివరిస్తోంది. 19వ సెక్షను క్రింద ఉపకమీషనరు చేత పాస్ చేయబడిన ఉత్తర్వుకు వ్యతిరేకముగా గాని, 14 (4-సి) సెక్షను క్రింద సంయుక్త కమీషనరు లేదా ఉపకమీషనరు చేతపాస్ చేయబడిన ఉత్తర్వులకు వ్యతిరేకముగా గాని, 20(2) సెక్షను క్రింద ఉత్తర్వులకు వ్యతిరేకంగా గాని అప్పిలేటు ట్రిబ్యునలుకు అప్పీలు చేసుకొనవచ్చును. ఏ ఉత్తర్వులకు వ్యతిరేకంగా అప్పీలు జరుగుతుందో అట్టి ఉత్తర్వులు అందిన 60 రోజులలోపు డీలరు అప్పీలు చేసుకోవాలి.*

*60రోజుల తర్వాత వచ్చిన అప్పీళ్ళను కూడా ప్రత్యేక పరిస్థితుల్లో స్వీకరించవచ్చు. అయితే- సకాలంలో అప్పీలు చేసుకొనలేకపోవడానికి గల కారణం సముచితంగా ఉందని ట్రిబ్యునలు సంతృప్తి చెందవలసి యుంటుంది.*

*(3)వ సబ్ - సెక్షను అప్పీలు ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారములో దాఖలు చేయబడాలని, ప్రెస్క్రైబ్ చేయబడిన విధానంతో పరిశీలింపబడాలని ఆదేశిస్తోంది. అప్పీలును ఫారము-II నందు రూపొందించాలి. అప్పీలు ఆధారాల్ని సంక్షిప్తంగా వ్రాయాలి మరియు 4 ప్రతులలో దీనిని సమర్పించాలి.*

ప్రశ్న లేక ప్రశ్నలపై హైకోర్టు యొక్క అభిప్రాయంతో అప్పిలేటు ట్రిబ్యునలుకు విషయమును పంపవచ్చును లేదా హైకోర్టు ఆ విషయము సంబంధంగా తాను సముచితమని భావించు ఏ ఇతర ఉత్తర్వునయిననూ పాస్ చేయవచ్చును.

(బి) ఉత్పన్నమైన చట్టపరమైన ప్రశ్న లేక ప్రశ్నలపై తన అభిప్రాయముతో క్లాజు (ఎ) క్రింద అప్పిలేటు ట్రిబ్యునలుకు హైకోర్టు విషయమును పంపినపుడు, అప్పిలేటు ట్రిబ్యునలు తన చేత పాస్ చేయబడిన ఉత్తర్వును అట్టి అభిప్రాయమునకు అనుగుణముగా మార్పు చేయవలెను.

(5) (4)వ సబ్-సెక్షను క్రింద ఉత్తర్వును పాస్ చేయబోయే ముందు హైకోర్టు అట్లు చేయుట అవసరమని అది పరిగణించినట్లయితే, అర్జీని అప్పిలేటు ట్రిబ్యునలుకు పంపి మరియు ఏదైనా నిర్దిష్ట ప్రశ్న లేక వాదాంశముపై తన పరిశీలనతో ఆ అర్జీని త్రిప్పి పంపవలసినదిగా ఆదేశించవచ్చును.

(6) (1)వ సబ్ - సెక్షను క్రింద అర్జీ దాఖలు చేయబడినప్పటికిన్నీ, ఆ కేసు నందు చేయబడిన అసెస్‌మెంటును అనుసరించి పన్ను చెల్లింప బడవలెను.

అయితే-హైకోర్టు తన విచక్షణానుసారము తాను సముచితమని భావించు అట్టి వాయిదాలలో పన్నును చెల్లించుటకు ఆ అర్జీదారును అనుమతించ వచ్చును లేదా పన్ను చెల్లింపు సంబంధముగా అట్టి ఇతర ఆదేశమును ఇవ్వవచ్చును.

అయితే- అర్జీ ఫలితంగా అట్టి అసెస్‌మెంటు నందు ఏదయినా మార్పు అవసరమయినట్లయితే, హైకోర్టు అసెసింగ్ అథారిటీని ఆ అసెస్‌మెంటును మార్పు చేయుటకు ఆథరైజు చేయవచ్చును మరియు చేయబడిన అట్టి మార్పుపై, సందర్భాను సారంగా ఏదైతే అది, డీలరు చేత చెల్లింపబడిన అధిక మొత్తము అతనికి వడ్డీలేకుండా వాపసు చేయబడవలెను లేదా అతని నుంచి బాకీ అయిన తదుపరి పన్ను మొత్తము ఈ చట్టము యొక్క నిబంధనలననుసరించి వసూలు చేయబడవలెను.

(6-ఎ) దేని సంబంధంగా (1)వ సబ్ - సెక్షను క్రింద అర్జీ దాఖలు చేయబడినదో అప్పిలేటు ట్రిబ్యునలు యొక్క ఆ ఉత్తర్వును అనుసరించి బాకీయైన, ఏదయినా ఉన్నట్లయితే, పన్ను లేక జరిమానా యొక్క చెల్లింపు ఆ అర్జీ పరిష్కారము పెండింగులో నుండగా 'స్టే' చేయబడరాదు, కానీ అట్టి అర్జీ ఫలితంగా ఆ మొత్తము తగ్గింపబడినట్లయితే, చెల్లింపబడిన అధికపన్ను 33-బి సెక్షను నిబంధనలననుసరించి వాపసు చేయబడవలెను.

(7) (ఎ) హైకోర్టు (4)వ సబ్ - సెక్షను క్రింద తన చేత పాస్ చేయబడిన ఏ ఉత్తర్వునయిననూ తాను ఆ ఉత్తర్వును పాస్ చేసినపుడు తనముందు లేనట్టి వాస్తవముల ఆధారంగా డీలరు లేక ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీ యొక్క దరఖాస్తుపై పునరీక్షణ చేయవచ్చును.

42 మరియు 43 రూల్సును, 24 మరియు 24-ఎ సెక్షనులను, ఫారము V ను చూడుము.

(బి) పునరీక్షణ కొరకు దరఖాస్తు ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి వ్యవధిలోపు మరియు అట్టి విధానము నందు దాఖలు చేయబడవలెను మరియు అది డీలరు చేత దాఖలు చేయబడినపుడు ఒక వంద రూపాయల రుసుముతో జతచేయబడవలెను.

(8) (1)వ సబ్ - సెక్షను క్రింద లేక (7)వ సబ్ - సెక్షను క్రింద దాఖలు చేయ్యబడిన ప్రతి అర్జీ లేదా దరఖాస్తులకు సంబంధించిన ఖర్చులు హైకోర్టు విచక్షణ యందు ఉండవలెను.

(2) అప్పీలు ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారము నందుండవలెను ప్రెస్క్రైబ్ చేయబడిన విధానమునందు పరిశీలింపబడవలెను మరియు ఐదు వందల రూపాయలకు తగ్గనట్టి రెండువేల రూపాయలకు మించని ప్రెస్క్రైబ్ చేయబడే రుసుముతో జత చేయబడవలెను.

(3) హైకోర్టు అప్పీలుకు సంబందించిన ఇరు పక్షములకువాదన విన్పించుకొనేందుకు హేతుబద్ధమైన అవకాశము ఇచ్చిన తరువాత దానిపై తాను సముచితమని భావించు అట్టి ఉత్తర్వును పాస్‌చేయవలెను.

(4) 22వ సెక్షను యొక్క (6), (7) మరియు (8) సబ్-సెక్షనుల నిబంధనలు, (1)వ సబ్-సెక్షనుక్రింద దాఖలు చేయబడిన అప్పీళ్ళ సంబంధంగా, అవి 22వ సెక్షను యొక్క (1)వ సబ్-సెక్షను క్రింద దాఖలు చేయబడిన అర్జీల సంబంధంగా ఎట్లు వర్తించునో అట్లే వర్తించును.

42వ రూలును, ఫారము -VI ను చూడుము.

## వ్యాఖ్యానము

*ఇది హైకోర్టుకు సాధారణంగా అప్పీలుకు సంబంధించిన నిబంధన. 20(1) సెక్షను, (20(2)), 14(4-సి) సెక్షను క్రింద సంయుక్త కమీషనరు ఉత్తర్వుల వలన అర్హుడైన ఏ డీలర్‌రైనా హైకోర్టుకు అప్పీలు చేసుకొనవచ్చును. ఇది 60 రోజుల లోపు మాత్రమే చేయబడాలి. దీనికి 500-2000రూ. వరకు రుసుము కూడా ప్రెస్క్రైబ్ చేయబడింది. ఉభయ పక్షాల వాదాల్ని వినిన అనంతరం తనకు సముచిత మనిపించిన ఉత్తర్వును హైకోర్టు చేయవచ్చు. తక్కిన విషయాలన్ని 22వ సెక్షనులో మాదిరిగానే దీనికి కూడా వర్తిస్తాయి.*

### 24. హైకోర్టుకు చేయబడిన అర్జీలు, ధరఖాస్తులు మరియు అప్పీళ్లు ఇద్దరు న్యాయర్తులకు తగ్గని ధర్మాసనము చేత విచారింపబడవలెను:

22 మరియు 23 సెక్షనుల క్రింద హైకోర్టుకు దాఖలు చేయబడిన ప్రతి అర్జీ, దరఖాస్తు లేక అప్పీలు ఇద్దరు న్యాయమూర్తులకు తగ్గని ధర్మాసనము చేత విచారింపబడవలెను, మరియు అట్టి అర్జీ, దరఖాస్తు లేక అప్పీలు సంబంధంగా కోడ్ ఆఫ్ సివిల్ ప్రొసీజరు, 1908 (1908 యొక్క Vవ కేంద్ర చట్టము) యొక్క 98వ సెక్షను యొక్క నిబంధనలు వలసినంతమేరకు వర్తించును.

*(గమనిక: 24వ సెక్షను 1988 యొక్క 26వ చట్టము ద్వారా తొలగించబడినది కాని ఈ చట్టము యొక్క నిబంధ నలకు ప్రభావమిచ్చు నోటిఫికేషను ఇంతవరకు జారీ కాలేదు.)*

### 24-ఎ. కొన్ని అసెస్‌మెంట్లు లేక రీ-అసెస్‌మెంట్లు ఆదేశింప బడినపుడు కాలపరిమితి:

14 మరియు 20 సెక్షనులందు ఏమున్నప్పటికీ, 19వ సెక్షను, 20వ సెక్షను, 21వ సెక్షన, 22వ సెక్షను లేక 23వ సెక్షను క్రింద ఉత్తర్వు నందు లేదా ఈ చట్టము క్రింద అప్పీలు లేక రివిజను రూపంగా కన్నా భిన్నమైన ప్రొసీడింగు నందు ఏదైనా కోర్టు యొక్క ఉత్తర్వు నందున్న ఏదైనా ఆదేశము లేక పరిశీలనను అమలు చేయుటకు లేదా అనుసరించి లేదా పరిణామంగా ఏ వ్యక్తి లేక అసెసీ యొక్క అసెస్‌మెంటు, రీ-అసెస్‌మెంటు, అసెస్‌మెంటు యొక్క రివిజను లేక సరిదిద్దుబాటు చేయబడినపుడు, అట్టి అసెస్‌మెంటు, రీ-అసెస్‌మెంటు, అసెస్‌మెంటు యొక్క సరిదిద్దుబాటు అట్టి ఉత్తర్వు అసెస్‌మెంటు లేక రివిజనల్ అథారిటీ, సందర్భానుసారంగా ఎవరైతే వారికి, అందిన తేదీ నుండి 3 సంవత్సరముల లోపు చేయబడవలెను.

**26. పడవల యజమానులు వగైరా. కొన్ని రికార్డులను స్వాధీనము నందుంచుకొనుట మరియు సమర్పించుట :**

పడవ యొక్క యజమాని లేదా ఇన్‌చార్జి అయిన ఇతర వ్యక్తి రవాణా యందున్న సరుకులకు సంబంధించిన మరియు ప్రెస్క్రైబ్ చేయబడే అట్టి వివరములను కలిగియున్న -

(i) అమ్మకపు బిల్లు లేక లేక డెలివరీ నోటు, (ii) లాగ్ బుక్, మరియు

(iii) ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి ఇతర అధికార పత్రములను

తన వెంటనుంచు కొనవలెను మరియు ప్రెస్క్రైబ్ చేయబడే అట్టి సమయములోపల పై చెప్పబడిన అధికారపత్రములు లేక వాటి నకళ్ళను సరుకులు బట్వాడా చేయబడుచున్న ప్రదేశముపై అధికార పరిధి కల వాణిజ్య పన్నుల అధికారికి సమర్పించవలెను.

45(4), 45 (4) iv మరియు 45-యఫ్ ను రహదారి పత్రము ఫారము-X ను చూడుము.

**27. సరుకుల వాహనముల యజమానులు వగైరా. కొన్ని రికార్డులను స్వాధీనము నందుంచుకొనుట మరియు సమర్పించుట :-**

సరుకుల వాహనము యొక్క యజమాని లేక ఇన్‌చార్జి అయిన ఇతర వ్యక్తి రవాణా యందున్న సరుకులకు సంబంధించిన మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి వివరములను కలిగియున్న -

(i) అమ్మకపు బిల్లు లేక డెలివరీనోటు,

(ii) సరుకుల వాహనపు రికార్డు లేక ట్రిప్ షీటు, మరియు

(iii) ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి ఇతర అధికార పత్రములను

తన వెంటనుంచు కొనవలెను మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి సమయములోపల పై చెప్పబడిన అధికార పత్రములు వాటి నకళ్ళను సరుకులు బట్వాడా చేయబడుచున్న ప్రదేశముపై అధికార పరిధి కల వాణిజ్య పన్నుల అధికారికి సమర్పించవలెను.

45 (4), 45 (4)iv మరియు 45-యఫ్ ను రహదారి పత్రము ఫారము –X ను చూడుము.

**28. లెక్కలను దాఖలు చేయమని ఆదేశించుటకు అధికారములు మరియు ప్రవేశించుటకు, తనిఖీ చేయుటకు అధికారములు, వగైరా :-**

(1) రాష్ట్ర ప్రభుత్వము చేత అందు నిమిత్తము అధికారమివ్వబడిన సహాయ వాణిజ్య పన్నుల అధికారి స్థాయికి తగ్గని ఏ అధికారి అయినను ఈ చట్ట ప్రయోజనార్థము తన ముందు లెక్కలను, రిజిస్టరులను మరియు ఇతర అధికార పత్రములను దాఖలు చేయమని మరియు అతని వ్యాపారమునకు సంబంధించిన ఏ ఇతర సమాచారమునయినను సమకూర్చమని ఏ డీలరునయినను అపేక్షించవచ్చును. 48 మరియు 49 రూల్సును చూడుము.

(2) తన వ్యాపార క్రమములో డీలరు చేత నిర్వహింపబడిన అన్ని లెక్కలు, రిజిస్టరులు మరియు ఇతర అధికార పత్రములు, అతని స్వాధీనము నందున్న సరుకులు మరియు అతని కార్యాలయములు, దుకాణములు, గోదాములు, పడవలు లేక వాహనములు అట్టి అధికారి చేత, తత్కాలమున అమలులో నున్న సంబంధిత చట్టము క్రింద ప్రెస్క్రైబ్ చేయబడిన వ్యాపార సమయము లందు ఎప్పుడయిననూ, లేదా అట్టి సమయములు ప్రెస్క్రైబ్ చేయబడనపుడు హేతుబద్ధమయిన అన్ని సమయములందును తనిఖీ చేయబడుటకు స్వేచ్ఛ కలదు.

(3) ఈ చట్టము క్రింద బాకీ పడిన ఏదయినా పన్ను లేక ఇతర మొత్తముల చెల్లింపును ఎగవేయుటకు ఏ డీలరయినా

(బి) ఏదయినా భవనము లేక పడవ లేక వాహనము నుండి బయటకు వచ్చిన లేక లోపలకు వెళ్తున్న లేక లోపల నున్నట్టి, ఖాతాదారులు లేక సందర్శకుల కన్నా భిన్నమైనట్టి, ఏ వ్యక్తి నయిననూ, అట్టి వ్యక్తి ఏ సరుకులు, లెక్కలు, రిజిస్టరులు లేక ఇతర అధికార పత్రముల నైననూ దాచెనని ఆ అధికారి సకారణముగా అనుమానించినపుడు సోదాచేయు టకు గల అధికారము కూడా చేరియుండును.

(6) అట్టి ఏ అధికారి అయిననూ, డీలరు యొక్క ఏ కార్యాలయము, దుకాణము, గోదాము, వాహనము, పడవ లేక ఏ ఇతర వ్యాపార ప్రదేశము లేక ఏ ఇతర భవనము లేక ప్రదేశము నందైననూ కనుగొనబడిన, కానీ డీలరు తన వ్యాపార క్రమములో నిర్వహించే లెక్కలు, రిజిస్టరులు మరియు ఇతర అధికార పత్రముల యందు లెక్క చూపబడని, ఏ సరుకుల నైననూ సీజ్ చేయుటకు మరియు జప్తు చేయుటకు అధికారమును కలిగి యుండును.

అయితే - ఈ సబ్ - సెక్షను క్రింద సరుకులను జప్తు చేసేందుకు చర్య తీసుకునే ముందు దుష్ప్రభావితుడయ్యే వ్యక్తికి తన వాదనను వినిపించుకునేందుకు ఆ అధికారి అవకాశమివ్వవలెను మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన విధానము నందు ఒక విచారణను చేయవలెను.

**విశదీకరణము :** (1), (2) మరియు (3) సబ్- సెక్షనుల క్రింద చర్య తీసుకునేందుకు వివిధ అధికారుల వర్గములను ఆథరైజు చేయుటకు రాష్ట్ర ప్రభుత్వమునకు స్వేచ్ఛకలదు.

## వ్యాఖ్యానము

*పన్ను ఎగవేతను అరికట్టేందుకు వీలుగా చట్టంలో అనేక నిర్దిష్టమైన చర్యలు ఉన్నాయి. వాటిలో ప్రముఖంగా పేర్కొనదగినవి (1) తనిఖీ చేసే అధికారము (2) సోదాచేసే అధికారము (3) రికార్డు వగైరాలను తనముందుంచమని కోరే అధికారము (4) సీలు చేసే అధికారము (5) వ్యక్తుల్ని తనిఖీ చేసే అధికారము (6) స్వాధీనం చేసుకొని జప్తు చేసే అధికారము.*

***తనిఖీ, సోదా చేసే అధికారము :***

*28(2), (3) సెక్షనుల ప్రకారము తనిఖీ వ్యాపార సమయాల్లో మాత్రమే జరగాలి. వ్యాపార సమయాలు చట్టం చేత ప్రెస్క్రైబ్ చేయబడి యుంటాయి. అట్లా ప్రెస్క్రైబ్ కాని సందర్భాలలో ఎప్పుడైనా తనిఖీ చేయవచ్చునని చట్టం స్పష్టం చేస్తోంది. తనిఖీ సమయంలో విచారణ నిమిత్తం కొన్ని రికార్డులను, పత్రాలను స్వాధీనం చేసుకొన వలసివస్తే వాటిని స్వాధీనం చేసుకొన్నట్లుగా రశీదును ఇవ్వాలి. ఏదైనా దుకాణం, దుకాణం-కమ్-ఇల్లు, వాహనము వగైరాలను సోదా చేసేటప్పుడు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌ను విధిగా పాటించాలి. క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో 165వ సెక్షను సోదాలను గురించి వివరిస్తోంది. వాటిని సంగ్రహంగా ఈ క్రింది విధంగా పేర్కొనవచ్చు.*

*1) సోదా చేసే అధికారి చట్టరీత్యా సోదా చేసేందుకు అధికారమివ్వబడిన వ్యక్తి అయ్యుండాలి.*

*2) సోదా చేయడం వల్ల సదరు వస్తువు లేదా రికార్డు లభ్యమౌతుందని విశ్వసించడానికి ఆధారము ఉండాలి.*

*3) ఇంకొక రకంగా లభ్యం కాదన్న విశ్వాసాన్ని కల్గియుండాలి.*

*4) తన విశ్వాసానికి ఆధారాల్ని వ్రాత పూర్వకంగా పేర్కొనాలి. అంతేకాక దేని నిమిత్తం సోదా జరపాలనుకుంటున్నామో కూడా పేర్కొనాలి.*

*5) దీని నిమిత్తము మేజిస్ట్రేటు నుండి వారంటును పొందాలి. (కాని వా.ప. శాఖలో ఉపకమీషనరు వారంటును జారీ చేసే అధికారాన్ని కల్గియుంటాడు.)*

*6) సోదా సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం లోపు మాత్రమే జరగాలి. సూర్యాస్తమయంలోపు సోదా పూర్తి కానట్లైతే-ఆ ప్రదేశాన్ని రక్షితంగా ఉంచి మరునాడు సూర్యోదయం నుంచి సోదాను ఆరంభించాల్సి యుంటుంది.*

*7) సోదాకు సాక్షులుగా ఉండే వ్యక్తుల్ని సమన్లు ఇచ్చి పిలిపించాలి. కనీసం ఇద్దరు సాక్షులుండాల్సి యుంటుంది. వారిద్దరు*

## 29. చెక్-పోస్టు లేక అవరోధమును స్థాపించుట మరియు రవాణాలో నున్న సరుకులను తనిఖీ చేయుటః-

(1) రాష్ట్ర ప్రభుత్వము లేక వాణిజ్య పన్నుల కమీషనరు, రాష్ట్రములోని ఏ ప్రదేశము లేక ప్రదేశములందైనా ఈ చట్టము క్రింద పన్ను ఎగవేతను నిరోధించేందుకు లేక సోదా చేసేందుకు అవసరమని పరిగణించి, అట్లు చేయుట అవసరమని భావించినట్లైతే, రాష్ట్రప్రభుత్వము లేక వాణిజ్య పన్నుల కమీషనరు నోటిఫై చేయబడిన అట్టి ప్రదేశము లేక ప్రదేశములందు చెక్‌పోస్టును స్థాపించుటను లేక అవరోధమును నెలకొల్పుటను లేక రెండింటినీ, నోటిఫికేషను ద్వారా ఆదేశించవచ్చును.

(2) (1)వ సబ్-సెక్షను నందు పేర్కొన్న ప్రతి చెక్-పోస్టు లేక అవరోధము వద్ద కానీ లేదా ఏ ఇతర ప్రదేశము నందయిననూ రాష్ట్ర ప్రభుత్వము చేత అందు నిమిత్తమైఅధికార మీయబడిన ఏ అధికారి చేతనైననూ కోరబడినపుడు, వాహనము లేక పడవ యొక్క, సందర్భానుసారముగా ఏదయితే అది, డ్రైవరు లేదా ఇన్ చార్జి అయిన ఏ ఇతర వ్యక్తి అయిననూ ఆ పడవ లేక వాహనములను ఆపవలెను మరియు హేతుబద్ధంగా అవసరమైనంత సేపు దానిని నిలకడగా ఉంచ వలెను మరియు ఆ చెక్-పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారిని కాని లేదా పైన చెప్పబడినట్లు అధికారం ఇవ్వబడిన అధికారిని గానీ ఆ వాహనము లేక పడవ నందలి వస్తువులను పరీక్షించుటకు మరియు అట్టి డ్రైవరు లేక ఇన్‌చార్జి అయిన వ్యక్తి యొక్క స్వాధీనము నందున్న మోసుకొని పోబడుతున్న సరుకులకు సంబంధించిన అన్ని రికార్డులను, మోసుకొని పోబడే సరుకుల ఏదైనా అమ్మకము లేక కొనుగోలు ఉన్నదా మరియు మోసుకొని పోబడే సరుకుల అమ్మకము లేక కొనుగోలు ఉన్న సందర్భమున అట్టి అమ్మకము లేక కొనుగోలు ఈ చట్టము క్రింద పన్నుకు బాధ్యమగునా కాదా మరియు అయినట్లయితే

(ఎ) అట్టి పన్ను చెల్లింపబడినదా, లేక

(బి) అట్లు మోసుకొని పోబడుతున్న సరుకుల అమ్మకము లేక కొనుగోలు ఈ చట్టము క్రింద పన్ను చెల్లించే నిమిత్తము, అమ్మకపు బిల్లులందు లేక డెలివరీ నోట్లనందు లేక ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి ఇతర అధికారపత్రములందు సముచితముగా లెక్క చూపబడినదా.

అనుదానిని అభినిశ్చయించు ప్రయోజనార్థము తనిఖీ చేయుటకు అనుమతించబడవలెను.

(3) అట్టి పరీక్ష మరియు తనిఖీ వలన

(ఎ) (i) మోసుకొని పోబడుతున్న సరుకుల అమ్మకము లేక కొనుగోలుకు సంబంధించి ఈ చట్టము క్రింద చెల్లించవలసిన పన్ను ఏదయినా ఉన్నట్లుయితే, చెల్లించబడినదని; లేదా

(ii) మోసుకొని పోబడుతున్న సరుకుల అమ్మకము లేక కొనుగోలు, ఈ చట్టము క్రింద పన్నును చెల్లించే నిమిత్తము, (2)వ సబ్-సెక్షను యొక్క (బి) క్లాజు నందు నిర్దేశితమైన అధికార పత్రములందు సముచితముగా లెక్క చూపబడినదని అన్పించినపుడు సదరు అధికారి మోసుకొని పోవుచున్న సరుకులతో ఆ సరుకుల వాహనము లేక పడవను విడుదల చేయవలెను; లేదా

(బి) (i) మోసుకొని పోబడుచున్న సరుకుల అమ్మకము లేదా కొనుగోలుకు సంబంధించి ఈ చట్టము క్రింద చెల్లింపబడవలసిన పన్ను, ఏదయినా ఉన్నట్లయితే, చెల్లింపబడలేదని; లేదా

(ii) మోసుకొని పోబడుచున్న సరుకుల అమ్మకము లేక కొనుగోలు ఈ చట్టం క్రింద పన్ను చెల్లింపు ప్రయోజ

(7) (6)వ సబ్-సెక్షను క్రింద నిర్బంధించబడిన సరుకులు త్వరితంగా మరియు సహజంగా క్షయముకు లోబడునవి అయినప్పుడు మరియు ప్రెస్క్రైబ్ చేయబడిన కాల వ్యవధి లోపల సరుకులపై ఎట్టి క్లెయిము చేయబడనపుడు సదరు అధికారి ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి షరతులకు లోబడి అట్టి సరుకులను బహిరంగ వేలము నందు అమ్మవలెను మరియు దానికి సంబంధించిన అమ్మకపు రాబడులను ప్రభుత్వ ట్రెజరీ నందు జమ చేయవలెను.

అయితే - సదరు అధికారి ఉప వాణిజ్య పన్నుల అదికారి హోదా కన్నా తక్కువ హోదా కల అధికారి అయినట్లయితే, ఈ సబ్-సెక్షను క్రింద అమ్మకము, అదికార పరిధి గల ఉప వాణిజ్య పన్నుల అధికారి చేత చేయబడవలెను.

(8) అట్టి అమ్మకపు రాబడులపై హక్కు గల ఏ వ్యక్తికి అయిననూ, ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీకి దరఖాస్తు పై మరియు చాలినంత నిరూపణపై, ప్రసక్తములో నున్న సరుకుల అమ్మకము లేక కొనుగోలుకు సంబంధించి ఈ చట్టము క్రింద బాకీయైన అమ్మకపు పన్ను మరియు జరిమానాల మొత్తము మరియు అమ్మకపు ఖర్చులు మరియు ఇతర ఇన్సిడెంటల్ ఖర్చులను తీసివేసిన తర్వాత, (7) వ సబ్ - సెక్షను నందు ఉదహరించబడిన అమ్మకపు రాబడులు చెల్లింపబడవలెను.

**విశదీకరణము :** ఈ సెక్షను ప్రయోజనార్థము **"సదరు అధికారి"** అను వ్యక్తీకరణమునకు చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారి గాని లేక (2)వ సబ్-సెక్షను క్రింద అధికారము ఇవ్వబడిన అధికారి అని గానీ అర్థము.

## వ్యాఖ్యానము

ఈ సెక్షను ప్రకారం రాష్ట్ర ప్రభుత్వము లేదా వాణిజ్య పన్నులకమీషనరు గాని పన్నుల ఎగవేతను అరికట్టేందుకై కొన్ని ప్రదేశాలలో చెక్‌పోస్టును లేదా అవరోధాన్ని ఏర్పాటు చేయడానికి వీలుంది. సదరు చెక్-పోస్టు వద్ద తనిఖీ నిమిత్తం వాహనాల డ్రైవర్లు విధిగా తమ వాహనాలను వలసినంత వ్యవధి వరకు నిలిపి ఉంచాలి. చెక్‌పోస్టు అధికారులు వాహనంలోని వస్తువులను పరీక్షించడం, అతని వద్దనున్న రవాణా రికార్డులను తనిఖీ చేయడం చేస్తారు. సరుకుల రవాణా రికార్డులు ఈ క్రింది విధంగా ఉంటాయి.

*ఎ) డెలివరీ నోటు* *బి) సరుకుల వాహనపు రికార్డు లేదా ట్రిప్‌షీటు*

*సి) లాగ్ బుక్* *డి) అమ్మకం బిల్లు*

*1-5-1959 నుంచి "రహదారి పత్రము" ప్రవేశ పెట్టబడింది.*

*రహదారి పత్రము : 45 (4) రూలు ప్రకారము సరుకులను రవాణా చేసే వ్యక్తి 'ఫారము - X' నమూనా యందు రహదారి పత్రమును కలిగి యుండాలి. రహదారి పత్రము మూడు ప్రతుల్లో (ట్రిప్లికేట్) ఉంటుంది. అందులో మొదటి, రెండవ ప్రతులను సరుకులను తీసుకొని వెళ్తున్న వ్యక్తికి అప్పగించాలి. అందులో మొదటి ప్రతిని మొదటి చెక్-పోస్ట్ వద్ద ఇచ్చి వెళ్ళాలి. మార్గమధ్యంలో ఎక్కడా చెక్-పోస్టు లేనట్లయితే దానిని అసెసింగ్ అథారిటీకి పంపాలి. రాష్ట్రం వెలుపల నుంచి సరుకులు దిగుమతి అయ్యేటప్పుడు ఏ రాష్ట్రం నుండి సరుకులు వస్తున్నాయో సదరు రాష్ట్రపు రహదారి పత్రమును అనుమతించవచ్చు. కాని వాణిజ్య పన్నుల కమీషనరు ఆమోదించిన అమ్మకం బిల్లు లేదా ఇన్వాయిస్‌తో పాటు జత చేయబడియుండాలి.*

*ఈ క్రింది సరుకుల విషయంలో రహదారి పత్రము అవసరము ఉండదు.*

*1) స్వంత వినియోగం కోసం వస్తువుల్ని గాని గృహపరికరాలను గాని తీసికొని పోతున్నప్పుడు.*

*2) కొన్ని తరహాల వ్యవసాయక, ఉద్యానవన, పాడిపరిశ్రమ, కోళ్ళ పెంపకపు వస్తువుల్ని తీసికొని వెళ్ళేటప్పుడు.*

*చెక్ - పోస్టు అధికారుల చేత తనిఖీ చేయబడినప్పుడు పన్ను ఎగవేత జరిగినదని సదరు అధికారి సంతృప్తి చెందినట్లైతే,*

అవరోధమునకు ఇన్‌చార్జి అధికారి వద్ద నుండి ప్రెస్క్రైబ్ చేయబడిన విధానమునందు ట్రాన్సిట్ పాస్ పొందవలెను మరియు రాష్ట్రము నుండి నిష్క్రమించుటకు ముందుగా నున్న చివరి చెక్‌పోస్టు లేదా అవరోధమునకు ఇన్‌చార్జి అధికారిగా నున్న అదికారికి దానిని బట్వాడా చేయవలెను. విఫలమైనచో అట్లు మోసుకొని పోబడిన సరుకులు ఆ వాహనము యొక్క స్వంతదారు లేదా ఇన్‌చార్జి అయిన వ్యక్తి చేత రాష్ట్రమునందు అమ్మి వేయబడెనని సంభావించబడును మరియు తదనుసారము ప్రకారముగా చట్టపు నిబంధనల రీత్యా పన్ను అసెస్ చేయబడును మరియు జరిమానా, ఉన్న యెడల, విధించబడును.

అయితే - అట్టి వాహనము చేత మోసుకొనిపోబడిన సరుకులు రాష్ట్రము నందు ప్రవేశించిన అనంతరము ఏ ఇతర వాహనము లేదా ప్రయాణ సాధనము చేత రాష్ట్రము వెలుపలకు రవాణా చేయబడినట్లైతే ఆ సరుకులు రాష్ట్రము వెలుపలకు తరలించబడినవని నిరూపించవలసిన బాధ్యత ఆ వాహనపు స్వంత దారు లేదా ఇన్‌చార్జి అయిన వ్యక్తి పైననే యుండును.

**విశదీకరణము :** సరుకుల రవాణా నిమిత్తము ఎవరైనా వ్యక్తి చేత ఏదైనా వాహనము బాడుగకు నియమించబడితే, ఆ వాహనమును బాడుగకు స్వీకరించిన వ్యక్తి ఈ సెక్షను ప్రయోజనార్థము ఆ వాహనపు స్వంత దారునిగా భావించబడును.

## వ్యాఖ్యానము

*పారిశ్రామిక, వాణిజ్య రంగాలలో వచ్చిన మార్పుల కారణంగా డీలర్లు లేదా మాన్యుఫాక్చరర్లు తమ సరుకుల్ని లేదా ఉత్పత్తుల్ని ఇతర సుదూర ప్రాంతాలకు తీసుకువెళ్ళి అమ్మడం జరుగుతోంది. అట్లాంటి పరిస్థితులలో సరుకుల వాహనాలు వివిధ రాష్ట్రాల గుండా ప్రయాణిస్తాయి. ఒక్కొక్కప్పుడు సరుకులు రహదారి పత్రంలో చూపబడిన గమ్యస్థానం కన్నా భిన్నమైన ప్రదేశాలలో గూడా అన్‌లోడ్ చేయబడి అమ్మివేయబడతాయి. ఉదాహరణకు ఒరిస్సా నుండి తమిళ నాడు చేరవలసిన సరుకులు ఆంధ్ర ప్రదేశ్‌లో గుండా ప్రయాణిస్తాయి. తమిళ నాడును తన పత్రములలో గమ్యస్థానంగా చూపించినప్పటికీ డీలరు ఆంధ్ర ప్రదేశ్‌లో ఏదో ఒక ప్రాంతంలో సరుకులను దించి అమ్మివేయవచ్చు. అట్లాంటి సందర్భాలలో కట్టుదిట్టమైన ఒక క్రమపద్ధతి లేనపుడు పై చెప్పిన ప్రకారంగా దించి అమ్మబడిన సరుకులు పన్ను విధింపుకు గురికాకపోవచ్చు. అందువల్ల వీటిని క్రమబద్ధం చేసేందుకు ఈ సెక్షను ప్రత్యేకించి రూపొందించబడింది.*

## 30. అపరాధములు మరియు జరిమానాలు:-

(1) (ఎ) ఈ చట్టము క్రింద తన మీద అసెస్ చేయబడిన ఏ పన్ను నయినా లేక విధింపబడిన ఏ జరిమానానయినా లేక బాకీ పడిన ఏ రుసుము నైనా అనుమతించబడిన సమయములోపు చెల్లించుటలో విఫలమైనట్టి; లేదా

(బి) ఈ చట్టము క్రింద తాను డీలరుగా రిజిస్టరగుటకు బాధ్యుడయిన వ్యక్తి అయ్యుండియూ అట్లు రిజిస్టరు చేయించు కొననట్టి; లేదా

(సి) ఈ చట్టము యొక్క నిబంధనలు లేక దాని క్రింద చేయబడిన రూల్సుకు విరుద్ధముగా బుద్ధిపూర్వకముగా ప్రవర్తించు నట్టి

ఏ వ్యక్తియైననూ నేర నిర్ణయంపై ఐదు వందల రూపాయలకు తగ్గకుండా రెండు వేల రూపాయల వరకు విస్తరించదగిన జరిమానాతో శిక్షింపబడుటకు బాధ్యుడగును.

(2) (ఎ) 28వ సెక్షను క్రింద ఆథరైజు చేయబడిన అధికారి చేత జరుపబడే తనిఖీ, ప్రవేశము, సోదా లేదా సీజ్ చేయుటను వాటియొక్క నిబంధనలకు విరుద్ధముగా నిరోధించునట్టి లేక ఆటంకపరచునట్టి, లేదా

(బి) చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారి లేక 29వ సెక్షను క్రింద అదికారము ఇవ్వబడిన ఏ

వరకు విస్తరించ దగిన సాధారణ కారాగార శిక్ష మరియు ఐదు వందల రూపాయలకు తగ్గకుండా రెండు వేల రూపాయల వరకు విస్తరించదగిన జరిమానాతోనూ శిక్షింపబడుటకు బాధ్యుడగును.

(5) (ఎ) 26వ సెక్షను లేక 27వ సెక్షను నందు సందార్భానుసారంగా ఏదయితే అది, నిర్దిష్టపరచబడిన ఏవయినా రికార్డులు లేదా అధికార పత్రములను తనవెంట తీసుకుని వెళ్ళుటలో పడవ లేక సరుకుల వాహనము యొక్క యజమాని లేక ఇన్‌చార్జి అయిన ఇతర విఫలమైనట్లయితే నేర నిర్ణయంపై ఒక సంవత్సరం వరకు విస్తరించదగిన సాధారణ కారాగార శిక్ష మరియు ఐదు వందల రూపాయలకు తగ్గకుండా రెండు వేల రూపాయల వరకు విస్తరించ దగిన జరిమానాతోనూ శిక్షింప బడుటకు బాధ్యుడగును.

(బి) సరుకుల వాహనము లేక పడవ యొక్క యజమాని, క్లాజు (ఎ) క్రింద అపరాధము జరిగిన సమయమున ఆ పడవ లేక సరుకుల వాహనము తన అధీనమందు లేక పోయినప్పటికీ క్లాజు (ఎ) క్రింద అపరాధము కొరకు పొందుపరచబడిన శిక్షతో, తన ఎరుక లేకుండానే అపరాధము జరిగెనని లేదా అట్టి అపరాధమును నిరోధించేందుకు తాను తగిన శ్రద్ధను వినియోగించెనని అతడు నిరూపించితే తప్ప, శిక్షింపబడుటకు బాధ్యుడగును.

(6) చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారి లేదా 29వ సెక్షను యొక్క (2) వ సబ్ - సెక్షను క్రింద అధికారమివ్వబడిన అధికారిచేత డిమాండు పై పడవ లేక సరుకుల వాహనము యొక్క డ్రైవరు లేక ఇన్‌చార్జి అయిన ఏ ఇతర వ్యక్తియైననూ తన పేరు మరియు చిరునామా లేదా పడవ లేక సరుకుల వాహనము యొక్క యజమాని లేదా సరుకుల యొక్క రవాణాదారు మరియు రవాణా స్వీకర్త పేరు మరియు చిరునామా ఇచ్చుటకు తిరస్కరించినట్లయితే లేదా తప్పుడుదని తనకు తెలిసిన లేక అట్టిదని తాను విశ్వసించుటకు కారణము గల ఏ పేరు మరియు చిరునామానైననూ ఇచ్చినట్లయితే నేర నిర్ణయంపై ఒక సంవత్సరము వరకు విస్తరించదగిన సాధారణ కారాగార శిక్ష మరియు ఐదు వందల రూపాయలకు తగ్గకుండా రెండు వేల రూపాయల వరకు విస్తరించదగిన జరిమానాతోను శిక్షింపబడుటకు బాధ్యుడగును.

(7) ఏ వ్యక్తి అయినా తనకు అబద్ధమని తెలిసి యుండియూ లేక అట్టిదని విశ్వసించదగిన ఏదయినా స్టేటుమెంటు లేక డిక్లరేషనును 26వ సెక్షను లేక 27వ సెక్షను నందు, సందర్భానుసారముగా ఏదైతే అది, నిర్దిష్టపర్చబడిన ఏ రికార్డులు లేక అధికార పత్రములందైనా చేసినట్లయితే, నేర నిర్ణయంపై ఒక సంవత్సరము వరకు విస్తరించదగిన సాధారణ కారాగార శిక్షతో మరియు ఐదు వందల రూపాయలకు తగ్గకుండా రెండు వేల రూపాయల వరకు విస్తరించదగిన జరిమానాతోను శిక్షింపబడుటకు బాధ్యుడగును.

(8) ఏ సరుకుల అమ్మకము లేక కొనుగోలు సంబంధంగానైనా ఈ చట్టము క్రింద చెల్లించవలసిన ఏదైనా పన్ను యొక్క మోసపూరితమైన ఎగవేత లేదా ఎగవేతకు ప్రయత్నము లేదా ఎగవేతకు దుష్ప్రేరణ యందు తెలిసియుండియు ఏ విధంగానైనా సంబంధమున్నట్టి ఏ వ్యక్తియైననూ ఒక సంవత్సరము వరకు విస్తరించదగిన సాధారణ కారాగార శిక్షతోనూ మరియు ఐదు వందల రూపాయలకు తగ్గకుండా రెండు వేల రూపాయల వరకు విస్తరించ దగిన జరిమానాతోనూ శిక్షింపబడుటకు బాధ్యుడగును.

(9) ఈ చట్టము యొక్క నిబంధనలు లేక దాని క్రింద చేయబడిన ఏదయినా రూలు ననుసరించి తన చేత కాని లేక తన ప్రిన్సిపల్ చేతకాని లేక తన ఏజంటు చేతకాని పొందబడక, నోటిపై చేయబడే, ఏదైనా అట్టి ఫారము తన

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| 30 (3) (ఇ) | తనిఖీని నిరోధించడం లేదా పత్రాలను సమర్పించడంలో గాని, సమాచారం సమకూర్చడంలో గాని విఫలం కావడం. | | | | |
| | అపరాధం మొదటి పర్యాయం జరిగినప్పుడు | 500 | 2000 | | |
| | అపరాధం రెండవ పర్యాయం జరిగినప్పుడు | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| | అపరాధం మూడవ సారి లేదా అనంతరం జరిగినప్పుడు | 500 | 2000 | 3 నెలలు | 1 సంవత్సరము |
| 30 (4) | 5-బి సెక్షను క్రింద సరుకులను కొని హేతుబద్ధమైన కారణమేదీ లేకుండానే ప్రకటిత ప్రయోజనం కొరకు కాకుండా విఫలమవ్వడం | | | | |
| | మొదటి పర్యాయం | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| | రెండవ పర్యాయం | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| | మూడవ పర్యాయం | 500 | 2000 | 3నెలలు | 1 సంవత్సరము |
| 30 (5) (ఎ) | 26వ లేదా 27వ సెక్షనులందు పేర్కొన్న రికార్డులను వెంట తీసికొనిపోయే విషయంలో సరుకుల వాహనం, పడవల యజమానులు వగైరా విఫలం కావడం. | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| 30 (5) (బి) | సరుకుల వాహనాల, పడవల యజమానులు వగైరా అపరాధం తన ఎరుకలేకుండా జరిగిందని నిరూపించుకోలేనప్పుడు | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| 30 (6) | సరుకులను గురించిగాని, సరుకులు పంపే వ్యక్తిని గురించి గాని సమాచారం ఇవ్వడంలో తిరస్కరించడం లేదా తప్పుడు సమాచారం ఇవ్వడం. | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| 30(7) | 26వ లేదా 27 సెక్షనులందు నిర్దిష్టపరచబడిన రికార్డు లందు తప్పుడు స్టేటు మెంట్లు వగైరా ఇవ్వడం. | 500 | 2000 | - | 1 సంవత్సరము |
| 30 (8) | ఏదైనా పన్ను విషయంలో మోసపూరితమైన ఎగవేతకు గాని లేదా ఎగవేత ప్రయత్నంలో గాని తెలిసియుండి కూడా సంబంధం కల్గియుండటం లేదా పన్ను ఎగవేతకు సహకరించడం. | 500 | 2000 | - | 1 సంవత్సరము |

(1) ఉద్దేశ్య పూర్వకంగా (విల్‌ఫుల్లీ)

ఒక విధి లేదా నిషేధాన్ని పాటించేటప్పుడు ఏమరు పాటు వల్ల గాని లేక పొరపాటు వల్ల గాని లేక సరిగా గమనించకపోవడం వల్లగాని ఒక విషయాన్నిసరిగా అమలు చేయకపోవచ్చు. ఇలాంటి అపరాధాన్ని ఉద్దేశ్య పూర్వకంగా జరిగిందని చెప్పలేము. అంతేకాని చట్టాన్ని తప్పుకోణంలో గ్రహించడం వల్ల గాని, చట్టం తాలూకు అజ్ఞానం వల్లగాని చేసే తప్పులు ఈ అర్థ పరిధి లోనికి రావు. అవి ఉద్దేశ్య పూర్వకంగానే జరిగినట్లు భావించబడతాయి. చట్టం తాలూకు పరిజ్ఞానం వ్యక్తికి ఉన్నదని న్యాయశాస్త్ర కోవిదులుగాని, జడ్జీలు గాని నమ్మడం వల్ల దాని తాలూకు సాధక బాధకాలు వ్యక్తికి తెలుసునని కూడా విశ్వసించడం జరుగుతుంది.

(2) మోసపూరితంగా (ఫ్రాడ్యులెంట్లీ)

దీనిని భారత శిక్షాస్మృతి ఇలా వివరించింది. "ఒక వ్యక్తి కపటమునకు గురి చేయు ఉద్దేశ్యముతో ఏ పనినైనను చేసినచో అతడు ఆ పనిని కపటముతో చేసినట్లు చెప్పబడును. అన్యథా అట్లు చెప్పబడదు" (సెక్షను 25, భారత శిక్షాస్మృతి) అయితే ఇది నిరూపించబడాలి.

*చేయరాదు. అంటే తాను కొనుగోలు చేసినప్పటి సరుకులపై చెల్లించిన పన్ను మరియు అమ్మకాల టర్నోవరు పై చెల్లించాల్సిన పన్ను కన్నా ఎక్కువగా వసూలు చేయరాదు. అంటే రెండవ అమ్మకం దారుగా ఉండే డీలరుతో సహా తక్కిన డీలర్ల కందరికీ ఇది వర్తిస్తుంది. వ్యాట్ విధానంలో ఉన్న నిర్ణీత సరుకుల్ని డీల్ చేస్తున్న డీలర్లకు వాల్యూ అడిషన్ మీద చెల్లించాల్సిన పన్నును కూడా వర్క్ అవుట్ చేసుకోవాల్సిన అవసరాన్ని ఈ సెక్షను తెలియ చేస్తుంది.*

## 30 -సి. కొన్ని నిబంధనలు ఉల్లంఘించడం కారణంగా జరిమానా విధించడం:

(1) 30-బి సెక్షను యొక్క నిబంధనలను ఏ వ్యక్తి అయిననూ ఉల్లంఘిస్తూ పన్నును వసూలు చేసినట్లైతే, అట్లు వసూలు చేయబడిన ఏ మొత్తమైననూ పూర్తిగా గాని లేదా భాగంగా గాని రాష్ట్ర ప్రభుత్వానికి అపరాధ జప్తు చేయబడవలెను మరియు అదనంగా రెండు వేల ఐదు వందల రూపాయిలకు మించని మొత్తాన్ని జరిమానాగా చెల్లించుటకు బాధ్యుడగును.

ఫారము-బి - 5 మరియు ఏ-6 ను చూడుము.

అయితే-అసెసింగ్ అథారిటీ జరిమానాను లేదా అపరాధ జప్తును విధించేటప్పుడు 30-బి సెక్షనును ఉల్లంఘిస్తూ పన్ను రూపంగా వసూలు చేయబడిన మొత్తాన్నుంచి కొనుగోలు దారుకు వాపసు చేయబడిన మొత్తాన్ని లేదా సదరు వాపసు కొరకు సంతృప్తికరమైన ఒప్పందము చేయబడిన విషయాన్ని పరిగణనలోకి తీసుకోవాలి.

(2) (1) వ సబ్-సెక్షను క్రింద నిర్దేశితమైన మొత్తము వసూలు చేయబడిన తేదీ నుంచి మూడు సంవత్సరములు ముగిసిన అనంతరము అపరాధ జప్తు నిమిత్తము ఎట్టి ఉత్తర్వు ఈ సెక్షను క్రింద చేయబడరాదు.

అయితే - ఈ సబ్-సెక్షను క్రింద మూడు సంవత్సరాల కాల వ్యవధిని లెక్కించేటప్పుడు దీని సంబంధంగా ఏదైనా స్టే ఉత్తర్వు అమల్లో ఉన్న వ్యవధి లేదా ఏదైనా అప్పీలు లేదా ఇతర ప్రొసీడింగు పెండింగు ఉన్న వ్యవధిని తీసివేయాలి.

(3) అసెసింగ్ అథారిటీ ఈ చట్టము యొక్క ఏదైనా ప్రొసీడింగుక్రమంలో లేదా ఇతర విధంగా గాని (1) వ సబ్ -సెక్షను క్రింద ఏదైనా మొత్తాన్ని అపరాధ జప్తు సహితంగా లేదా రహితంగా జరిమానాకు ఒక వ్యక్తి బాధ్యుడయ్యెనని నమ్ముటకు కారణమున్నప్పుడు సదరు అథారిటి అట్టి వ్యక్తికి ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారమునందు ఒక నోటీసును, నోటీసు నందు నిర్దిష్ట పర్చబడిన తేదీన మరియు ప్రదేశము వద్ద, (1)వ సబ్-సెక్షను క్రింద పొదుపరచబడినట్లుగా ఏదైనా మొత్తము యొక్క అపరాధ జప్తు సహితంగా లేదా రహితంగా జరిమానా అతనిపై ఎందుకు విధింపబడరాదో కారణం చూపించుటకు, అతని హాజరును అపేక్షించుచూ, పంపవలెను.

(4) ఆ మీదట అసెసింగ్ అథారిటీ విచారణను నిర్వహించి తనకు యుక్తమనిపించినట్టి ఉత్తర్వును చేయవలెను.

(5) ఈ సెక్షను క్రింద జరిమానా విధించబడినట్టి అదే వాస్తవములకు సంబంధించి ఈ చట్టం క్రింద అపరాధము నిమిత్తముగా ఎట్టి అభియోగము నడపబడరాదు.

## వ్యాఖ్యానము

*30-బి నిబంధనల్ని ఉల్లంఘించి పన్నును అధికంగా వసూలు చేసిన సందర్భాలను గురించి, దానిపై చర్యలను గురించి ఈ సెక్షను వివరిస్తోంది. అదనంగా వసూలు చేయబడిన మొత్తము ప్రభుత్వానికి అపరాధ జప్తుగా జమ అవుతుంది. దానికి పాటించాల్సిన విధానాన్ని ఈ సెక్షను వివరించింది. అదనంగా రెండు వేల ఐదు వందల రూపాయల జరిమానా కూడా విధించటానికి అసెసింగ్ అథారిటీకు అధికారం ఉంది. ఆ అధికారాన్ని వినియోగించేటప్పుడు అదనంగా వసూలు చేసిన పన్ను మొత్తాన్ని వాపసు చేసిన లేదా, అందుకొరకు ఏర్పాట్లు చేసినట్లు అసెసింగ్ అథారిటి సంతృప్తి చెందినట్లయితే అపరాధ జప్తు చేయనవసరం లేదు.*

చేయబడిన ఏ ప్రొసీడింగు అయినను అంతిమమై యుండును మరియు వాటిపై ఎటువంటి అప్పీలు లేక రివిజను కొరకు దరఖాస్తు చేయబడరాదు.

## వ్యాఖ్యానము

*30వ సెక్షను మరియు 64వ రూలు నిబంధనల రీత్యా సంభవించిన అపరాధాలపై మొదటి తరగతి మేజిస్ట్రేటు సమక్షంలో అభియోగము నడపవలసి యుంటుంది. కాని ఫలితం తేలటానికి పట్టే కాలహరణం అటు అధికార వర్గానికి ఇటు వ్యాపార వర్గాలకు ఏర్పడే వ్యయ ప్రయాసల్ని దృష్టిలో యుంచుకొని అభియోగం నడపడం స్థానంలో రాజీ రూపంగా కొంత మొత్తాన్ని చెల్లించటానికి అనువుగా ఈ సౌకర్యం ఏర్పరుస్తూ ఈ సెక్షను ఏర్పడింది.(1) వ సబ్-సెక్షను ప్రకారము సదరు అథారిటీ అపరాధము చేసిన వ్యక్తి నుంచి అట్టి అపరాధమునకు రాజీ రుసుముగా కొంత మొత్తాన్ని అంగీకరించవచ్చునని తెలియజేస్తుంది.*

*అంటే ఫలానా మొత్తం ధనం చెల్లించగలననే ప్రతిపాదన మొట్ట మొదటగా డీలరు నుంచే రావాలన్నది ఈ సెక్షను అంతరంగిక ఉద్దేశ్యంగా కనపడ్తోంది. అందుకు ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీ తన ఆమోదాన్ని తెలియచేయవచ్చు.*

*ఈ రాజీ రుసుము పరంగా అపరాధాలు రెండు రకాలుగా ఉంటాయి.*

*1) చట్టం క్రింద వసూలు చేయదగిన ఏదైనా పన్నును చెల్లించటంలో విఫలం కావటం లేదా బాకీ అయ్యే పన్నును ఎగవేయటం.*

*2) తదితరమైన అపరాధాలన్నియూ ఈ రెండవ తరగతి అపరాధం క్రిందకు వస్తాయి.*

*మొదటి తరగతి అపరాధాలపై రాజీ రుసుము రూ. 3000/- లు మించరాదు లేదా వసూలు చేయదగిన పన్నుకు రెట్టింపు వసూలు చేయవచ్చును. అయితే - వీటిలో దేన్ని అంగీకరించాలి అంటే దేనివల్ల అధికమొత్తము రాష్ట్రకోశానికి లభిస్తుందో దానినే అమలు చేయాలి అని సెక్షను చెప్తోంది. ఈ చట్టము అంతిమ ప్రయోజనంగా యున్న రాష్ట్ర రెవిన్యూ ప్రయోజనాలను దృష్టిలో యుంచుకొని ఈ నిబంధన ఏర్పరచినట్లుగా కన్పిస్తోంది.*

*మిగతా రెండవ శ్రేణి అపరాధాల విషయంలో రాజీ రుసుము గరిష్ఠంగా రూ. 3000/- లు దాటరాదు.*

*ఇతర అపరాధాల్లో కొన్ని అతి తీవ్రమైన అపరాధాలున్నాయి. అవి ఆర్థిక పరంగా ఉన్న అవినీతికి సంబంధించినవే కాక వ్యక్తి ప్రవర్తన, క్రమ శిక్షణ మొదలగు అంశాలతో కూడుకొని యుంటాయి. ఉదాహరణకు తనిఖీ అధికారుల మీద దౌర్జన్యం, నిరోధించడం లాంటివి. వీటికి శిక్షలు కూడా జైలు శిక్ష వంటి తీవ్రమైనవే పేర్కొనబడ్డాయి. అట్లాంటి అపరాధాల్లో అభియోగం నడపటమే వాంఛనీయంగా కనపడుతోంది.*

*రాజీ రుసుము ప్రొసీడింగ్సు నందు (కాంపోజిషన్ ప్రొసీడింగ్సు) అప్పీలు కాని. రివిజను కానీ యుండదనేది నిర్ధారింపబడిన అభిప్రాయం,. ఎందువల్లనంటే - రాజీ అనేది ఉభయపక్షాల (బైలేటరల్) ఆమోదంపై ఆధారపడి ఉంటుంది.*

**33. వాపసులు :**

అసెసీ లేక లైసెన్సు దారుని చేత తాత్కాలికంగా ఏదయినా ప్రత్యేక కాల వ్యవధికి చెల్లించబడిన, ఏదయినా ఉన్నట్లయితే, పన్ను లేక లైసెన్సు రుసుములు ఆ కాల వ్యవధికి అతని చేత చెల్లింపబడవలసిన పన్ను లేక లైసెన్సు రుసుము కంటే అధికంగా నున్నట్లు కనుగొనబడినట్లయితే, అసెసింగ్ అథారిటీ లేదా లైసెన్సు నిచ్చు అథారిటీ, సందర్భానుసారంగా ఎవరైతే వారు, వాపసు చేయవలెను లేదా అసెసీ లేక లైసెన్సు దారుని యొక్క అభిమతముననుసరించి సదరు అధికమును మరియే ఇతర కాలవ్యవధికి సంబంధించిన పన్ను లేక లైసెన్సు రుసుము బాకీకి సర్దుబాటు చేయవచ్చును.

అయితే- అసెస్‌మెంటు లేక లైసెన్సు నిచ్చు అథారిటీ, సందర్భానుసారంగా ఎవరయితే వారు. డిమాండు నోటీసు

*అథారిటీ వాపసును యివ్వవలసి యుంటుందని 35వ రూలు స్పష్టం చేస్తోంది. వాపసు చేయదగిన మొత్తాన్ని తమ వద్ద వాపసు చేయకుండా యుంచుకొనడానికి అధికార వర్గానికి అధికారం లేదని పోలానా టీ కో వర్సెస్ సూపరింటెండెంట్ టాక్సెస్ నౌగాంగ్ మరియు ఇతరులు (69 యస్.టి.సి.) (290) కేసులో సుప్రీంకోర్టు స్పష్టం చేసింది.*

**33-బి బి. కొన్ని సందర్భాలలో పన్ను వాపసు చేయకపోవుట :**

కోర్టు లేక ట్రిబ్యునలు యొక్క ఏ తీర్పు లేక ఉత్తర్వు వలననైనా ఒక పన్ను యొక్క విధింపు మరియు వసూలు మాన్యత లేనిదిగా నిర్ణయింప బడినపుడు, డీలరు చేత కొనుగోలు దారుని నుండి ఆ పన్ను వసూలు చేయబడలేదని అసెసింగ్ అథారిటీకి సంతృప్తి కలుగునట్లు డీలరుచేత నిరూపించబడితే తప్ప అట్టి ఏ పన్నునైనా డీలరుకు వాపసు చేయవలసిన అవసరం లేదు.

35వ రూలును చూడుము.

## వ్యాఖ్యానము

*ఈ సెక్షను 1986లో 19వ చట్ట రీత్యా 1-9-1986 నుంచి అమలులోనికి వచ్చింది. అమ్మకపు పన్ను అన్ని వాస్తవ ప్రయోజనాల దృష్ట్యా సాధారణంగా పరోక్ష పన్నుగా భావించబడుతోంది. అంటే డీలర్లు తన కొనుగోలుదారునుంచి విధించదగిన పన్ను ముందుగానే వసూలు చేసి ప్రభుత్వానికి చెల్లిస్తారు. అయితే - దీని అర్థం డీలరుకు చెల్లించాల్సిన బాధ్యత కొనుగోలు దారుల నుంచి తానుగా వసూలు చేయటం మీదే ఆధారపడి యుంటుందని కాదు. తన కొనుగోలు దారుల నుంచి పన్ను రూపంగా వసూలు చేసినా, చేయకపోయినా పన్నును చెల్లించాల్సిన బాధ్యత డీలరు మీదనే యుంటుంది.*

*అయితే- కొన్ని సందర్భాలలో కోర్టులు గాని, ట్రిబ్యునల్సు గాని పన్ను విధింపు, వసూళ్ళను మాన్యత లేనివిగా ప్రకటిస్తే వెంటనే ఫలితంగా ఏదైనా వాపసు చేయాల్సిన అవసరమేర్పడితే దానిని విధిగా వాపసు చేయాలా? అన్న ప్రశ్నకు, ఒక షరతును ఈ సెక్షను విధిస్తోంది.*

*ఆ డీలరు అసెసింగ్ అథారిటీ సంతృప్తి చెందేటట్లుగా తాను కొనుగోలు దారుని నుండి పన్ను వసూలు చేయలేదని నిరూపించుకోవాల్సి యుంటుంది.*

**33-సి. కొన్ని సందర్భాలలో వాపసును నిలిపివేయుటకు అధికారము :**

ఒక అసెసీ లేక లైసెన్సు దారునికి వాపసు ఉత్పన్నమయ్యే ఉత్తర్వు, అప్పీలు లేక తదుపరి ప్రొసీడింగు నందు ప్రధాన విషయమైనపుడు లేదా ఈ చట్టము క్రింద ఏ ఇతర ప్రొసీడింగైనా పెండింగులో నున్నపుడు అసెసింగ్ అథారిటీ లేక లైసెన్సు నిచ్చు అథారిటీ వాపసు యొక్క అనుదానము రెవిన్యూకు ప్రతికూలముగా దుష్ప్రభావమును కలిగించునని అభిప్రాయపడినపుడు ఆ అసెసింగ్ అథారిటీ లేదా లైసెన్సు నిచ్చు అథారిటీ ఉపకమీషనరు యొక్క పూర్వానుమతితో ఆ వాపసును ఉపకమీషనరు నిర్ణయించే అట్టి సమయము వరకు నిలిపి వేయవచ్చును.

## వ్యాఖ్యానము

*కొన్ని పరిస్థితులలో వాపసు చేయదగిన మొత్తాన్ని వాపసు చేయకుండా నిలుపు చేయటానికి అసెసింగ్ అథారిటీకి అధికారమున్నది. అయితే - అందు నిమిత్తముగా సంబంధిత వాణిజ్య పన్నుల ఉప కమీషనరు నుంచి పూర్వామోదం పొందవలసి యుంటుంది. అట్లాంటి సందర్భాలు సాధారణంగా ఈ క్రింది పరిస్థితులలో ఏర్పడుతాయి.*

ఒక్కొక్కప్పుడు XXIII వ ఫారము నందు ఏవైనా దోషాలు ఉంటే వాటిని సరి చేసేందుకు డీలరుకు అసెసింగ్ అథారిటీల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరుగవచ్చు. అలా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన కాల వ్యవధి నంతా 6 నెలల నుంచి మినహాయించి 6 నెలల వ్యవధిని పరిగణించాలి. ఏ కారణం వల్లనైనా 6 నెలల వ్యవధి తరువాత వాపసు చెల్లించబడినట్లయితే 12 శాతము చొప్పున సామాన్య వడ్డీని చెల్లించవలసి యుంటుంది.

*(2) వ సబ్ సెక్షను ప్రకారము 6 నెలల వ్యవధి నుంచి ఎంత వ్యవదిని ఉత్తర ప్రత్యుత్తరాలకు తీసివేయవచ్చుననేది వివాదాస్పదమైతె ఆ విషయంలో అంతిమ నిర్ధారణ వాణిజ్య పన్నుల కమీషనరు చేత చేయబడాలని వివరించబడింది.*

## 33-యఫ్. ఎట్టి క్లెయిము చేయనవసరము లేని వాపసుపై వడ్డీ :

(1) 33-బి సెక్షను నందు నిర్దేశింపబడిన ఉత్తర్వు ననుసరించి ఏదైనా వాపసు అసెసీ లేక లైసెన్సు దారునికి బాకీ అయినపుడు మరియు అసెసింగ్ లేదా లైసెన్సు నిచ్చే అథారిటీ అట్టి ఉత్తర్వు తేదీ నుంచి ఆరు నెలల వ్యవధి లోపల వాపసును అనుదానము చేయనిచో రాష్ట్ర ప్రభుత్వము సంవత్సరమునకు పన్నెండు శాతం సామాన్య వడ్డీని బాకీ అయిన వాపసు మొత్తముపై అసెసీ లేక లైసెన్సు దారునికి పైన చెప్పబడిన ఆరు నెలల వ్యవది యొక్క ముగింపును అనుసరించి వెంటనే వచ్చు తేదీ నుండి వాపసు అనుదానము చేయబడిన తేదీ వరకు చెల్లించవలెను.

(2) 33-సి సెక్షను నిబంధనల క్రింద వాపసు నిలిపి వేయబడినపుడు అప్పీలు లేక తదుపరి ప్రొసీడింగు ఫలితంగా అంతిమముగా బాకీగా నిర్ణయింప బడిన వాపసు మొత్తముపై 33-సి సెక్షను నందు నిర్దేశితమైన ఉత్తర్వు యొక్క తేదీ నుండి ఆరు నెలల వ్యవధి ముగిసిన అనంతరము ఆరంభమై వాపసు అనుదానము చేయబడిన తేదీ వరకు గల కాల వ్యవధి కొరకు రాష్ట్ర ప్రభుత్వము పైన చెప్పబడిన రేటు ప్రకారము వడ్డీని చెల్లించవలెను.

## వ్యాఖ్యానము

*కొన్ని సందర్భాలలో వాపసును అనుదానము చేయల్సిన బాధ్యత అసెసింగ్ అథారిటీ మీదనే ఉంటుంది. అట్టి సందర్భాలలో డీలరు ప్రత్యేకించి దరఖాస్తు చేయనవసరం లేదు. అలాంటి సందర్భాలు 33-బి సెక్షను క్రిందగాని లేక 33-సి సెక్షను క్రింద గాని తలెత్తవచ్చు. 33-బి సెక్షను క్రింద అప్పిలేటు లేదా రివిజను ఉత్తర్వుల ప్రకారము వాపసులు సంభవించవచ్చు. 33-సి సెక్షను క్రింద పేర్కొన్న నిబంధనల ప్రకారము వాపసులు నిలిపి వేయబడి యుండవచ్చు.*

*(1) వ సబ్-సెక్షను 33-బి సెక్షను క్రింద పేర్కొన్న పరిస్థితులలోని వాపసులను వివరిస్తోంది. ఈ సందర్భాలలో 6 నెలల వ్యవదిని లెక్కించే నిమిత్తము అప్పిలేటు లేక రివిజను ఉత్తుర్వుల తేదీ నుంచి లెక్కించాలి. ఇదే విధంగా 33-సి ప్రకారం ఆపివేయబడిన వాపసులకు కూడా లెక్కించాలి.*

## 34. అధికార పత్రముల దాఖలు మరియు సాక్షుల సమనుకు అధికారము :

(1) అసెసింగ్ అథారిటీ లేదా అప్పిలేటు ట్రిబ్యునలుతో సహా అప్పిలేటు లేక రివైజింగ్ అథారిటీ లేదా సహాయ వాణిజ్య పన్నుల అధికారి స్థాయికి తగ్గని వాణిజ్య పన్నుల శాఖ యొక్క ఏ అధికారియైనను ఈ చట్ట ప్రయోజనార్థము

(ఎ) ఏ వ్యక్తి యొక్క హాజరునైనా సమను చేయుటకు మరియు అమలు చేయుటకు మరియు అతనిని ప్రతిజ్ఞ లేక ప్రమాణ పూర్వకంగా పరీక్షించుటకు, మరియు

## వ్యాఖ్యానము

అసెసింగ్ అథారిటీ గాని లేదా అప్పిలేటు అథారిటీ గాని లేదా రివైజింగ్ అథారిటీ గాని ఈ చట్టము క్రింద అనేక విధాలైన ప్రొసీడింగ్సును చేయాల్సి ఉంటుంది. వాటికి ఉపయోగపడే సమాచారము ఎవరైనా ఒక వ్యక్తి వద్ద లేదా అథారిటీ వద్ద యుండవచ్చు. అట్టి సమాచారాన్ని అధికార యంత్రాంగం రాబట్టుకొనవచ్చునా?అన్న అంశాన్ని ఈ సెక్షను వివరిస్తోంది. ఏ అధికారి లేదా వ్యక్తినైనా ఒక నిర్దిష్ట సమాచారాన్ని ఇవ్వమని అసెసింగ్ అథారిటీ గాని లేక అప్పిలేటు అథారిటీ గాని, రివైజింగ్ అథారిటీ గాని కోరేందుకు ఈ సెక్షను ప్రకారము అవకాశం ఇవ్వబడింది. అట్లా కోరబడిన వ్యక్తి లేదా అథారిటీ సముచితమైన కాల వ్యవధిలోపు సదరు వివరాలు, సమాచారాన్ని, రికార్డులను సమకూర్చాలని కూడా ఈ సెక్షను ఆదేశిస్తోంది. దీనికి సంబంధించిన 55వ రూలు ఇలా వివరిస్తోంది.

దాని ప్రకారం అసెస్‌మెంటు లేదా అప్పిలేటు లేక రివిజనల్ అథారిటీ ముందున్న చర్యలు భారత శిక్షాస్మృతి 193, 228 సెక్షనుల అర్థ పరిధిలో యున్నట్టి న్యాయపరమైన చర్యలు (జ్యుడిషియల్ ప్రొసీడింగ్సు)గా భావించబడతాయి.

**తక్షణం ఉపయోగపడేందుకు వీలుగా భారత శిక్షాస్మృతి 193, 228 సెక్షనులను ఈ క్రింద ఉటంకించడం జరిగింది.**

**సెక్షను -1 93 తప్పుడు సాక్ష్యమునకు శిక్ష :**

జ్యుడిషియల్ ప్రొసీడింగ్సు యొక్క ఏ దశలోనైననూ ఉద్దేశ్యపూర్వకముగా తప్పుడు సాక్ష్యము నిచ్చు లేక జ్యుడిషియల్ ప్రొసీడింగ్సు యొక్క ఏ దశలోనైననూ ఉపయోగింపబడు నిమిత్తము తప్పుడు సాక్ష్యము కల్పించు వారెవరైననూ, 7 సంవత్సరముల దాకా యుండగల కాలావధికి రెంటిలో ఒక రకపు కారాగారవాసముతో శిక్షింపబడుదురు మరియు జుల్మానాకు కూడా పాత్రులగుదురు;

మరియు ఏ ఇతర కేసులోనైననూ ఉద్దేశ్యపూర్వకంగా తప్పుడు సాక్ష్యము నిచ్చు లేక తప్పుడు సాక్ష్యము కల్పించు వారెవరైననూ 3 సంవత్సరముల దాకా యుండగల కాలావధికి రెంటిలో ఒకరకపు కారాగార వాసంతో శిక్షింపబడుదురు మరియు జుల్మానాకు కూడా పాత్రులగుదురు.

**విశదీకరణము :** (1) సైనిక న్యాయ స్థాన సమక్షమున జరుగు విచారణ జ్యుడిషియల్ ప్రొసీడింగ్సు అగును.

**విశదీకరణము :** (2) న్యాయ స్థాన సమక్షమున జరిగెడి చర్యకు పూర్వరంగముగా శాసన రీత్యా ఆదేశింపబడు దర్యాప్తు, ఆ దర్యాప్తు న్యాయస్థాన సమక్షమున జరుగకపోయినప్పటికీ జ్యుడిషియల్ ప్రొసీడింగు యందు ఒక దశయై యుండును.

**సెక్షను - 228 : జ్యుడిషియల్ ప్రొసీడింగ్సు నిర్వహించుచున్న పబ్లిక్ సేవకునకు ఉద్దేశ్య పూర్వకంగా అవమానము లేక అంతరాయము కల్గించుట :**

ఏ పబ్లిక్ సేవకుడైనను ఒక జ్యుడిషియల్ ప్రొసీడింగ్సు ఏ దశలోనైనను నిర్వహించుచుండగా ఉద్దేశ్య పూర్వకంగా అట్టి పబ్లిక్ సేవకుని ఏదేని అవమానమునకు గురిచేయు లేక అతనికి ఏదేని అంతరాయమును కలుగ చేయు వారెవరైననూ, 6 మాసాల దాకా ఉండగల కాలావధికి సాధారణ కారాగార వాసంతో గాని, రూ. 1000/-లు దాకా ఉండగల జుల్మానాతో గానీ, ఈ రెంటితో గాని శిక్షింపబడుదురు.

అలాగే సమన్సును తనకు అందజేయకుండా తప్పించు కోవాలని చూడటం కూడా భారత శిక్షాస్మృతి 172, 173, 174 ప్రకారం నేరాలుగా పరిగణించబడతాయి.

**సెక్షను 172: సమను తామీలు కాకుండుటకు లేక ఇతర చర్యజరగకుండుటకు పరారి అగుట:**

పబ్లిక్‌సేవకుడిగా సమన్సును నోటీసును లేక ఉత్తర్వును జారీచేయుటకు శాసనరీత్యా సమర్థుడైనట్టి ఎవరేని పబ్లిక్ సేవకుని నుండి వచ్చినట్టి సమనును, నోటీసును, ఉత్తర్వును తనకు తామీలు కాకుండా తప్పించుకొనుటకు గాను పరారీ అగువారు ఎవరైననూ, ఒక మాసము దాకా ఉండగల కాలావధికి సాధారణ కారాగార వాసముతో గాని, 500 రూపాయలు దాకా ఉండగల జుల్మానాతోగాని, ఈ రెండింటితో గాని శిక్షింపబడుదురు లేక ఆ సమను గాని, నోటీసుగాని, ఉత్తర్వుగాని న్యాయస్థానము నందు

**సెక్షను-179 : ప్రశ్నించుటకు అథారిటీగల పబ్లిక్ సేవకునికి జవాబు నిచ్చుటకు నిరాకరించుట:**

ఎవరేని పబ్లిక్ సేవకునికి ఏదేని విషయం గురించి నిజము చెప్పుటకు శాసన రీత్యా బద్ధుడైయుండి ఆ పబ్లిక్ సేవకుడు తనకు శాసన రీత్యా కల అధికారములను వినియోగించుటలో ఆ విషయమును గురించి అడిగిన ఏదేని ప్రశ్నకు జవాబు నిచ్చుటకు నిరాకరించు వారెవరైనను 6 మాసముల దాకా ఉండగల కాలావధికి సాధారణ కారాగార వాసముతో గాని, ఒక వెయ్యి రూపాయల దాకా ఉండగల జుల్మానాతో గాని, ఈ రెండింటితో గాని శిక్షింపబడుదురు.

**సెక్షను - 180 : కథనముపై సంతకము చేయుటకు నిరాకరించుట :**

ఏదేని కథనముపై తత్ కర్తను సంతకము చేయమని కోరుటకు శాసనరీత్యా సమర్థుడైన పబ్లిక్ సేవకుడు ఆ కథనముపై అతనిని సంతకం చేయమని కోరినప్పుడు, దానిపై సంతకం చేయుటకు నిరాకరించునతడెవరైనను 3 మాసముల దాకా ఉండగల కాలావధికి సాధారణ కారాగార వాసముతో గాని, ఐదు వందల రూపాయల దాకా ఉండగల జుల్మానాతోగాని, ఈ రెండింటితో గాని శిక్షింపబడును.

**సెక్షను - 181 : పబ్లిక్ సేవకుని సమక్షమున లేక ప్రమాణమునైనను, ప్రతిజ్ఞనైనను చేయించుటకు అథారిటీ గల వ్యక్తి సమక్షమున ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి కూడా అబద్ధము చెప్పుట :**

ఎవరేని పబ్లిక్ సేవకునికి గాని, ప్రమాణమునైనను, ప్రతిజ్ఞనైనను చేయించుటకు శాసనరీత్యా అథారిటీ గల ఎవరేని ఇతర వ్యక్తికిగాని, ఏదేని విషయము గురించి నిజము చెప్పుటకై ప్రమాణము లేక ప్రతిజ్ఞ ద్వారా శాసన రీత్యా బద్ధుడైయుండి, అట్టి పబ్లిక్ సేవకునికి గాని పైన చెప్పబడినట్టి ఇతర వ్యక్తికి గాని ఆ విషయము గురించి అబద్ధమైనట్టిదగు మరియు అబద్ధమైనదని తనకు తెలిసియున్నట్టిదగు అట్టిదని తాను విశ్వసించునట్టిదైనను, లేక నిజమైనదని తాను విశ్వసించనట్టిదైనను అగు దేనినైనను చెప్పిన వారెవరైనను మూడు సంవత్సరముల దాకా యుండగల కాలావధికి రెంటిలో ఒక రకపు కారాగారవాసముతో శిక్షింపబడుదురు, మరియు జుల్మానాకు కూడా పాత్రులగుదురు.

## 35. ప్రొసీడింగ్సు నందు ఏ అథారిటీ ముందైననూ హాజరగుట :

ఈ చట్టము క్రింద ఏ ప్రొసీడింగ్సు సంబంధంగానైనను హైకోర్టు కన్నా భిన్నమైన ఏ అథారిటీ ముందైనను హాజరగుటకు హక్కుదారైన ఏ వ్యక్తియైననూ సదరు అథారిటీ ముందు

(ఎ) తన బంధువు లేక తనచేత క్రమబద్ధముగా నియోగింపబడిన వ్యక్తి ఇందు నిమిత్తము వ్రాత పూర్వకంగా తన చేత యథాక్రమంగా ఆథరైజు చేయబడినట్లయితే సదరు బంధువు లేక వ్యక్తి ద్వారా, లేదా

(బి) ఒక న్యాయవాది ద్వారా గానీ, లేదా

(సి) చార్టర్డ్ అక్కౌంటెంట్సు చట్టము, 1949 యొక్క అర్థపరిధిలో నున్నట్టి మరియు ఈ విషయమునందు రూల్సు నందు ఉంచబడిన షరతులకు లోబడి ఏ చార్టర్డు అక్కౌంటెంటు ద్వారాగానీ లేదా ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి రుసుముల చెల్లింపుపై మరియు అట్టి అర్హతను కలిగి యుండి సదరు అథారిటీ చేత అమ్మకం పన్ను వృత్తిదారుగా పేరు నమోదు చేయించుకొనబడిన వ్యక్తి ద్వారాగాని, సదరు అక్కౌంటెంటు లేక అమ్మకం పన్ను వృత్తిదారు ఇందు నిమిత్తమై వ్రాత పూర్వకంగా యథాక్రమముగా ఆథరైజు చేయబడినట్లయితే ప్రాతినిధ్యము వహించబడవచ్చును

63-ఎ, 57 మరియు 63 (2) రూల్సును,ఫారము- XXVI ఫారము ను చూడుము.

ఏ చర్యల కొరకైననూ రాష్ట్ర ప్రభుత్వము యొక్క అధికారి లేక సేవకునికి వ్యతిరేకంగా ఎట్టిదావా, అభియోగము నడపుట లేక ఇతర ప్రొసీడింగు ఉండదు మరియు ఫిర్యాదు చేయబడిన అట్టి చర్య జరిగిన తేదీ నుండి ఆరు నెలల వ్యవధి ముగిసిన అనంతరము ఎట్టి దావా, అభియోగము నడుపుట లేక ఇతర ప్రొసీడింగు ఆరంభించరాదు.

(2) ఈ చట్టము క్రింద లేక చేత తనపై విధింపబడిన విధులను నిర్వహించే లేదా అప్పగించబడిన కార్యవిధులను నిర్వర్తించే క్రమంలో సద్భావపూర్వకముగా ఆ చర్య చేయబడినట్లయితే, అట్టి ఏ చర్య సంబంధంగానూ ఏ సివిల్ లేక క్రిమినల్ ప్రొసీడింగు నందును రాష్ట్ర ప్రభుత్వము యొక్క ఏ అధికారి లేక సేవకుడు బాధ్యుడు కాడు.

## వ్యాఖ్యానము

*అధికారులు తమ కర్తవ్య నిర్వహణంలో చేసే చేతలను కోర్టులో ప్రశ్నించడానికి వీలుంది. అధికారుల మీద కోర్టులో వ్యాజ్యాన్ని నడపవచ్చు, అభియోగాన్ని నడపవచ్చు లేదా ఇతర ప్రొసీడింగును దేనినైనా నడపవచ్చు. అలాంటి పరిస్థితుల్లో అధికారయంత్రాంగం కోర్టుల లావాదేవీల్లో మిగిలిపోయే ప్రమాదముంది. మనో స్థైర్యము కోల్పోవచ్చు. అలాంటి చిక్కులను తప్పించేందుకు వీలుగా ఈ ప్రత్యేక సంరక్షణ కల్పించబడింది. అందువల్ల ఈ సెక్షను మూడు షరతులను విధించింది.*

*1) ప్రభుత్వం వారి పూర్వానుమతి లేనిదే వ్యాజ్యము వంటివి నడపరాదు.*

*2) ఏ చర్యకు వ్యతిరేకంగా వ్యాజ్యంనడపబడుతుందో అది ఫిర్యాదు చేయబడిన ఆరు నెలలలోపు మాత్రమే వీలుంది.*

*3) సద్భావ పూర్వకంగా చేయబడిన చర్యలకు వ్యతిరేకంగా వ్యాజ్యం తీసికొనిరారాదు.*

*"సద్భావ పూర్వకంగా చేయబడిన చర్యలు" అని నిర్దిష్టంగా పేర్కొనటం వల్ల చట్టం ఆదర్శాలను సాధించేందుకు చట్టపు నిబంధనలప్పగించిన విధులు, కర్తవ్యాలు మాత్రమే దీని పరిధిలోకి వస్తాయి.*

**38. రాష్ట్రము వెలుపల దిగుమతి లేక ఎగుమతి క్రమము నందు జరిగే అమ్మకాలు లేక కొనుగోళ్ళు వగైరాలపై ఈ చట్టము వర్తించకుండుట :**

అమ్మకం లేక కొనుగోలు

(i) రాష్ట్రము వెలుపల, లేక

(ii) భారత సరిహద్దులోపలకు సరుకుల దిగుమతి లేక వెలుపలకు సరుకుల ఎగుమతి క్రమము నందు, లేక

(iii) అంతర్ రాష్ట్రీయ వర్తక లేక వాణిజ్య క్రమము నందు

జరిగినప్పుడు ఏవయినా సరుకుల అట్టి అమ్మకం లేక కొనుగోలుపై పన్ను విధించుటకు లేక విధింపును ఆథరైజు చేయుటకు ఈ చట్టము లోనిదేదీ ఉన్నట్లు భావింపబడరాదు.

**విశదీకరణం :** ఒక అమ్మకం లేక కొనుగోలు అంతర్ రాష్ట్రీయ వర్తక లేక వాణిజ్య క్రమము నందు లేదా రాష్ట్రం వెలుపల లేదా దిగుమతి లేక ఎగుమతి క్రమం నందు జరిగెను అనునది నిర్ణయించు ప్రయోజనార్థము కేంద్ర అమ్మకపు పన్ను చట్టము, 1956 (1956లో 74వ కేంద్ర చట్టము) యొక్క IIవ అధ్యాయపు నిబంధనలు వర్తించును.

## వ్యాఖ్యానము

*ఆంధ్ర ప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టము, 1957 పరిధిలోనికి రాని లావాదేవీలను గురించి ఈ సెక్షను వివరిస్తోంది. ఈ సెక్షను క్రింద పేర్కొన బడిన విశదీకరణము కేంద్ర అమ్మకపు పన్ను చట్టములో IIవ అధ్యాయములో పేర్కొనబడిన 3, 4, 5 సెక్షనులలో చూపబడిన వ్యవహారాలేవీ ఈ చట్టము పరిధిలోనికి రావని వివరిస్తోంది.*

మొత్తము పైసలతో కూడియున్న రూపాయిలోని భాగముతో చేరియున్నపుడు, అపుడు, అట్టి భాగము యాభై పైసలు అంతకు మించి యున్నట్లయితేవ అది రూపాయికి పెంచబడవలెను మరియు అట్టి భాగము యాభై పైసలకన్నా తక్కువగా యున్నట్లయితే అది అలక్ష్యము చేయబడవలెను.

## వ్యాఖ్యానము

*పన్నును లెక్క కట్టేటప్పుడు లేదా వాపసు ఇచ్చేటప్పుడు కొన్ని సందర్భాలలో రూపాయిల్లోనే కాకుండా నయా పైసల్లో కూడా రావచ్చు. అట్లింటి సందర్భాలలో అట్టి పైసలు 50 పైసలు అంతకు మించితే రూపాయిగా పరిగణనలోనికి తీసుకోవాలని, అంతకు తగ్గితే అసలు పరిగణన లోనికి తీసుకొనరాదని ఈ సెక్షను నిర్దేశిస్తోంది.*

**39. రూల్సును చేయుటకు అధికారము :**

(1) రాష్ట్ర ప్రభుత్వము ఈ చట్టపు ప్రయోజనములను నిర్వర్తించేందుకు నోటిఫికేషను ద్వారా రూల్సును చేయవచ్చును.

(2) అట్టి రూల్సు ప్రత్యేకంగా మరియు పైన చెప్పబడిన అధికారం యొక్క సాధారణతకు భంగము కలుగకుండా

(ఎ) ప్రెస్క్రైబ్ అగుటకు ఈ చట్టము చేత నిర్దిష్టముగా అపేక్షితమైన లేక అనుమతించబడిన అన్ని విషయములు గురించి;

(ఎఎ) (i) వర్క్సు కాంట్రాక్టుల నిర్వహణమునందు (సరుకులుగా గాని లేక మరేఇతర రూపంగా గానీ) ప్రమేయము గల సరుకుల రూపమయిన ఆస్తి యొక్క ఏ బదిలీకి,

(ii) హైర్ పర్చేజ్ లేక వాయిదాల ద్వారా చెల్లించే ఏదయినా విధానముపై ఏ సరుకులనైనను ఏ బట్వాడాయైననూ చేయుటకు,

(iii) ఏ ప్రయోజనము కొరకైనను (నిర్దిష్ట కాల వ్యవధి కయినను, కాకున్నను) ఏ సరుకుల నయినను వాడుకునే హక్కును రొక్కము, వాయిదా పడిన చెల్లింపు లేక ఇతర విలువైన మూల్యము కొరకు ఏ బదిలీయైననూ చేయుటకు,

(iv) లక్కీ గిఫ్ట్ స్కీము నందు ప్రమేయము గల ఏదయినా సరుకుల రూపమయిన ఆస్తియొక్క ఏ బదిలీయైననూ చేయుటకు సంబంధించి డీలరు చేత చెల్లింపబడవలసిన మొత్తమును నిర్ణయించే విధానమును గురించి;

(బి) అప్పిలేటు ట్రిబ్యునలు యొక్క సభ్యుల పదవీ కాల పరిమితి, మరియు సర్వీసు యొక్క షరతుల గురించి;

(పి) సరుకుల అమ్మకము లేక కొనుగోలు యందు నిమగ్నమైయున్న వ్యక్తులకు పర్మిట్లు మరియు లైసెన్సులను జారీ చేయుట, అందు నిమిత్తము చెల్లింపవలపిన రుసుములు మరియు ఈ చట్టము యొక్క నిబంధనలను అమలు చేసేందుకు షరతులను విధించుట గురించి

(డి) ఏదైనా అసెస్మెంటు, అప్పీలు లేక రివిజను లందు స్ఫుటముగా నున్న తప్పులను సరిదిద్దుట మరియు అట్టి సరిదిద్దుట ఏ కాలవ్యవధిలోపు చేయవలసినదీ;

(ఇ) ఈ చట్టము క్రింద స్థాపించబడిన చెక్‌పోస్టులు మరియు నిలిపినట్టి అవరోధముల పాలన మరియు వాటి యందు పనిని క్రమబద్ధం చేయుట గురించి;

(ఇఇ) 5-బి సెక్షను యొక్క (1)వ సబ్ - సెక్షను క్రింద సమకూర్చబడవలసిన ఏదయినా డిక్లరేషను యొక్క ఫారము మరియు అందుండవలసిన వివరములు, ఏ అథారిటీ నుండి ఎంత రుసుము చెల్లింపుకు లోబడి ఆ డిక్లరేషను

లేక అందలి భాగమున్నదో ఆ వ్యక్తి యాజమాన్యము నందున్న వ్యాపారమునకు సంబంధించి ఈ చట్టము క్రింద అసెస్‌మెంటు మరియు పన్ను వసూలు గురించి;

(ఆర్) బియ్యముగా మార్చేందుకు ధాన్యము నప్పగించు వ్యక్తి నుండి మిల్లరు చేత తీసుకొనబడవలసిన డిక్లరేషనులు లేక ప్రమాణ ప్రతములు, అట్టి డిక్లరేషనులు లేక ప్రమాణ పత్రముల నిర్వహణ మరియు మిల్లరు చేత సమర్పింపబడవలసిన రిటర్నుల గురించి;

(యస్) ఎవరి నుండి బియ్యము కొనుగోలు చేయబడినవో ఆ టోకు డీలరు నుండి రీటైల్ డీలరు చేత తీసుకొనబడవలసిన డిక్లరేషనులు, ప్రమాణ పత్రములు, ఇన్‌వాయిస్‌లు లేక బిల్లులు, అట్టి డిక్లరేషనులు, ప్రమాణ పత్రములు, ఇన్‌వాయిస్‌లు లేక బిల్లుల నిర్వహణ మరియు రీటైల్ డీలరు చేత సమర్పించబడవలసిన రిటర్నుల గురించి;

(టి) వేరొక టోకు డీలరు, రీటైల్ డీలరు లేక ఇతర వ్యక్తులకు తన చేత బియ్యము యొక్క అమ్మకములకు సంబంధించి టోకు డీలరు చేత ప్రత్యేక లెక్కల నిర్వహణ గురించి;

(యు) జిన్నింగ్ కోసం ప్రత్తిని తెచ్చిన వ్యక్తుల నుండి జిన్నింగ్ మిల్లుల చేత తీసుకొనబడవలసిన డిక్లరేషనులు లేక ప్రమాణ పత్రములు మరియు అట్టి డిక్లరేషనులు లేక ప్రమాణ పత్రముల నిర్వహణ మరియు తీసుకున్న ప్రత్తి యొక్క నిల్వ, బట్వాడా చేయబడిన లింటు మరియు తన వద్ద నున్న మిగులు నిల్వను చూపుతున్న రిజిస్టర్లను గురించి

అట్టి రూల్సు పొందుపరచబడవచ్చును.

(2-ఎ) ఈ చట్టము క్రింద పూర్వ కాలిక ప్రభావము కలిగించునట్లుగ ఏ రూలు నయినను చేయవచ్చును

(3) (1)వ సబ్-సెక్షను లేక (2)వ సబ్-సెక్షను క్రింద ఒక రూలును చేసేటపుడు రాష్ట్ర ప్రభుత్వము అట్టి రూలు యొక్క ఉల్లంఘనకు మొదటి తరగతి మేజిస్ట్రేటు చేత దోష నిరూపణపై రెండు వేల రూపాయల వరకు విస్తరించగల జరిమానాతో శిక్షింపబడుటకు పాత్రుడగునని పొందుపరచ వచ్చును.

(4) ఈ చట్టము క్రింద చేయబడినప్రతి రూలు చేయబడిన వెంటనే రాష్ట్ర శాసన నిర్మాణ విభాగమునకు సంబంధించిన ప్రతి సభ ముందు, అట్టి సభ సమావేశములో నున్నట్లయితే, ఉంచబడవలెను. అట్టి సభ సమావేశములో లేనట్లయితే తరువాత, తరువాత వెంటనే వచ్చే సమావేశము నందు, ఏక సమావేశము లేక రెండు ఉత్తరోత్తర సమావేశములందు 14 రోజుల వ్యవధి పాటు ఉంచబడవలెను. ఏ సమావేశము లేక తదనంతర సమావేశము నందు అది అట్లు ఉంచబడినదో ఆ సమావేశము ముగియుటకు ముందు ఉభయ సభలు రూలు నందు ఏదయినా మార్పు చేయుటకు లేక ఆ రూలును రద్దు చేయుటకు అంగీకరించిన, ఆ రూలు, ఆ మార్పు లేక రద్దు నోటిఫై అయిన తేదీ నుంచి అట్టి మార్పు చెందిన రూపంతోను లేక రద్దు పరచబడినట్లు, సందర్భానుసారంగా ఏదైతే అది, ప్రభావం కలిగియుండును. ఏమైనప్పటికి అట్టి ఏ మార్పు లేక రద్దుయైననూ అంతకు ముందు ఆ రూలు క్రింద చేసిన ఏ చర్య యొక్క మాన్యత కైననూభంగము కల్గించదు.

## వ్యాఖ్యానము

*ఈ చట్టము ప్రయోజనాల్ని సాధించే నిమిత్తము రాష్ట్ర ప్రభుత్వము కొన్ని రూల్సును రూపొందించవచ్చును. ఆంధ్ర ప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను రూల్సన్నీ ఈ సెక్షను ద్వారా దాఖలు పరచబడిన అధికారంతోనే రూపొందించబడ్డాయి. ప్రతి రూలును శాసన సభ ముందుంచడం ఆవశ్యకమని (4)వ సబ్ సెక్షను చెప్తోంది. శాసన సభ అట్టి రూలును త్రోసివేయటానికి, మార్పు చేయటానికి కూడా వీలుంది. అయితే- అట్టి త్రోసివేత లేక సవరణలు అంతకుముందు ఆ రూలు క్రింద తీసుకొన్న చర్యల మాన్యతకు భంగం కల్గించవు.*

చేయబడిన కార్యము లేక ఏదైనా నియామకం, నోటిఫికేషను, నోటీసు, ఉత్తర్వు, రూలు, ఫారము, రెగ్యులేషను, ధృవ పత్రము, లైసెన్సు లేక పర్మిట్లతో సహా తీసుకొనబడిన ఏ చర్య అయిననూ ఈ చట్టము క్రింద లేక చేత దత్తము చేయబడిన అధికారములను, అట్టి కార్యము చేయబడిన లేక చర్య తీసుకొనబడిన తేదీన ఈ చట్టము అమలులోనున్నట్లు, వినియోగించుచూ చేయబడినట్లు లేక తీసుకొనబడినట్లు భావింపబడును, మరియు ఈ చట్టము ప్రారంభమయ్యే నాటికి బాకీ పడిన పన్ను మరియు ఇతర మొత్తముల బకాయిలన్నియు అవి ఈ చట్టము క్రిందే ప్రాప్తించబడినట్లు వసూలు చేయబడవచ్చును.

(2) (1) వ సబ్ సెక్షను నందు ఏ మున్నప్పటికినీ, సదరు చట్టముల క్రింద లేక సెక్షను క్రింద అధికారి లేక అథారిటీకి ఏదయినా దరఖాస్తు, అప్పీలు, రివిజను లేక ఇతర ప్రొసీడింగు చేయబడి లేక దాఖలు చేయబడి మరియు ఈ చట్టము యొక్క ప్రారంభమప్పుడు పెండింగులో నున్న, అట్టి ప్రారంభము తరువాత, అట్టి దరఖాస్తు, అప్పీలు, రివిజను లేక ఇతర ప్రొసీడింగును అట్టి దరఖాస్తు అప్పీలు, రివిజను లేక ఇతర ప్రొసీడింగు చేయబడిన లేక దాఖలు చేయబడిన తేదీన ఈ చట్టము అమలులో నున్నట్లయితే దాని క్రింద అనుమతించుటకు అధికార పరిధి కలిగియుండెడి అధికారి లేక అథారిటీకి బదిలీ చేయబడును మరియు వారి చేత డిస్పోజ్ చేయబడును.

## వ్యాఖ్యానము

*ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టము, 1957 అమలులోనికి రావటం ఫలితంగా ఈ క్రింది చట్టాలన్నీ రద్దు పరచబడ్డాయి.*

*1. మద్రాసు సాధారణ అమ్మకపు పన్ను చట్టము, 1939 (1939లో IXవ మద్రాసు చట్టము)*

*2. హైదరాబాదు సాధారణ అమ్మకపు పన్ను చట్టము, 1950 ) 1950 XIV లో హైద్రాబాదు చట్టము)*

*3. మద్రాసు పొగాకు (రిజిస్ట్రేషను మరియు అమ్మకపు పన్ను విధింపు) చట్టము, 1953 (1953లో మద్రాసు చట్టము)*

*4. ఆంధ్ర సాధారణ కొనుగోలు పన్ను చట్టము, 1956 (1956లో XIIIవ ఆంధ్ర చట్టము)*

*5. మద్రాసు మద్యనిషేధ చట్టము, 1937 (1937లో Xవ మద్రాసు చట్టము) యొక్క 21-వ సెక్షను.*

*అయితే- (1)వ సబ్-సెక్షను క్రింద యున్న షరతువల్ల ఈ క్రింది ప్రయోజనాలు ఉద్దేశింపబడ్డాయి.*

*1) రద్దు పరచబడిన చట్టాల క్రింద నున్న విధులు, బాధ్యతలు, ఆ.ప్ర.సా.అ.ప. చట్టము క్రిందే సంక్రమింపబడినట్లుగా భావింపబడి, అట్టి విధుల్ని, బాధ్యతలను అమలు చేయాల్సిందిగా డీలరును కోరడానికి వెసులు బాటు ఏర్పడింది.*

*2) రద్దు పరచబడిన చట్టాల క్రింద తీసుకొనే ఏ చర్యలనైనా ఆ.ప్ర.సా.అ.ప. చట్టము క్రింద అధికార వర్గము చేపట్టితే అట్టి చర్యలు సదరు రద్దయిన చట్టాల క్రిందే తీసుకోబడినట్లు భావించటానికి వీలవుతుంది.*

*3) రద్దయిన చట్టాల క్రింద చెల్లించవలసిన బకాయిలను ఆ.ప్ర.సా.అ.ప. చట్టము క్రింద బకాయిలుగా భావించి వసూలు చేయుటకు వీలవుతుంది.*

### 42. ఇబ్బందుల్ని తొలగించేందుకు గల అధికారము :

(1) ఈ చట్టము యొక్క ప్రారంభానికి తక్షణ పూర్వం అమలులో నున్న చట్టము లందున్న అనుగుణమయిన, నిబంధనల నుంచి ఈ చట్టము యొక్క నిబంధనలకు మారే పరిణామ దశ కారణంగా సదరు నిబంధనల్ని అమలు చేసేందుకు ఏదయినా ఇబ్బంది తలెత్తితే ఆ ఇబ్బందిని తొలగించుటకు అవసరమయినట్లు లేదా ప్రయోజనావశ్యకమని తమకు

*1) చట్టపు నిబంధనలకు అనుగుణంగా యుండాలి.*

*2) చట్టపు పాలనకు యోగ్యమైనవిగా యుండాలి (ప్రాపర్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ యాక్ట్)*

*3) వాణిజ్య పన్నుల కమీషనరు చేత జారీ చేయబడిన ఉత్తర్వులు, సూచనలు, ఆదేశాలు, అప్పిలేటు అధికార వర్గం అప్పిలేటు విధుల్ని నిర్వర్తిస్తున్నప్పుడు తమ విచక్షణాధికారం వినియోగించే సందర్భాలలో అట్టి విచక్షణాధికారానికి భంగం కలిగించేవిగా యుండరాదు.*

*ఇది 13-9-88 తేదీ నుంచి 1988 సంవత్సరపు 29వ చట్టం ద్వారా అమలు లోనికి వచ్చింది.*

## 43. వెల్లడి చేయుటపై జరిమానా నిబంధనలు అమలు చేయకపోవుట :

ఈ చట్టము నందు ఏమున్నప్పటికినీ ఒక డీలరు

(ఎ) వాణిజ్య పన్నుల శాఖ యొక్క ఏ అధికారి చేతనయినను కనుగొన బడుటకు పూర్వమే తన వ్యాపారము యొక్క యదార్థమైన మరియు మొత్తము టర్నోవరు వివరముల గోప్యతను స్వచ్ఛందంగా మరియు సద్భావ పూర్వకంగా 1987 జనవరి 1వ తేదీ మరియు 1987 మార్చి 31 వ తేదీల మధ్య తెలియ చేసినట్లయితే,

(బి) మొత్తము టర్నోవరుపై 1987 మార్చి 31 వ తేదీన లేక ముందుకాని పన్నును చెల్లించినట్లయితే, మరియు

(సి) అతని టర్నోవరు అసెస్‌మెంటుకు సంబంధించిన ఏదైనా ఉన్నట్లయితే, దర్యాప్తులో సహకరించినప్పుడు ఈ చట్టము క్రింద రిజిస్టరు చేయునట్టి, అసెస్‌మెంటు మరియు రివిజను చేయునట్టి అథారిటీలు 1986-87 అసెస్‌మెంటు సంవత్సరంతో సహా ఏ అసెస్‌మెంటు సంవత్సరము సంబంధంగా నైననూ ఈ చట్టము క్రింద జరిమానా విధింపుకు ఏ ప్రొసీడింగును ప్రారంభించరాదు లేదా విధింపదగిన ఏ జరిమానాను విధించరాదు.

అయితే- డీలరు చేత టర్నోవరు వెల్లడి మరియు దానిపై బాకీపడిన పన్ను చెల్లింపు, తన రిజిస్టర్డ్ కార్యాలయమును కలిగి ఉన్న ప్రదేశంపై అధికార పరిధి గల మరియు అసెసీ కాని డీలరు విషయము నందు డీలరు సాధారణంగా నివసించు ప్రదేశంపై అధికార పరిధి గల వాణిజ్య పన్నుల అదికారి వారికి చేయబడవలెను.



### వ్యాఖ్యానము

ఆదాయపు పన్ను చట్టంలో మాదిరిగా టర్నోవరు అణచివేతను డీలర్లే ముందుకు వచ్చి బహిరంగ పరిచేందుకు వీలుగా ఈ సెక్షనును అదనంగా 1987లో రెండవ సవరణ చట్టంగా ప్రవేశ పెట్టారు. ఈ సౌకర్యము తాత్కాలికంగా మాత్రమే ఏర్పాటు చేయబడింది.

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 9. | సిగరెట్ కేసులు మరియు లైటర్లు (1009) | రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద | రూపాయి నందు 16 పైసలు ★ 10 |
| 10. | టేప్‌రికార్డర్లు, డిక్టాఫోన్లు మరియు ఇతర సౌండ్ రికార్డింగ్ సామాగ్రి మరియు వాటి యొక్క విడి భాగములు, మాగ్నెటిక్ టేపులు మరియు క్యాసెట్ నందు ఉంచబడి లేక మరో విధంగా గాని, సౌండ్ రికార్డింగ్ కొరకు వాడబడు ఇతర మెటీరియల్ మరియు ముందుగా రికార్డు చేయబడిన టేప్ క్యాసెట్లతో సహా (1010) | -డిటో- | -డిటో--16 ★ 10 |
| 11. | ధ్వని ప్రసారక సామాగ్రి - టెలిఫోన్లు మరియు లౌడ్ స్పీకర్లు మరియు వాటి యొక్క విడిభాగములతో సహా (1011) | -డిటో- | -డిటో--16 ★ 10 |
| 12. | టైప్ రైటర్లు, టాబ్యులేటింగ్ మెషిన్లు, కాలిక్యులేటింగ్ మెషిన్లు, టెలిప్రింటర్లు మరియు టెలిప్రింటింగ్ మెషిన్లు మరియు డూప్లికేటింగ్ మెషిన్లు మరియు టైప్‌రైటింగ్ రిబ్బనులతో సహా వాటి యొక్క భాగములు మరియు యాక్సెసరీలు (1012) | -డిటో- | -డిటో--16 ★ 10 |
| 13. | బైనాక్యులర్లు, టెలిస్కోపులు మరియు ఒపెరా గ్లాసులు మరియు వాటి యొక్క భాగములు (1013) | - డిటో - | -డిటో- 16 |
| 14. | గ్రామఫోనులు మరియు వానియొక్క కాంపోనెంటు పార్టులు మరియు రికార్డులు - గ్రామఫోను రికార్డులు మరియు గ్రామఫోను నీడిల్స్‌తో సహా (1014) | -డిటో- | -డిటో--16 ★ 10 |
| 15. | టైర్లు మరియు ట్యూబులు మరియు అన్యత్రా నిర్దిష్టముగా ఉదహరింప బడిన దాని కన్నా భిన్నమైన రబ్బరు పదార్థముతో చేయబడి నట్టివై వాటితో వాడబడే యాక్సెసరీలు (1015) (14-2-1989 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు 17 పైసలు) | -డిటో- | -డిటో--16 |
| 16. | తొలగించబడినది. (6వ షెడ్యూలులో 5వ అంశముగా చేర్చబడినది) | | |
| 17. | సైకిళ్ళు - టైర్లు మరియు ట్యూబులతో సహా వాటి భాగములు మరియు యాక్సెసరీలు మరియు రబ్బరు లేక ఇతర పదార్థముతో చేయబడినట్టివై వాటితో వాడబడే యాక్సెసరీలు (1017) (21-12-1987 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు 6 పైసలు) | -డిటో- | -డిటో- 10 |
| 18. | సిమెంటు (1018) | -డిటో- | -డిటో- 16 ★★ 10 |
| 19. | గోనెసంచులు, సీసాలు మరియు ప్లాస్టిక్ కంటెయినర్ల కన్నా భిన్నమైన కంటెయినర్లు (1019) | -డిటో- | -డిటో - 9 ★★ 5 |

★ 1.8.86 నుండి 31.3.95 వరకు రూపాయి నందు - పైసలు
★★ 8.7.1983 నుండి 31.3.95 వరకు రూపాయి నందు - పైసలు

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 32. | ఇటుకలు, టైల్సు, సిమెంటు ఫ్లోరింగ్‌స్టోనులు, ఇసుక మరియు బౌల్డర్లు మరియు చిప్స్‌తో సహా గ్రానైట్ రాళ్ళు (1032) (1-7-1985 నుండి 31-3-1995 వరకు రూపాయినందు 5పైసలు) | రాష్ట్రమునందలి అంతిమ అమ్మకపు స్థానము వద్ద | -డిటో- 9 |
| 33. | బ్లెండ్ చేయబడిన కాఫీ పౌడర్ మినహా కాఫీ విత్తనములతో సహా కాఫీ, వేయించబడిన విత్తనాలు మరియు కాఫీ పౌడరు | రాష్ట్రమునందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద | -డిటో- 10 ☆ 6 |
| 34. | చికోరి (1034) | -డిటో- | -డిటో- 10 ☆☆ 6 |
| 34-ఎ. | బ్లెండు చేయబడినట్టి లేక ఫ్రెంచి కాఫీ (వాటి యొక్క కాంపోనెంటులకు సంబంధించిన టర్నోవరుపై అనగా ఈ చట్టము క్రింద ఇంతకు ముందే పన్ను చెల్లింపబడనట్టి కాఫీ మరియు చికోరీ (1146) | - డిటో - | - డిటో- 10 ☆ 6 |
| 35. | పింగాణీ సామాగ్రి మరియు కట్లరీ (1035) | -డిటో- | -డిటో- 10 ☆ 6 |
| 36. | అలంకరణ సామాగ్రి మరియు ప్రసాధనపు తయారీలు, సెంట్లు, పరిమళాలు మరియు ఫేస్ పౌడర్లు, టాల్కమ్ పౌడర్లు, హెయిర్ టానిక్కులు, హెయిర్ ఆయిల్స్, హెయిర్ లోషన్లు, ఫేస్ క్రీములు మరియు స్నోలు, ఫోమేడ్స్, డిప్లియేటరీలు, టూత్‌పౌడరు, టూత్‌పేస్టు, టూత్‌బ్రష్‌లు మరియు షేవింగ్ క్రీములతో సహా (1036) (4-9-1993 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు 12 పైసలు) | -డిటో- | -డిటో- 20 |
| 37. | డ్రగ్స్ మరియు మెడిసిన్‌లు (1037) (డ్రగ్స్ మరియుకాస్మోటిక్స్ చట్టము, 1940 (1940లో 23వ కేంద్ర చట్టము) యొక్క 3వ సెక్షను నందు నిర్వచించబడిన పేటెంటు లేదా ప్రొప్రయిటరీ అయినప్పటికినీ) (1-4-1994 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు 5 పైసలు) | -డిటో- | -డిటో- 9 |
| 38. | ఎలెక్ట్రానిక్ సిస్టములు, పరికరములు, సామాగ్రి, అప్లయన్సెస్-ఎలక్ట్రానిక్ క్యాష్‌రిజిష్టరింగ్, ఇండెక్సింగ్, కార్డ్ పంచింగ్, ఫ్రాంకింగ్ మరియు అడ్రసింగ్ మెషీన్లు, కంప్యూటర్స్ అఫ్ ఎనలాగ్ మరియు డిజిటల్ వెరైటీలు, ఒన్ రికార్డ్ యూనిట్స్, ఆసిలోస్కోపులు మరియు ఇతర ఎలక్ట్రానిక్ పరికరాలు మరియు మెటీరియల్ మరియు వాటి యొక్క భాగములు మరియు యాక్సెసరీలు (1038) (1-8-1986 నుండి 31-3-1995 వరకు రూపాయినందు 10పైసలు) | - డిటో- | -డిటో- 16 |

☆ 1-3-1974 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు

☆☆ 1-9--1976 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 51. | తొలగించబడినది. ( 6వ షెడ్యూలు యొక్క 4-ఎ అంశమును చూడుము) | | |
| 52. | ఎక్స్-రే ఉపకరణములు, ఫిల్ములు, ప్లేట్లు మరియు వానితో వాడుట కొరకు అవసరమైన ఇతర సామాగ్రి మరియు వాటి యొక్క యాక్సెసరీలు మరియు విడి భాగములు(1052) | రాష్ట్రమునందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద | రూపాయినందు 10 పైసలు ★ 6 |
| 53. | పింగాణి సామాగ్రి కన్నా భిన్నమైన పోర్సలీన్ వేర్ మరియు చైనా వేర్ (1053) | -డిటో- | -డిటో- 15 ★★ 9 |
| 54. | తొలగించబడినది.(6వ షెడ్యూలు యొక్క 10వ అంశముగా చేర్చబడినది) | | |
| 55. | మొలాసిస్ (1055) | -డిటో- | -డిటో-50 ★ 25 |
| 56. | పవర్ ఆల్కహాల్; ఇథైల్ ఆల్కహాల్, రెక్టిఫైడ్ స్పిరిట్, డీనేచర్డ్ స్పిరిట్ (1056) | రాష్ట్రమునందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద | రూపాయినందు 10 పైసలు ★ 6 |
| 57. | తొలగించబడినది. | | |
| 58. | బియ్యము యొక్క తవుడు మరియు ఊక (1058) | -డిటో- | -డిటో- 4 ★★★ 1 |
| 59. | నూనె తీసిన బియ్యపు తవుడు (1059) | -డిటో- | -డిటో- 8 ★★★ 1 |
| 60. | (ఎ) మైదా, పిండి మరియు రవ్వ (బి) గోదుమ తవుడు (1060) | -డిటో- | -డిటో - 4 |
| 61. | ముడి ఉన్ని, మేకలు మరియు గొఱ్ఱెల బొచ్చు మరియు జంతువుల శరీరములపై తత్ సదృశమైన పీచు వంటి పెరుగుదల (1061) | -డిటో- | -డిటో- 8 ★★ 4 |
| 62. | జంతువుల ఎముకలు మరియు కొమ్ములు (1062) | -డిటో- | -డిటో- 8 ★★ 4 |
| 63. | తొలగించబడినది (6వ షెడ్యూలు యొక్క 11వ అంశముగా చేర్చబడినది) | | |
| 64. | వంట చెరుకు (1063) (1-8-1963 నుండి 31-3-1995 వరకు రూపాయినందు 3పైసలు) | -డిటో- | -డిటో-8 |
| 65. | చార్‌కోల్ (1065) | -డిటో- | -డిటో- 8 ★★ 3 |
| 66. | తొలగించబడినది. | | |

★ 1-3-1974 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు

★★ 8-7-1983 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు

★★★ 15-2-1989 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| 81. | తొలగించబడినది. (6వ షెడ్యూలు యొక్క 5-ఎ అంశముగా చేర్చబడినది) | | ★★★★ 2 |
| 82. | విద్యుత్ లేక హైడ్రాలిక్ లిఫ్టులు (1082) | రాష్ట్రమునందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద | రూపాయి నందు 16 పైసలు ★ 10 |
| 83. | i) విద్యుత్ ii) డీజిల్ iii) పెట్రోలు iv) ఫర్నేసు ఆయిల్ v) కిరోసిన్ vi) చార్‌కోల్‌తో సహా కోల్ vii) ఏ ఇతర శక్తి లేక ఇంధనంతో ప్రొపెల్ చేయబడు లేక ఆపరేట్ చేయబడుఅన్నిరకముల మెషినరీ. అట్టి మెషినరీ యొక్క విడి భాగములు మరియు యాక్సెసరీలతో సహా (అనగా నిర్దిష్టంగా పేర్కొనబడిన వాటి కన్నా భిన్నమైనవి మాత్రమే) (1083) | -డిటో- | -డిటో- 10 ★★ 6 |
| 83.ఎ. | గ్రైండింగ్ వీల్స్‌తో సహా మెషిన్ టూల్స్ 1.10.1986 నుండి 1.4.1995 వరకు రూపాయి నందు 6 పైసలు. | -డిటో- | -డిటో- 10 |
| 83.బి. | మౌంటెడ్ రిగ్స్ మరియు అట్టి రిగ్స్ మౌంటు చేయబడు ఎయిర్ కంప్రెసర్లు మరియు ఛాసిస్‌తో సహా వాటి యొక్క భాగములు మరియు యాక్సెసరీలు (27.11..1993 నుండి 31.3.1995 వరకు రపాయినందు 6 పైసలు) | -డిటో- | -డిటో-10 |
| 84. | విమానములు మరియు రైల్‌కోచ్‌లు మరియు వాని భాగములు (1084) | -డిటో- | -డిటో-16 ★ 10 |
| 85. | బంగారపు పోగు (జరీ) (1085) | -డిటో- | -డిటో-8 ★★★ 4 |
| 86. | న్యూస్ ప్రింట్ (1086) | -డిటో- | -డిటో-8 ★★★ 4 |
| 87. | తొలగించబడినది.(6వ షెడ్యూలు యొక్క 5-బి అంశముగా చేర్చబడినది) | | ★★★★ 2 |
| 88. | తొలగించబడినది. | | |
| 89. | బొచ్చుతో కూడిన చర్మములు మరియు వాటి యొక్క వస్తువులు (1089) | -డిటో- | -డిటో-16 ★★★ 10 |
| 90. | పాదరక్షల కన్నా భిన్నమైన తోలు సరుకులు (1090) | -డిటో- | -డిటో-12 ★★ 7 |
| 90.ఎ | క్రీడల సరుకులు, ఇండోర్ లేక ఔట్ డోర్ ఆటలు లేక అథ్లెటిక్స్ నందు వాడబడు నట్టి సరుకులతో సహా, ఏ పదార్థముతో చేయబడినవైననూ, | -డిటో- | -డిటో-10 ★ 6 |

★ 1-8-1986 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు
★★ 8-7-1983 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు
★★★ 1-3-1974 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు
★★★★ 3-7-1993 నుండి 31-3-1995 వరకు రూపాయి నందు - పైసలు

| (1) | (2) | (3) |
|---|---|---|
| | కృత్రిమమైన రెజిన్స్‌తో ఎగ్లోమరేట్ అయిన ఇతర లిగ్నియస్ వ్యర్థము లేదా షీట్సు, బ్లాక్స్, బోర్డ్స్ రూపములో గాని మరే విధంగానైననూ యున్నట్టి ఇతర సేంద్రియ బైండింగు పదార్థములుగా ఉంటూ సహజ లేక కృత్రిమ లేక పునర్మితమైన వుడ్‌తో బాండ్ చేయబడిననూ లేక చేయబడకున్నను సెల్యులర్ వుడ్ ప్యానెల్స్, వుడ్‌పల్ప్ యొక్క లేక వెజిటబుల్ ఫైబర్ యొక్క బిల్డింగ్ బోర్డులు మరియు ఫ్లష్ డోర్లు చేరియుండును. | 1114 |
| 115. | ప్రెషర్ స్టౌలు, గ్యాస్ ఒవెన్స్, బ్లోలాంప్స్‌తో సహా స్టౌలు మరియు వాటి యొక్క భాగములు మరియు యాక్సెసరీలు | 1115 |
| 116. | పెట్రొమాక్సు లైట్ల వంటి ప్రెషర్ ల్యాంపులు మరియు వాటి యొక్క భాగములు, యాక్సెసరీలు | 1116 |
| 117. | కేకులు, బిస్కట్లు, పేస్ట్రీలు, టోఫీలు చాక్‌లెట్లు మరియు కన్‌ఫెక్షనరీ | 1117 |
| 118. | బర్షేన్, కాల్-గ్యాస్, ఇండేన్ మరియు ఎస్సో వంటి ఫ్యూయల్ గ్యాస్ మరియు కంప్రెస్ చేయబడిన, లిక్విడ్‌పై చేయబడిన లేదా సాలిడ్‌పై చేయబడిన రూపము లందున్న ఇతర గ్యాసులు | 1118 |
| 119. | ఏనుగు దంతములు మరియు గంధపు చెక్కతో తయారు చేయబడిన వస్తువులు | 1119 |
| 120. | సంగీత పరికరములు | 1120 |
| 121. | సీలు చేయబడిన కంటెయినర్ల యందు టిన్ చేయబడిన, క్యాన్ చేయబడిన లేక ప్రిజర్వు చేయబడిన ఆహారము | 1121 |
| 122. | కర్పూరము | 1122 |
| 123. | గాజు మరియు సామాగ్రి<br>(i) షీటు గ్లాస్ మరియు ప్లేట్ గ్లాస్<br>(ii) అద్దములు<br>(iii) ప్రయోగశాలలో వాడే గాజు సామాగ్రి<br>(iv) గాజు షెల్స్, గాజు గ్లోబ్స్ మరియు దీపములు మరియు లాంతరుల చిమ్నీలు<br>(v) మేజాబల్ల సామాగ్రితో సహా ఇతర గాజు సామాగ్రి | 1123 |
| 124. | శాక్రిన్ | 1124 |
| 125. | ప్రెషర్ కుక్కర్లు | 1125 |
| 126. | ఎలక్ట్రిక్ మోటార్లు, ఆయిల్ యింజన్లు, మోనోబ్లాక్ పంపుసెట్లు మరియు వాటి యొక్క విడి భాగములు మరియు యాక్సెసరీలు | 1126 |
| 127. | ముడి సిల్కు | 1127 |
| 128. | శాకతైలాలు (అన్యత్రా నిర్దిష్టముగా పేర్కొనబడిన వాటికన్నా భిన్నమైన) నువ్వులనూనె, కుసుంబానూనె, ప్రొద్దు తిరుగుడు పువ్వు నూనె, సోయాబీన్ నూనె, ఆవనూనె, కుసుమ నూనె, పొగాకు గింజలనూనె, ఆముదపు నూనె, శుద్ధిచేసిన ప్రత్తిగింజల నూనె, కొబ్బరి నూనెతో సహా | 1128 |
| 129. | వండబడిన లేదా బేక్ చేయబడిన ఆహారపు వస్తువులు | 1129 |

| (1) | (2) | (3) |
|---|---|---|
| 153. | మర మరాలు, పేలాలు మరియు అటుకుల వంటి ధాన్యము మరియు బియ్యము ఉత్పత్తులు | 1160 |
| 154. | వెన్న మరియు నెయ్యి - కంపెనీల చట్టము, 1956 లేక ఆంధ్రప్రదేశ్ సహకార సంస్థల చట్టము, 1964 క్రింద రిజిష్టరు అయిన సంస్థ చేత అమ్మబడినపుడు | 1161 |
| 155. | మూడవ షెడ్యూలు యొక్క 17, 18, 19 మరియు 20వ అంశముల క్రింద చేరినట్టి వాని కన్నా భిన్నమైన చిరు ధాన్యాల (పొట్టు తొలగించబడిన చిరుధాన్యాలతో సహా) | 1162 |
| 156. | వరిగలు లేక వరిగ బియ్యము లేదా కొర్రలు లేక కొర్ర బియ్యము | 1163 |
| 157. | గోనె సంచులు | 1164 |
| 158. | వక్కపొడి | |
| | (ఎ) క్రింది (బి) అంశముతో కవరు చేయబడని | |
| | (బి) ఈ చట్టము క్రింద పన్ను విధింపునకు గురియైన వక్కల నుండి పొందినది | 1165 |
| 159. | ఊరగాయలు - సీల్డ్ లేక కాప్స్యూల్డ్ లేక కార్క్ బాటిల్స్, జార్స్, టిన్స్ లేక ఇతర కంటెయినర్ల యందు అమ్మబడినప్పుడు | 1166 |
| 160. | శానిటరీ టవళ్ళు, శానిటరీ నాప్ కిన్స్ మరియు బెల్ట్ లెస్‌నాప్ కిన్స్ మరియు ట్యాంపూన్స్ | 1167 |
| 161. | పోలియస్టర్ విస్కోస్ యార్న్ | 1168 |
| 162. | జున్ను | 1169 |
| 163. | అన్ని రకముల సూట్ కేసులు, బ్రీఫ్ కేసులు మరియు వ్యానిటి బ్యాగ్‌లు | 1170 |
| 164. | సుగర్ - క్యాండి | 1171 |
| 165. | నూలు బరువు నందు $16^2/_3$ శాతము మించని నాన్ - సెల్యూలోజిక్ ఫైబర్ పదార్థము (అనగా కాటన్-విస్కోస్ లేక కాటన్/పోలిసోనిక్‌తో ) కలుపబడిన నూలు | 1172 |
| 166. | పీచు ఉత్పత్తులు | 1173 |
| 167. | సగ్గు బియ్యము | 1174 |
| 168. | అగ్గి పుల్లలు | 1175 |
| 169. | జీడిపప్పు | 1176 |
| 170. | చింతపండు, రాష్ట్రము వెలుపలి నుండి పొందినపుడు | 1177 |
| 171. | చింతపిక్క, రాష్ట్రము వెలుపలి నుండి పొందినపుడు | 1178 |
| 172. | లెడ్, నికెల్, జింక్, మెగ్నీషియమ్ మరియు టిన్ | 1179 |
| 173. | అగర్‌బత్తి | 1180 |
| 174. | పి.వి.సి. క్లాత్, వాటర్ ప్రూఫ్ క్లాత్, టార్పాలిన్ మరియు రెక్సిన్ | 1181 |
| 175. | ఆస్పాల్ట్ | 1182 |
| 176. | శ్లాక్‌మైనము, పారఫిన్ మైనము, మ్యాచ్ మైనము మరియు యమ్. సి. మైనము | 1183 |
| 177. | మెథోనల్ మిశ్రమము | 1184 |

| (1) | (2) | (3) |
|---|---|---|
| | (13) మౌలిక రూపములందు సహజ పోలిమర్స్ (ఉదాహరణకు ఎలిజినిక్ యాసిడ్) మరియు అభివృద్ధి చేయబడిన సహజ పోలిమర్స్ (ఉదాహరణకు హార్డెన్డ్ ప్రోటీన్స్ సహజ రబ్బరు యొక్క రసాయనిక అవకలజములు) డెక్స్‌ట్రాన్ | |
| | (14) వేస్ట్, పెరింగ్స్ మరియు ప్లాస్టిక్స్ యొక్క స్క్రాప్‌తో సహా మౌలిక రూపములందున్న పైశీర్షికల సంఖ్యలు 1 నుండి 13 యొక్క పోలిమర్స్‌పై ఆధారపడిన అయాన్ ఎక్స్చేంజర్స్ | 1192 |
| 187. | ప్లాస్టిక్ వస్తువులు (హెచ్.డి.పి.ఇ. ఊవెన్ శాక్స్ మినహా) మరియు 1) మోనోఫిలమెంట్ రాడ్స్, ప్లాస్టిక్కులస్టిక్స్ మరియు ప్రొఫైల్ షేప్స్ 2) ప్లాస్టిక్కుల ట్యూబులు, పైపులు మరియు హోస్‌లు మరియు వాటికి సంబంధించిన ఫిట్టింగులు (ఉదాహరణకు జాయింట్లు, ఎల్బొస్, ఫ్లాంజెస్ 3) రోల్సు రూపముగా లేక టైల్స్ రూపముగా నున్న ప్లాస్టిక్కుల ఫ్లోర్ కవరింగ్స్. 4) ప్లేట్లు, బ్లాకులు (షీట్లు, ఫిల్మ్ ఫాయిల్, టేపు, స్ట్రిప్ మరియు ఇతర ఫ్లాట్ రూపములతో సహా) | 1193 |
| 188. | హైడెన్సిటీ పోలిథిలిన్ పోలిప్రోపిలిన్ (హెచ్.డి.పి.ఇ./పి.పి.) ఊవెన్ శాక్స్ | 1194 |
| 189. | గ్లాస్ ఫైబర్ | 1195 |
| 190. | ట్రాక్టరుతో లాగబడు పరికరములు | 1196 |
| 191 | అథెసివ్స్, అథెసివ్ టేప్స్, సెల్లోఫిన్ టేప్, గ్లూ | 1197 |

## రెండవ షెడ్యూలు

| | | |
|---|---|---|
| 1. | మాంగనీసు (ముడి మాంగనీసుతో సహా) | 2001 |
| 2. | ముడి ఇనుము | 2002 |
| 3. | పసుపు | 2003 |
| 4. | తొలగించబడినది | |
| 5. | వెన్న మరియు నెయ్యి - కంపెనీల చట్టము, 1956 క్రింద గాని లేదా ఆంధ్రప్రదేశ్ సహకార - సంఘాల చట్టము, 1964 క్రింద గాని రిజిస్టరు అయినట్టి సంస్థ కన్నా భిన్నమైన సంస్థ నుంచి కొనుగోలు చేయబడినప్పుడు | 2005 |
| 6. | అభ్రకము | 2006 |
| 7. | తాటి పీచు మరియు బొంగులు | 2007 |
| 8. | తొలగించబడినది | |
| 9. | ధనియాలు | 2009 |
| 10. | మూడవ షెడ్యూలు యందు 5వ అంశము క్రిందనున్న దాని కన్నభిన్నమైన కొబ్బరికాయలు | 2010 |
| 11. | తొలగించబడినది. | |

| (1) | (2) | (3) |
|---|---|---|
| | (బి) పదును చేయబడిన తోళ్ళు మరియు చర్మములు (ఏవయితే పదును చేయబడని తోళ్ళు మరియు చర్మములుగా పన్నుకు లోబడవో అవి) | 3009 |
| 10. | నూలు దారము, కాని నూలు వ్యర్థముతో సహాకాదు | 3010 |
| 11. | తొలగించబడినది | |
| 12. | తొలగించబడినది | |
| 13. | ముడిచముురు | 3013 |
| 14. | అపరాలు అనగా | |
| | (i) మూంగ్ లేక పెసర | |
| | (ii) ఉరద్ లేక మినుము | 3014 |
| 15. | అపరాలు అనగా | |
| | (i) గ్రామ్ లేక శనగలు | |
| | (ii) టర్ లేక కంది | |
| | (iii) చిరు శనగ | |
| | (iv) మోత్ | |
| | (v) లాఖ్ లేక ఖెసరి | 3015 |
| 16. | గోధుమ | 3016 |
| 17. | జొన్న లేక మిలో | 3017 |
| 18. | మొక్కజొన్న | 3018 |
| 19. | రాగులు | 3019 |
| 20 | తృణ ధాన్యములు, అనగా | |
| | (i) సజ్జలు | |
| | (ii) అరికెలు | |
| | (iii) కుట్కి | |
| | (iv) బార్లీ | 3020 |
| 21. | వరిధాన్యము | 3021 |
| 22. | బియ్యము | 3022 |

## నాలుగవ షెడ్యూలు

| | | |
|---|---|---|
| 1. | ఉప్పు | 4001 |
| 2. | విద్యుచ్ఛక్తి | 4002 |
| 3. | తొలగించబడినది | |
| 4. | కల్లు, నీరా మరియ సారాయి | 4004 |

| (1) | (2) | (3) |
|---|---|---|
| | iii) ఎలక్ట్రికల్ ఫ్యానులు, లైటింగ్ బల్బులు, టార్చిలు, ఫ్లోర్‌సెంట్ ట్యూబులు మరియు చౌక్‌లు మరియు స్టార్టర్లు వంటి ఇతర ఫిట్టింగులు మరియు వాటి యొక్క ఇతర భాగములు మరియు యాక్సెసరీలు; | |
| | iv) ఎలక్ట్రికల్ గ్రైండర్లు, మిక్సర్లు, బ్లెండర్లు, హెయిర్-డ్రయర్లు, షేవర్లు, వాషింగ్ మెషీన్లు, హీటర్లు, కుకింగ్ రేంజెస్, బాయిలర్లు, ఓవెన్లు, గీజర్లు, జనరేటర్లు, ట్రాన్స్ ఫార్మర్లు మరియు వాటి యొక్క ఇతర భాగములు మరియు యాక్సెసరీలు; | |
| 7. | షీట్లు, కుషన్లు, మేట్రిసెస్, పిల్లోలు మరియు రబ్బరు, ప్లాస్టిక్ ఫోమ్, సింథటిక్ ఫోమ్ లేక ఇతర సదృశ పదార్థము చేత తయారు చేయబడిన ఇతర వస్తువులు; | 6010 |
| 8. | పెయింట్స్, కలర్స్, డ్రైడి స్టెంపర్స్, వార్నీషులు మరియు బ్లాంకులు సెల్యులోజ్, లేకర్స్, పాలిష్ పిగ్మెంట్సు, ఇండిగో ఎనామిల్సు, సిమెంటు - బేసడ్ వాటర్ పెయింట్స్, ఆయిల్ బౌండ్ డిస్టెంపర్, వాటర్ పిగ్మెంట్స్, ఫినిషెస్‌ఫర్ లెదర్ లేక ప్లాస్టిక్ ఎమల్షన్ పెయింట్స్, టర్పెంటైన్ ఆయిల్, బేల్ ఆయిల్, వైట్ ఆయిల్ మరియు టిన్నర్లు మరియు లిథోగ్రఫిక్ ప్రింటింగ్ మరియు డూప్లికేటింగ్ ఇంక్స్ కూడా | 6011 |
| 9 | డైసు మరియు కెమికల్స్ | 6012 |
| 10. | స్టెయిన్ లెస్ స్టీలు యొక్క వస్తువలు | 6013 |
| 11. | కలప | 6014 |
| 11-ఎ | బీములు, రీఫర్లు మరియు ప్లాంకులు వంటి సైజులుగా కత్తిరింపబడిన దుంగలు | 6015 |
| 12. | రబ్బరు ఉత్పత్తులు (అన్యత్రా నిర్దిష్టముగా పేర్కొనబడిన వాటికన్నా భిన్నమైనవి). | 6016 |
| | (i) లాటిక్స్ ఫోమ్ స్పాంజ్; | |
| | (ii) కఠినతరం గావించిన బడినట్టి ప్లేట్లు, షీట్లు మరియు స్ట్రిప్పులు మరియు వల్కనైజ్ చేయబడిననూ, చేయబడక పోయిననూ మరియు ఏటెక్స్‌టైల్ పదార్థముతో కలపబడిననూ లేక మరేవిధంగా నైనప్పటికి; | |
| | (iii) పైపింగ్ మరియు ట్యూబింగ్‌లకు ఉపయోగించు కఠినతరం గావించబడని వల్కనైజ్డ్ రబ్బరు; | |
| | (iv) ఏ టెక్స్‌టైల్ పదార్థముతో కలపబడిననూ లేక మరే విధంగా నైనప్పటికిని వల్కనైజ్డ్ రబ్బరు యొక్క బెల్టింగ్ మెటీరియల్ లేక ట్రాన్స్‌మిషన్, కన్వేయర్ లేక ఎలివేటర్ బెల్టులు కూడియుండును. | |
| 13. | నీటి సరఫరా మరియు శానిటరీ ఫిట్టింగులు పోర్సెలిన్ మరియు చైనావేర్ కన్నా భిన్నమైనవి | 6017 |
| 13-ఎ | స్టోన్‌వేర్ పైపులు. | 6018 |
| 14. | మరకోయబడిన లేక టేప్డ్ బోల్టులు మరియు నట్లు మరియు బేస్‌మెటల్ యొక్క స్క్రూలు లేక బోల్టు చివరలు, స్క్రూలు, స్టడ్స్, స్క్రూ స్టడ్డింగ్, సెల్ఫ్ టేప్డ్ స్క్రూలు, స్క్రూ హుక్స్ మరియు స్క్రూరింగులతో సహా వాటి యొక్క అల్లాయ్స్. | 6019 |

| (1) | (2) | (3) |
|---|---|---|

## ఏడవ షెడ్యూలు

(1) ఒకటి నుండి ఆరు షెడ్యూళ్ళ నందు నిర్దిష్టపరచబడిన సరుకుల కన్నా భిన్నమైన సరుకులు 7001

(2) అట్లు దాఖలు చేయబడిన రిటర్నులు (3) మరియు (4) సబ్-రూల్సు నిబంధనలకు లోబడి తాత్కాలికముగా అంగీకరించబడవలెను.

(3) ఏ డీలరయినను ఏదయినా నెలకు సంబంధించిన రిటర్నును అందు నిమిత్తము ప్రెస్క్రైబ్ చేయబడిన తేదీకి ముందు సమర్పించుటలో విఫలమైనప్పుడు లేదా లెక్కలు, రిజిస్టరులు మరియు ఇతర అధికార పత్రములన తనిఖీ తర్వాత దాఖలు చేసినను లేదా తనిఖీ తేదీ తదనంతరము రిటర్నును సమర్పించినపుడు లేదా సమర్పించబడిన రిటర్ను సరియైనది కానిదిగా అసంపూర్ణమైనదిగా అసెసింగ్ అథారిటీకి కనిపించినట్లయితే, అసెసింగ్ అథారిటీ 12వ రూలు నందు ప్రెస్క్రైబ్ చేయబడిన ప్రొసీజరును అనుసరించిన తరువాత తన యొక్క బెస్టు జడ్జిమెంటు రీత్యా టర్నోవరును అసెస్ చేయవలెను మరియు ఆ నెలకు చెల్లింపవలసిన పన్ను లేక పన్నులను తాత్కాలికముగా అసెస్ చేయవలెను మరియు ఫారమ్ బి-2 నందు నోటీసును డీలరుకు అందచేయవలెను మరియు డీలరు, డిమాండు చేయబడిన మొత్తమును నోటీసు నందు నిర్దిష్ట పరచబడిన సమయములోపు మరియు విధానము నందు చెల్లించవలెను.

**ఫారము - బి- 2**

అయితే-డీలరు చేత సమర్పించబడిన రిటర్నులు ఈ చట్టము క్రింద అట్టి రిటర్నులను సమర్పించుటకు ముందు ఒక అధికారి చేత డీలరు యొక్క లెక్కలు, రిజిస్టరులు మరియు ఇతర అధికార పత్రముల యొక్క తనిఖీ కారణముగా తప్పు వెల్లడికాని టర్నోవరు మరియు దాని యొక్క ఏవయినా వివరములతో కూడియున్నపుడు అసెసింగ్ అథారిటీ ఇందు నిమిత్తం విన్నపము చేసుకునేందుకు డీలరుకు అవకాశమిచ్చిన తరువాత అట్టి రిటర్నులను సరియైనవి కానివిగా లేక అసంపూర్ణమైన రిటర్నులుగా పరిగణించవచ్చును మరియు దాని ఆధారముగా చర్య-తీసుకొనుటకు ఉపక్రమించవచ్చును.

అంతేగాక - ఏ కారణము వలన నైననూ ఏ నెలకైననూ చెల్లించవలసిన పన్ను లేక పన్నుల తాత్కాలిక అసెస్‌మెంటు యొక్క నిర్ణయము, తదనంతరము వచ్చే నెల లేక నెలల యొక్క రిటర్ను పొందునాటికి లేక అంతకు ముందు గానీ పూర్తి కానట్లయితే, అసెసింగ్ అథారిటీ స్వయం విచక్షణ ననుసరించి అట్టి నెలలన్నింటికి చెల్లించదగిన పన్ను లేక పన్నులను ఏక ఉత్తర్వు నందు తాత్కాలికముగా అసెస్‌మెంటు చేయవచ్చును మరియు ఫారము బి-2 నందు నోటీసులను డీలరుకు అందచేయవచ్చును మరియు డీలరు, డిమాండు చేయబడిన మొత్తమును నోటీసు నందు నిర్దిష్ట పరచబడిన సమయము లోపు మరియు విధానము నందు చెల్లించవలెను.

(4) ఏ డీలరైనను చెల్లించవలసిన పన్ను పూర్తి మొత్తమునకు రశీదు లేక డిమాండు డ్రాఫ్టు లేకుండా రిటర్నును సమర్పించినట్లయితే లేక చెక్కును పంపుటలో విఫలమైనట్లయితే, అసెసింగ్ అథారిటీ ఆ నెలకు చెల్లించవలసిన పన్నులను తాత్కాలికముగా అసెస్ చేయవలెను మరియు బాకీయైన పన్ను కొరకు ఫారము బి-2 నందు ఒక నోటీసును డీలరుకు అందచేయవలెను మరియు డీలరు, డిమాండు చేయబడిన మొత్తమును నోటీసు నందు నిర్దిష్ట పరచబడిన సమయములోపల మరియు విధానమునందు చెల్లించవలెను.

అదనంగా, తన ప్రిన్సిపల్స్ తరపున తన చేత కొనసాగించబడిన లావాదేవీల విషయంలో టర్నోవరును చూపుతూ ఫారము - ఎ4 నందు పూర్వ నెల కొరకు ఒక రిటర్నును, తాను సమర్పించుటకు బాధ్యుడైన రిటర్ను లేక రిటర్నులతో పాటుగా సమర్పించవలెను.

**ఫారము ఎ-4**

(బి) తన ప్రిన్సిపల్‌కు ఒక ఏజెంటు చేత ఇవ్వబడు "పట్టీ" (లెక్కల స్టేటుమెంటు) ఈ క్రింది ధృవపత్రముతో కూడి యుండవలెను; అనగా -

"మీ తరపున జరుపబడిన అమ్మకములు/కొనుగోళ్ళపై బాకీయైన పన్ను నా/మన చేత చెల్లింపబడినవి/ చెల్లింపబడ గలవు అని ధృవీకరించడమైనది."

17-సి (1) ఒకటవ, రెండవ, మూడవ ఐదవ మరియు ఆరవ షెడ్యూళ్ళ నందు నిర్దిష్టపరచబడిన సరుకులను అమ్మునట్టి వ్యాపారమును తన తరపున తన ఏజెంటు ద్వారా కొనసాగించుచున్న ఈ రాష్ట్రపు నివాసియైన ప్రతి వ్యక్తియు ఏజెంటుకు అట్టి సరుకులను అప్పగించిన ప్రతి సందర్భమున ఫారము ఎ-5 నందు అతనికి డిక్లరేషను సమకూర్చవలెను.

**ఫారము - ఎ 5**

(2) (1) వ సబ్ - రూలు క్రింద డీలరు చేత ఉపయోగించబడుతున్న డిక్లరేషను ఫారములు క్రమసంఖ్యా పూర్వకముగా మరియు పుస్తక రూపమునందు నిర్వహించబడవలెను మరియు సంబంధిత అసెసింగ్ అథారిటీ యొక్క కార్యాలయపు ముద్రను కల్గియుండవలెను.

17-డి (1) రాష్ట్రము నందున్న ఏ ఇతర డీలరు వద్ద నుండి కొనుగోలు చేయబడిన ధాన్యమునకు సంబంధించి చట్టము యొక్క మూడవ షెడ్యూలు యొక్క విశదీకరణము క్రింద పన్ను తగ్గింపును క్లెయిము చేయు ప్రతి బియ్యం డీలరు ధాన్యముపై చెల్లించబడిన పన్ను యొక్క వివరముల వివరణలను ఇచ్చుచూ ఫారము యఫ్ - 1 నందు స్టేటుమెంటును సమకూర్చవలెను.

**ఫారము - యఫ్ - 1**

(2) కొనుగోలు చేసిన ధాన్యపు పరిమాణమును అట్టి ధాన్యమును బియ్యముగా మార్చగా వచ్చిన బియ్యపు పరిమాణము యొక్క నిర్దేశము ప్రకారం లెక్క కట్టేందుకై అసెసింగ్ అథారిటీ 100 క్వింటాళ్ళ ధాన్యము 70 క్వింటాళ్ళ బియ్యమునకు సమానముగా, అందుకు విరుద్ధముగా నిరూపించబడితే తప్ప. లెక్క కట్టవచ్చును.

(3) ఈ రూలు క్రింద ఒక డీలరు తాను తగ్గింపునకు హక్కుదారునని నిరూపించుకునే బాధ్యత తగ్గింపును క్లెయిము చేయుచున్న డీలరు పైననే యున్నది.

17-ఇ. తొలగించబడినది.

17-యఫ్. (1) ఈ చట్టము క్రింద పన్ను చెల్లించుటకు బాధ్యమయ్యే ప్రతి ప్రభుత్వశాఖ ప్రతి నెలకు మొత్తము మరియు పన్ను విధింపదగిన టర్నోవరును మరియు పన్ను లేక పన్నుల రూపముగా ఆ నెల క్రమము నందు దాని చేత వాస్తవముగా వసూలు చేయబడిన మొత్తము లేక మొత్తములను చూపుతూ ఫారము ఎ-6 నందు రిటర్నును సమర్పించవలెను. ప్రతినెల రిటర్ను సదరు వ్యాపార ప్రదేశము ఉన్న ప్రదేశముపై అధికార పరిధి గల అసెసింగ్ అథారిటికి తదనంతరం నెల 20వ రోజున లేక అంతకు ముందు గాని చేరునట్లు పంపబడవలెను. సంబంధిత

సంక్షిప్తముగా వ్రాతపూర్వకముగా అసెస్‌మెంటు ఉత్తర్వు నందు అతడు రికార్డు చేయవలెను. ప్రతి అసెస్‌మెంటు సందర్భము నందు అసెసింగ్ అథారిటీ అసెస్‌మెంటు ఉత్తర్వు యొక్క ఒక నకలును డీలరుకు అందచేయవలెను. అయితే - సక్రమముగా చేయబడిన ఏ అసెస్‌మెంటు యొక్క మాన్యతపైన ఈ రూలునందున్నదేదీ దుష్ప్రభావమును చూపదు.

18-ఎ. (1) 25వ మరియు 30-ఎ సెక్షనుల క్రింద నిర్దేశితమైన ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీ పన్ను చెల్లించుటకు బాధ్యుడయ్యే డీలరు సందర్భమందు అసెసింగ్ అథారిటీ మరియు అన్ని ఇతర సందర్భములందు సంబంధిత రిజిస్టరు చేయు అథారిటీ అయ్యుండును.

(1-ఎ) (1) వ సబ్-రూలు క్రింద దత్తము చేయబడిన అధికారములు అట్టి అథారిటీ విషయము నందు వర్తించునట్టి షరతులకు లోబడి, అసెస్‌మెంటు లేక రిజిస్టరు చేయునట్టి అథారిటీ కన్నా ఉన్నతులయిన ఏ అథారిటీల చేతనయిననూ వినియోగింప బడవచ్చును.

(2) ఏ డీలరు నయినను లెక్కలను ఏదయినా ప్రత్యేక విధానము నందు నిర్వహించమని ఆదేశించుచున్న నోటీసు ఫారము - XXXI నందుండవలెను.

**ఫారము -XXXI**

(3) 30-ఎ సెక్షను క్రింద విధించుటకు ప్రతిపాదింపబడిన జరిమానా విధింపుకు వ్యతిరేకంగా విన్నపము చేసుకొనేందుకు డీలరుకు ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీ అవకాశమివ్వవలెను. ఇందు నిమిత్తము నోటీసు ఫారము – XXXI నందుండవలెను.

(4) ప్రెస్క్రైబ్ చేయబడిన అథారిటీ విధింపబడిన జరిమానా కొరకు ఫారము –XIII నందు నోటీసును డీలరుకు అందచేయవలెను మరియు అందు ప్రెస్క్రైబ్ చేయబడిన అట్టి విధానము నందు మరియు అట్టి సమయములోపల డీలరు డిమాండు చేయబడిన మొత్తమును చెల్లించవలెను.

**ఫారము - XIII**

19. రొక్కము కన్నా ఇతర మయిన విలువయిన మూల్యము కొరకు సరుకులను అమ్మునట్టి లేక కొనునట్టి ప్రతి డీలరు, అట్లు కొనిన లేక అమ్మిన సరుకుల పరిమాణము మరియు సరుకులు దేని కొరకు అమ్మబడినవో లేక కొనబడినవో ఆ విలువయిన మూల్యము యొక్క చాలినన్ని వివరములతో వర్ణనను ఈ రూలు క్రింద అతనిచే సమర్పించబడుటకు అపేక్షితమైనట్టి టర్నోవరు రిటర్ను నందు ప్రత్యేకముగా నిర్దిష్టపరచవలెను. ఈ చట్టము క్రింద టర్నోవరును నిర్ణయించు మరియు చెల్లించవలసిన పన్ను అసెస్ చేసేందుకు అసెసింగ్ అథారిటీ అట్టి మూల్యము యొక్క విలువను రొక్క రూపంగా స్థిరపర్చవచ్చును మరియు అట్టి అథారిటీ చేత స్థిరపర్చబడిన విలువ, ఈ చట్టము నందు మరియు దాని క్రింద చేయబడిన రూల్సు లందు పొందుపరచబడిన అప్పీలు మరియు రివిజనులకు లోబడి అంతిమము.

19-ఎ. రిటర్నును సమర్పించుటకు బాధ్యుడయిన ప్రతి డీలరు తాను సమర్పించుటకు బాధ్యత గల రిటర్ను లేక రిటర్నులతో పాటు వేటిపై మినహాయింపు క్లెయిమ్ చేయబడినదో ఆ కొనుగోళ్ళు లేక అమ్మకాల వివరములను చూపుతూ రెండు ప్రతులలో ఫారము - ఇ నందు రిటర్నును సమర్పించవలెను.

**ఫారము - ఇ**

**అయితే** - ఈ చట్టము యొక్క నాలుగవ షెడ్యూలు నందు నిర్దిష్టపర్చబడిన సరుకులు లేదా కేంద్ర అమ్మకపు పన్ను చట్టము, 1956 క్రింద పన్నుకు బాధ్యమయ్యే సరుకుల అమ్మకములు లేక కొనుగోళ్ళ వివరములు ఫారము - ఇ రిటర్ను నందు సమర్పించబడవలసిన అవసరము లేదు.

(2) అట్టి విరమణ లేక రద్దు సమయమునందు అట్టి ఫరమ్ యొక్క భాగస్వామిగా లేదా అట్టి హిందూ అవిభక్త కుటుంబం లేక అసోసియేషను నందు సభ్యుడుగా నున్న ప్రతి వ్యక్తి మరియు మరణించిన అట్టి ఏ వ్యక్తి యొక్క చట్ట బద్ధమైన ప్రతినిధి చెల్లించవలసిన పన్ను, జరిమానాల మొత్తము లేక ఇతర మొత్తాలకు సమిష్టిగా మరియు విడివిడిగా బాధ్యులగుదురు మరియు అట్టి ఏదేనీ అసెస్‌మెంటు లేక జరిమానా లేక ఇతర మొత్తపు విధింపులకు, అవి ఉన్నంతమేరకు, ఈ చట్టము యొక్క అన్ని నిబంధనలు వర్తించును.

(3) ఏదయినా సంవత్సరమునకు అసెస్‌మెంటుకు సంబంధించి ఏవైనా ప్రొసీడింగ్సు ఆరంభమయిన తరువాత అట్టి విరమణ లేక రద్దు సంభవించినపుడు, అట్టి విరమణ లేక రద్దు సమయమునందు అట్టి ఫరమ్ యొక్క భాగస్వామిగా లేక అట్టి హిందూ అవిభక్త కుటుంబము లేక అసోసియేషను నందు సభ్యుడుగా, సందర్భానుసారముగా ఎవరయితే వారు, ఉన్న ప్రతివ్యక్తిపై లేదా మరణించిన అట్టి ఏ వ్యక్తి యొక్క చట్టబద్ధమైన ప్రతినిధిపై అట్టి విరమణ లేక రద్దు జరిగిన సమయమందు ప్రొసీడింగ్సు ఏ దశలో ఆగెనో అచ్చట నుండి అట్టి ప్రొసీడింగ్సు కొనసాగింపబడవలెను మరియు ఆ మేరకు ఈ చట్టము యొక్క అన్ని నిబంధనలు, అవి ఉన్నంతమేరకు, తదనుసారముగా వర్తించును.

(4) (2) వ సబ్ - రూలు క్రింద చట్టబద్ధమైన ప్రతినిధి యొక్క బాధ్యత, బాధ్యత తీర్చుటకు ఎస్టేటు సమర్థమగునంత మేరకు పరిమితం చేయబడవలెను.

(5) ఈ రూలు క్రింద ఏ అసెస్‌మెంటు అయినను చేయబడవలసి యున్నపుడు, అసెసింగ్ అథారిటీ , ఫరమ్, హిందూ అవిభక్త కుటుంబము లేక అసోసియేషను సందర్భము నందు వాటి విరమణ లేక రద్దు సమయమునందు అట్టి ఫరమ్ యొక్క భాగస్వామిగా నున్న లేక అట్టి హిందూ అవిభక్త కుటుంబము లేక అసోసియేషను నందు సభ్యుడు నున్న ఏ వ్యక్తి పైనైననూ ఈ చట్టము క్రింద లేక ఈ రూల్సు క్రింద ఏ నోటీసు, సమనులు లేక ప్రొసీడింగుల నైననూ అందజేయవచ్చును.

23. (1) ఈ చట్టము క్రింద పన్ను చెల్లించవలసిన వ్యాపారమును చేయుచున్న ఏ డీలరైననూ మరణించినపుడు, ఆ మరణించిన డీలరు యొక్క వీలునామా నిర్వహణ కర్త, మృతుని ఆస్తిపై వ్యవహర్త హక్కుదారైన వారసుడు లేక ఇతర చట్టబద్ధమైన ప్రతినిధి అట్టి వ్యాపారమునకు సంబంధించి ఈ రూల్సు క్రింద బాకీ అయిన రిటర్నులను సమర్పించుటకు మరియు 5, 5-బి, 5-సి, 5-ఇ, 5-యఫ్, 5-జి, 6, 6-ఎ, 6-సి సెక్షనుల క్రింద లేదా 9(1) సెక్షను క్రింద ఏదయినా నోటిఫికేషను క్రింద అసెస్‌మెంటుకు మరియు అసెస్ చేయబడిన లేక విధింపబడిన పన్ను మరియు / లేదా ఏ జరిమానా యైననూ మరణించిన డీలరు చేత చెల్లింపబడునట్లుగానే ఆ మరణించిన డీలరు ఎస్టేటు నుండి చెల్లించుటకు బాధ్యుడగును.

(2) (1) వ సబ్-రూలు క్రింద చేయబడిన అసెస్‌మెంటులకు అప్పీళ్ళు మరియ రివిజనులకు సంబంధించిన నిబంధనలు, వీలునామా నిర్వహణకర్త, మృతుని ఆస్తిపై వ్యవహర్త, హక్కుదారైన వారసుడు లేక ఇతర చట్టబద్ధమైన ప్రతినిధి తానే స్వయంగా డీలరు అయినట్లు వర్తించును.

(3) (1) మరియు (2) వ సబ్-రూల్సు నిబంధనలు కార్య నిర్వాహక భాగస్వాములు మరణించిన భాగస్వామ్య ఫరమ్‌కు కూడా అవసరమైన మార్పులతో సందర్భోచితంగా వర్తించును.

24. తొలగించబడినది.

25. తొలగించబడినది.

రిజిష్టరు చేయు అథారిటీకి రిజిస్ట్రేషను కొరకు ఒక దరఖాస్తును వ్యాపారమును ఆరంభించుటకు ముందే సమర్పించవలెను.

(3) తాను డీలరు అయిననూ, కాకున్ననూ ప్రతి మిల్లరూ రిజిస్ట్రేషను కొరకు రిజిష్టరు చేయు అథారిటీకి ఒక దరఖాస్తును తాను మిల్లునందు మిల్లింగు ఆపరేషనులను ఆరంభించుటకు ముందే సమర్పించవలెను.

(4) (1) వ సబ్ - రూలు క్రింద రిజిస్ట్రేషను కొరకు దరఖాస్తు సమర్పించుటకు బద్ధుడు కాని ఏ డీలరయిననూ తన ఇచ్ఛననుసరించి చట్టము యొక్క 12వ సెక్షను యొక్క (1) వ సబ్ - సెక్షను క్రింద రిజిస్ట్రేషను కొరకు రిజిష్టరు చేయు అథారిటీకి దరఖాస్తు చేసుకొనవచ్చును.

(5) ఒక డీలరు రాష్ట్రము వెలుపల నివసించుచూ మరియు రాష్ట్రము నందు స్థిరమయిన వ్యాపార ప్రదేశము కలిగియుండక తన ఉద్యోగి ద్వారా కానీ ఏజంటు భిన్నమైన వ్యక్తి ద్వారాగానీ, ఏ పేరుతో పిలువబడినప్పటికి, అమ్మకట, సరఫరా చేయుట లేక ఏదయినా వర్క్సు కాంట్రాక్టును నిర్వహించుట లేక కొనసాగించుట లేక ఏ సరుకుల నైననూ వాడుకునే హక్కును బదిలీ చేయుట లేక సరుకులను పంపిణీ చేయుట చేయుచున్నచో అట్టి డీలరు కమీషనరుకు గానీ లేక ఇందు నిమిత్తము కమీషనరు చేత అథరైజు చేయబడిన ఏ అధికారికైననూ రిజిస్ట్రేషను కొరకు దరఖాస్తును సమర్పించవలెను.

(6) (1) నుండి (5) వరకు గల సబ్ - రూల్సు క్రింద రిజిస్ట్రేషను కొరకు ప్రతి దరఖాస్తు ఫారము - డి నందు చేయబడవలెను. ఒక డీలరు ఒకటికి మించిన వ్యాపార ప్రదేశములను (కేవలం సరుకులను నిల్వ చేయుటకు మాత్రమే వాడబడు ప్రదేశము కన్నా భిన్నమైనది) కలిగియున్నపుడు, అన్ని వ్యాపార ప్రదేశముల రిజిస్ట్రేషను కొరకును ఏక దరఖాస్తు సమర్పించ బడవచ్చును.

**ఫారము - డి**

(7) రిజిస్ట్రేషను కొరకు చేయబడు ప్రతి దరఖాస్తు ప్రధాన వ్యాపార ప్రదేశము సంబంధంగా వంద రూపాయలు మరియు ప్రతి ఇతర వ్యాపార ప్రదేశము సంబంధంగా ఇరవై రూపాయల కొరకు ప్రభుత్వ ట్రెజరీ రశీదుగానీ లేక రిజిష్టరు చేయు అథారిటీ పేరున డిమాండు డ్రాఫ్టుతో గానీ జతచేయబడవలెను.

(8) ఈ చట్టము క్రింద చెల్లింపవలసిన పన్ను మరియు ఇతర బాకీల సముచిత వసూలు కొరకు మరియు / లేదా ఈ చట్టమునందు లేక దాని క్రింద చేయబడిన రూల్సు మరియు జారీ చేయబడిన నోటిఫికేషను లందు నిర్దేశింపబడిన ఫారముల సముచిత రక్షణ మరియు వాడకము కొరకు, రిజిష్టరు చేయు అథారిటీ తన చేత అచనా వేయబడినట్లు ఒక సంవత్సరానికి ఈ చట్టము క్రింద చెల్లింపబడవలసిన పన్నుకు సమానమయిన మొత్తాన్ని మించని సెక్యూరిటీని సదరు అథారిటి చేత నిర్దిష్టమయ్యే అట్టి సమయము లోపల రిజిస్ట్రేషను కొరకు సమకూర్చమని దరఖాస్తుదారుని అపేక్షించవచ్చును.

(9) (8)వ సబ్ - రూలు నందు నిర్దేశింపబడిన సెక్యూరిటీ ఈ క్రింది ఏ రూపము నందయిననూ ఉండవచ్చును. అనగా: (ఎ) ప్రభుత్వ ట్రెజరీ నందు రొక్క రూపమయిన డిపాజిట్టు.

(బి) ప్రభుత్వ ఋణ పత్రములు, అప్పు పత్రములు, పోస్టాఫీసు పొదుపు ఖాతా డిపాజిట్లు, జాతీయ పొదుపు పత్రములు, రిజిష్టరు చేయు అథారిటీకి యథాక్రమముగా ప్లెడ్జి చేయబడిన షెడ్యూల్డు బ్యాంకులు లేక ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు లేక కేంద్ర సహకార బ్యాంకులందు చేయబడిన డిపాజిట్లు.

రుసుములు చెల్లించబడనపుడు మరియు / లేదా ఏదయినా డిమాండు చేయబడిన సెక్యూరిటీ, ఏదయినా ఉన్నట్టయితే, సమకూర్చబడనపుడు, తిరస్కారమునకు వ్యతిరేకముగా విన్నపము చేసుకొనుటకు, సదరు వివరములను సరిచేసుకొనుటకు మరియు సంపూర్ణము చేసుకొనుటకు లేదా (7)వ మరియు (8)వ సబ్ - రూలుల అపేక్షితములను పాటించుటకు, సందర్భానుసారముగా ఏదయితే అది, అవకాశమిచ్చిన అనంతరము వ్రాత పూర్వకముగా రికార్డు చేయదగిన కారణముల కొరకు ఆ దరఖాస్తును అతడు తిరస్కరించవచ్చును.

(11) జారీ చేయబడిన లేక (10)వ సబ్ - రూలు క్రింద జారీ చేయబడినట్లు భావింపబడిన రిజిస్ట్రేషను ధృవపత్రము.

(ఎ) వ్యాపారమునకు గానీ లేక అందులోని భాగమునకు ఉత్తరాధికారిగా వచ్చే వ్యక్తి కన్నా ఇతరుడయిన ఏ వ్యక్తి సందర్భమునందైననూ రిజిస్ట్రేషను కొరకు దరఖాస్తును స్వీకరించిన తేదీనుండి

(బి) వ్యాపారము లేక అందులోని భాగమునకు ఉత్తరాధికారిగా వచ్చే వ్యక్తి సందర్భమునందు అతడు ఆ వ్యాపారమునకు ఉత్తరాధికారియైన తేదీనుండి ప్రభావవంతమగును.

(12) (10)వ సబ్ - రూలు క్రింద అనుదానము చేయబడిన రిజిస్ట్రేషను ధృవపత్రము, సదరు ధృవపత్రము నందు ఉదహరింపబడిన ప్రధాన వ్యాపార ప్రదేశం వద్ద సువ్యక్త స్థలము నందు ఉంచబడవలెను మరియు సదరు సబ్-రూలు క్రింద అనుదానము చేయబడిన సదరు ధృవపత్రము యొక్క నకలు రాష్ట్రమందున్నట్టి ప్రధాన వ్యాపార ప్రదేశము కన్నా భిన్నమయిన, సదరు ధృవపత్రమునందు ఉదహరించబడిన ప్రతి వ్యాపార ప్రదేశము వద్ద సువ్యక్త స్థలము నందు ఉంచబడవలెను.

(13) రిజిస్టరు అయిన ప్రతి డీలరు తన రిజిస్ట్రేషను దర్దు అయ్యేంతవరకు, తాను రిజిస్ట్రేషను కొరకు దరఖాస్తు చేసిన సంవత్సరమునకు అనంతరము వచ్చే ప్రతి సంవత్సరానికి రిజిస్ట్రేషను రెన్యూవల్ చేయబడవలసిన సంవత్సరము ఆరంభమయిన ముప్పైరోజుల లోపల ప్రధాన వ్యాపార ప్రదేశమునకు సంబంధించి వందరూపాయలు మరియు (7)వ సబ్ - రూలునందు నిర్దిష్టపర్చబడిన ప్రతి ఇతర వ్యాపార ప్రదేశమునకు సంబంధించి ఇరవై రూపాయల రుసుమును చెల్లించవలెను.

అయితే - డీలరు తన ఇచ్ఛానుసారము రిజిస్ట్రేషను ధృవపత్రమును, పై సబ్-రూలునందు ప్రెస్క్రైబ్ చేయబడిన రేటు వద్దమూడు సంవత్సరముల కొరకు రుసుముల చెల్లింపు పై మూడు సంవత్సరముల కొరకు రెన్యూ చేయించుకొనవచ్చును.

(14) రిజిస్ట్రేషను ధృవపత్రము అమలులో కొనసాగినంత కాలము సమకూర్చబడిన సెక్యూరిటీ పూర్తి మొత్తమునందు నిర్వహించబడవలెను మరియు ఏ పన్ను, జరిమానా, వడ్డీ లేక బాకీ అయిన ఇతర మొత్తము యొక్క చెల్లింపు ఉపేక్షింపబడిన సందర్భము నందు అట్టి పన్ను, జరిమానా, వడ్డీ లేక ఇతర మొత్తము కొరకు యథాక్రమముగా తెలిపిన తరువాత సర్దుబాటు చేయవచ్చును. అట్టి సర్దుబాటు చేయబడిన ఏ సందర్భమునందైననూ రిజిస్టరు చేయు అథారిటీ పన్ను, జరిమానా, వడ్డీ లేక ఇతర మొత్తము కొరకు సర్దుబాటు చేయబడిన మొత్తమును భర్తీచేసేందుకు సరిక్రొత్త సెక్యూరిటీని కాని లేక అదనపు సెక్యూరిటీని కానీ డిమాండు చేయవచ్చును.

(15) రిజిష్టరు చేయబడిన ఒక డీలరు ఈ చట్టము క్రింద చెల్లింప వలసిన పన్ను మరియు ఇతర బాకీల సముచిత చెల్లింపు కొరకు మరియు / లేదా ఈ చట్టము నందు లేక దాని క్రింద చేయబడిన రూల్సు మరియు జారీ చేయబడిన నోటిఫికేషనులందు నిర్దేశించబడిన ఫారముల సముచిత రక్షణ మరియు వాడకము కొరకు సెక్యూరిటీ లేదా అదనపు

అథారిటీ ద్వారా క్రొత్త ప్రధాన వ్యాపార ప్రదేశము యొక్క రిజిస్టరు చేయు అథారిటీకి దరఖాస్తు చేయవలెను.

(బి) రిజిస్టరు చేయు అథారిటీ దరఖాస్తును స్వీకరించిన పిదప ఎవరి అధికార పరిధి యందు ప్రతిపాదింపబడునట్టి క్రొత్త ప్రధాన వ్యాపార ప్రదేశము స్థాపించబడవలెనని అపేక్షింపబడుతున్నదో ఆ రిజిస్టరు చేయు అథారిటీకి దరఖాస్తును మరియు రిజిస్ట్రేషను ఫైలును, సంబంధిత అసెసింగ్ అథారిటీకి మరియు డీలరుకు తెలియచేయుచూ బదిలీ చేయవలెను.

(సి) ప్రతిపాదిత క్రొత్త వ్యాపార ప్రదేశము యొక్క రిజిస్టరు చేయు అథారిటి, ఆ దరఖాస్తు మరియు రిజిస్ట్రేషను ఫైలు మరియు అసలు ధృవ పత్రము(ల)ను పూర్వ రిజిస్టర్ చేయు అథారిటీ నుండి స్వీకరించిన పిదప, పాత ధృవపత్రములను రిజిస్ట్రేషను ఫైలునందే యుంచి, పూర్వ ప్రధాన వ్యాపార ప్రదేశముపై మరియు ప్రతిపాదిత క్రొత్త వ్యాపార ప్రదేశముపై అధికార పరిధి కల ఉభయ అసెసింగ్ ధృవ పత్రము (ల) ను జారీ చేయవలెను.

అథారీటలకు మరియు పూర్వ రిజిష్టరు చేయు అథారిటీకి తెలియచేయుచూ సరిక్రొత్త రిజిస్ట్రేషన్

(22) (ఎ) ఒక రిజిస్టర్డు డీలరు మరో ఇతర వ్యక్తితో భాగస్వామ్యమునందు ప్రవేశించు సందర్భమున అట్లు యేర్పడిన భాగస్వాముల ఫరము ఈ రూల్సు యొక్క నిబంధనలననుసరించి దరఖాస్తు చేసుకొనవలెను మరియు సరిక్రొత్త రిజిస్ట్రేషను ధృవ పత్రమును పొందవలెను.

(బి) ఈ రూల్సు క్రింద డీలరుగా రిజిస్టరు చేయబడిన భాగస్వామ్య ఫరము యొక్క ఒక భాగస్వామి పదవీ విరమణ చేసిన లేక మరణించిన సందర్భమున కొనసాగుతున్న భాగస్వాముల ఫరము ఈ రూల్సు యొక్క నిబంధనల ననుసరించి దరఖాస్తు చేసుకొనవలెనను మరియు సరిక్రొత్త రిజిస్ట్రేషను ధృవపత్రమును పొందవలెను.

(సి) ఒక మైనరు-ఉనికి యందున్న ఒక వ్యాపారమునకు వారసత్వమును పొందిన లేక డీలరునకు ఉత్తరాధికారి యయిన సందర్భమున సదరు మైనరు యొక్క సంరక్షకుడు లేక ఏజంటు అట్టి వారసత్వము లేదా ఉత్తరాధికారిత్వము, సందర్భానుసారముగా ఏదయితే దానిని, పొందిన పిమ్మట ఈ రూల్సు యొక్క నిబంధనల ననుసరించి దరఖాస్తు చేసుకొనవలెను మరియు సరిక్రొత్త రిజిస్ట్రేషను ధృవ పత్రమును పొందవలెను.

(23) రిజిస్టరయిన డీలరు, రిజిస్ట్రేషను ధృవ పత్రము నందు ఉదహరింపబడని ఏ ప్రదేశము లేక గోదాము నందునూ తన సరుకులను ఉంచరాదు.

(24)(i) రిజిస్టరు చేయు అథారిటీ ఈ చట్టము యొక్క 12వ సెక్షను యొక్క (17)వ సబ్-సెక్షను క్రింద ఒక డీలరు యొక్క రిజిస్ట్రేషను ధృవపత్రమును రద్దు చేయుటకు ముందు డీలరుకు ఆ విషయము నందు తన వాదనను వినిపించుకొనేందుకు అవకాశమివ్వవలెను. రద్దునకు కారణములను ఆ ఉత్తర్వు నిర్దిష్ట పరచవలెను మరియు ఉత్తర్వు యొక్క నకలు డీలరుకు అందచేయబడవలెను.

(ii) రిజిస్ట్రేషను ధృవ పత్రము రద్దు చేయబడినట్లయితే ఆ డీలరు తనకు అనుదానము చేయబడిన రిజిస్ట్రేషను ధృవపత్రమును మరియు, ఏవయినా ఉన్నట్లయితే, దాని నకళ్లను రిజిస్టరు చేయు అథారిటీకి వెంటనే స్వాధీనము చేయవలెను.

**29. తొలగించబడినది.**

**29 - ఎ తొలగించబడినది.**

**30. తొలగించబడినది.**

(8) ఈ రూలు క్రింద రిజిస్ట్రేషను ధృవపత్రము ఈ చట్టము యొక్క 12వ సెక్షను క్రింద అనుదానము చేయబడిన రిజిస్ట్రేషను ధృవపత్రము యొక్క రద్దు తేదీనుండి యాంత్రికముగా రద్దుకాబడును.

**30-బి.** (1) (ఎ) ప్రతి తయారీ దారుడు ఫారము - జి నందు ఒక డిక్లరేషనును మూడు ప్రతులలో తయారు చేయవలెను మరియు రాయితీ రేటు చొప్పున తాను ఎవరివద్దనుండి ముడి పదార్థములను, కాంపోనెంటు పార్టులను, సబ్-అసెంబ్లీ భాగములను, ఇంటర్మీడియట్ భాగములను, కన్స్యూమబుల్సు మరియు ప్యాకింగ్ మెటీరియల్సును కొనుగోలు చేసినో ఆ డీలరుకు దాని యొక్క అసలు మరియు రెండవ ప్రతులను జారీ చేయవలెను.

అయితే-1989 జనవరి 21 తేదీన మరియునుండి రిజిస్ట్రేషను ధృవపత్రమునందు ఉదహరింపబడిన సరుకుల తయారీనందు వాడబడిన మరియు 1989 జనవరి 21వ తేదీన మరియు నుండి రిజిస్ట్రేషను ధృవపత్రమునందు ఉదహరింపబడిన సరుకుల అన్ని కొనుగోళ్ల నిమిత్తము ఫారము - 'జి' (రివైజు చేయబడిన) నందు డిక్లరేషనును తయారీదారుడు అమ్ముచున్న డీలరులకు జారీ చేయవచ్చును.

**ఫారము - జి**

అయితే - ఒక ఆర్థిక సంవత్సరమందు చేయబడిన ఏక 'జి' ఫారము చేత కవరు చేయబడిన అమ్మకాల పూర్తి మొత్తము రు. 20,000/- లేదా రాష్ట్ర ప్రభుత్వము సాధారణ ఉత్తర్వుద్వారా రాజపత్రమునందు నోటిఫై చేయునట్టి ఇతర మొత్తము కంటే తక్కువ లేక దానికి సమానము అయిన కేసులందు తప్ప, ఏ ఏక డిక్లరేషను ఒక అమ్మకపు వ్యవహారము కంటే ఎక్కువ కవర్ చేయరాదు.

అంతేగాక - ఏ అమ్మకపు వ్యవహారపు కేసునందైననూ సరుకుల బట్వాడా వివిధ ఆర్థిక సంవత్సరములకు విస్తరించి ఉన్నప్పుడు ప్రతి ఆర్థిక సంవత్సరమునందు అట్లు బట్వాడా చేయబడిన సరుకుల సంబంధంగా వేరు వేరు డిక్లరేషనులను సమకూర్చుట అవసరము:

(బి) రిజిస్ట్రేషను ధృవపత్రము నందు ఉదహరింపబడని అంశముల కొనుగోళ్ళ కొరకు మరియు ఈ చట్టము యొక్క 5-బి సెక్షను క్రింద రిజిస్ట్రేషను ధృవపత్రమును పొందుటకు ముందు చేయబడిన కొనుగోళ్ళ కొరకు తయారీ దారుని చేత ఫారము - 'జి' నందు డిక్లరేషను జారీ చేయబడరాదు.

(సి) అట్లు కొనుగోలు చేయబడిన సరుకులను తయారీదారుడు, ఈ రూల్సు యొక్క 30- ఎ రూలు క్రింద జారీ చేయబడిన రిజిస్ట్రేషను ధృవపత్రమునందు నిర్ధిష్టపర్చబడిన సరుకులను తయారుచేయుట కొరకు మాత్రమే ఉపయోగించవలెను లేక వినియోగించవలెను.

(డి) అట్లు కొనుగోలు చేయబడిన సరుకులను తయారీ దారుడు, తిరిగి అమ్మరాదు లేదా రిజిస్ట్రేషను ధృవపత్రమునందు నిర్ధిష్టపర్చబడిన కన్నా భిన్నమైన ప్రయోజనము కొరకు వాడరాదు.

(ఇ) (i) ఆ ముడి పదార్థములను, కాంపోనెంటు పార్టులను, సబ్ - అసెంబ్లీ భాగములను, కన్స్యూమబుల్సును ఇంటర్మీడియట్ భాగములను మరియు ప్యాకింగ్ మెటీరియల్సును అమ్ముచున్నట్టి డీలరు, 15వ రూలు లేక 17వ రూలు, సందర్భానుసారంగా ఏదైతే అది, క్రింద ప్రెస్క్రైబ్ చేయబడిన రిటర్నుతో పాటు డిక్లరేషను యొక్క అసలు ప్రతిని అసెసింగ్ అథారిటీకి పంపవలెను.

(ii) అమ్ముచున్నట్టి డీలరు ప్రెస్క్రైబ్ చేయబడిన రిటర్నులతోపాటు డిక్లరేషను యొక్క అసలు ప్రతిని పంపుటకు

(సి) యథాక్రమముగా పూర్తి చేయబడిన డిక్లరేషను ఫారము అమ్ముచున్నట్టి డీలరు ఆధీనము నందు ఉన్నప్పుడు పోయినట్లయితే అతడు 15 లేక 17వ రూలు, ఏది వర్తించితే అది, క్రింద తన యొక్క టర్నోవరు యొక్క రిటర్నును దాఖలు చేయుటకు అపేక్షితమై యుండునట్టి అథారిటీకి అట్టి ప్రతి డిక్లరేషను ఫారము నిమిత్తము బాకీ పడిన పన్ను బాకీకి సమానమయిన సెక్యూరిటీని నష్టపరిహార బాండు రూపముగా సమకూర్చవలెను.

(డి) యథాక్రమముగా పూర్తి చేయబడి మరియు సంతకము చేయబడిన డిక్లరేషను ఫారము ప్రయాణము నందుగానీ లేదా అమ్ముచున్నట్టి డీలరు యొక్క ఆధీనము నుంచిగానీ పోయినట్లయితే, తయారీదారు చేత ఎర్రసిరాతో 3 భాగములందునూ పేజీకి అడ్డముగా చేయబడినట్టి మరియు తయారీదారులచే యథాక్రమముగా సంతకము చేయబడినట్టి ఈ క్రింది డిక్లరేషనుతో యున్నట్టి ఫారము యొక్క రెండవ ప్రతిని పొందవలెను. అట్టి రెండవ ప్రతిని పొందేంత వరకు ప్రసక్తంలో ఉన్న అమ్మకము ఈ చట్టము యొక్క 5-బి సెక్షను యొక్క నిబంధన ననుసరించి రాయితీ పన్నురేటుకు అర్హము కాదు.

## డిక్లరేషను

------------------------------------------------ అను నేను --------------------------------

( అసెసింగ్ అథారిటీ) రోల్సు పై పన్ను చెల్లించు చున్నట్టి -----------------------------------------------నకు జారీ చేయబడిన మరియు --------------------------------- తేదీన సంతకము చేయబడిన------------------ సంఖ్యగల ------------------- ఆధీనము నుండి లేదా ప్రయాణము నందు పోగొట్టుకొనబడిన డిక్లరేషను ఫారమునకు ఇది రెండవ ప్రతి అని ఇందుమూలముగా ప్రకటించుచున్నాను.

31. (1) ఏ కారణమువల్లనయినా ఒక డీలరు యొక్క వ్యాపారపు టర్నోవరు మొత్తము లేక ఏదయినా భాగము పన్నుకు అసెస్‌మెంటును తప్పుకొన్నట్లయితే లేదా ఏ సంవత్సరమునందైనా తక్కువగా అసెస్‌చేయబడితే అసెసింగ్ అథారిటీ (6)వ సబ్ - రూలు యొక్క నిబంధనలకు లోబడి డీలరుకు అసెస్‌మెంటు యొక్క ఏ ఉత్తర్వైననూ అందజేయబడిన తేదీనుండి నాలుగు సంవత్సరాల వ్యవధిలోపు డీలరుకు నోటీసును జారీచేసిన అనంతరము మరియు తాను అవసరమని పరిగణించు అట్టి విచారణను చేసిన అనంతరము సరయిన టర్నోవరును తన యొక్క బెస్టుజడ్జిమెంటు రీత్యా నిర్ణయించవచ్చును మరియు అట్టి టర్నోవరుపై చెల్లింపవలసిన పన్నును అసెస్ చేయవచ్చును.

(2) తొలగించబడినది.

(3) పది లక్షల రూపాయలను మించని టర్నోవరుపై అసెస్‌మెంటు చేయబడిన తరువాత టర్నోవరు యొక్క కొంత భాగము పన్ను నుండి తప్పుకొనెనని నిశ్చయింపబడితే మరియు అసెస్‌మెంటు నుంచి తప్పుకున్న టర్నోవరు కలుపుటతో మొత్తము టర్నోవరు పది లక్షలను మించినట్లయితే అసెసింగ్ అథారిటీ వాణిజ్య పన్నుల అధికారి అయ్యుండును. అయితే -

(i) (1) మరియు (3) వ సబ్ - రూల్సు ప్రయోజనార్థము తన విచక్షణాను సారము సంయుక్త కమీషనరు మరియు సంబంధిత ప్రదేశము యొక్క ఉపకమీషనరుతో సహా ఏ ఉన్నత అథారిటీ అయిననూ తన అధికార పరిధిలో నున్న క్రింది స్థాయి అథారిటీ యొక్క అధికారములను ఏ డీలరు లేక డీలర్ల వర్గమునకు సంబంధించియైనను వినియోగించవచ్చును, మరియు

తాత్కాలిక అసెస్‌మెంటు అతి తక్కువ టర్నోవరు లేక అతి తక్కువ రేటుతో చేయబడినదని అసెసింగ్ అథారిటి నమ్మటానికి కారణమును కలిగియుండుట కారణంగా గాని అతడు, డీలరుకు నోటీసు నిచ్చిన అనంతరము మరియు తాను సముచితమని పరిగణించునట్టి విచారణను చేసిన అనంతరము తాత్కాలిక అసెస్‌మెంటును రివైజు చేయవచ్చును.

అయితే - తాత్కాలిక అసెస్‌మెంటు యొక్క రివిజను పూర్వసంవత్సరము కొరకు అధిక టర్నోవరు యొక్క నిర్ణయము కారణంగా అయినపుడు డీలరుకు నోటీసును జారీ చేయనవసరం లేదు.

## అప్పీళ్ళు మరియు రివిజనులు

33. (1) 19వ సెక్షను యొక్క నిబంధనలకు లోబడి - సహాయ కమీషనరు స్థాయిని మించని ఏ అధికారి చేతనైననూ ఈ చట్టము యొక్క నిబంధనల క్రింద పాసు చేయబడిన ఉత్తర్వు లేక రికార్డు చేయబడిన ప్రొసీడింగు చేత అర్హుడైన ఏ వ్యక్తి అయిననూ సంబంధిత ప్రదేశపు అప్పిలేటు ఉపకమీషనరుకు అప్పీలు చేసుకొనవచ్చును.

అయితే - కమీషనరు స్వయం ప్రేరితముగా గాని లేక దరఖాస్తు పై గానీ ఒక అప్పిలేటు ఉపకమీషనరు ముందు పెండింగులో ఉన్న అప్పీలును వేరొక అప్పీలేటు ఉపకమీషనరుకు వ్రాత పూర్వకంగా రికార్డు చేయదగిన కారణముల కొరకు బదిలీ చేయ వచ్చును మరియు బదిలీ ఉత్తర్వు అప్పీలుదారు లేక అర్జీదారునకు, ఆ ఉత్తర్వుచేత దుష్ప్రభావితుడయ్యే ప్రతి వ్యక్తికి, ఆ అప్పీలు లేక అర్జీ ఎవరి అథారిటీ ఉత్తర్వులకు వ్యతిరేకముగా చేయబడెనో ఆ అథారిటీకి మరియు అప్పిలేటు ఉపకమీషనరుకు అందజేయబడవలెను.

(2) (i) అట్టి ప్రతి అప్పీలు ఫారము I నందుండ వలెను మరియు రూల్సు నందు నిర్దిష్ట పరచబడిన విధానమునందు పరిశీలించబడవలెను.

(ii) అది రెండు ప్రతులందుండవలెను.

(iii) (ఎ) పన్ను లేక జరిమానాల విధింపు వివాదగ్రస్తమైన సందర్భము నందు వివాదగ్రస్తమైన పన్ను, సర్‌చార్జి లేక జరిమానాల యందు రెండు శాతము చొప్పున లెక్కింపబడి, కనీసము రూ.50/- మరియు గరిష్టము రూ. 1000/- లకు లోబడిన రుసుము.

(బి) ఇతర అన్ని సందర్భాలలో రూ. 50/- ల రుసుము చెల్లించబడినట్లు ఆధారముగా ట్రెజరీ రశీదుతో జతచేయబడవలెను.

(iv) అప్పీలు దాఖలు చేయబడిన సంబంధిత అసెస్‌మెంటు సంవత్సరమునకు సంబంధించి బాకీగా అంగీకరించబడ్డ పన్ను లేక అనుదానము చేయబడిన సదరు వాయిదాలు చెల్లింపబడినవి అని పేర్కొనుచు ఫారము 1-ఎ నందు ఒక డిక్లరేషనుతో అట్టి చెల్లింపులకు ఆధారముతో పాటుగా అట్టి ప్రతి అప్పీలు జతచేయబడవలెను.

(3) అప్పీలు, అప్పిలేట్ అథారిటీకి, అతని చేత ఇందు నిమిత్తము నియమింపబడిన అథారిటి లేక అధికారికి గాని అప్పీలుదారు చేతగాని లేక అతని ఆథరైజ్ చేయబడిన ఏజంటు, న్యాయవాది చేతగాని రిజష్టరు పోస్టు ద్వారా పంపబడవచ్చును, లేదా సమర్పింపబడవచ్చును.

4. అప్పీలేట్ అథారిటి అప్పీలుదారులకు తన వాదాన్ని వినిపించుకొనేందుకు హేతుబద్ధమైన అవకాశాన్ని ఇచ్చిన తరువాత 19 వ సెక్షను యొక్క (3) వ సబ్ సెక్షను నందు పొందుబరచబడినట్లు ఉత్తర్వులను పాస్ చేయవలెను.

**37.** ఒక అప్పీలు లేక రివిజను యందు నిర్ణయింపబడిన పన్ను మొదటి అసెసింగ్ అథారిటీ యొక్క అసెస్‌మెంటు అధికారాలను మించినట్లయితే, అప్పిలేటు లేక రివైజింగ్ అథారిటీ అసెస్‌మెంటు యొక్క అసలు రికార్డులను, తనచేత అసెస్‌చేయబడిన పన్నును వసూలు చేసే అధికారము కలిగియున్నట్టి సముచిత అసెసింగ్ అథారిటికి బదిలీ చేయవలెను.

**38.** (1) (i) 21వ సెక్షను క్రింద అప్పిలేటు ట్రిబ్యునలుకు చేసే ప్రతి అప్పీలు ఫారము -II నందుండవలెను మరియు దాని యందు నిర్దిష్ట పరచబడిన విధానమునందు పరిశీలించబడవలెను.

అట్టి ప్రతి అప్పీలు స్పష్టముగా అప్పీలు చేయుటకు గల ఆధారములను మరియు క్లెయిమ్ చేయబడిన సహాయమును పేర్కొన వలెను, మరియు

(ఎ) దాని యొక్క నాలుగు విడి నకళ్ళతో,

(బి) వ్యతిరేకంగా అప్పీలు చేయబడిన ఉత్తర్వుయొక్క నాలుగు నకళ్ళతో (వాటిలో ఒకటి అసలు లేదా అధికారిక నకలు అయివుండవలెను,) మరియు

(సి) అసెసింగ్ అథారిటీ యొక్క ఉత్తర్వు యొక్క మూడు నకళ్ళతో జతచేయబడవలెను.

(iii)(ఎ) పన్ను లేక జరిమానాల విధింపు వివాదగ్రస్తమైన సందర్భమునందు వివాదగ్రస్తమైన పన్ను లేక జరిమానాల యందు రెండు శాతము చొప్పున లెక్కింపబడి కనీసము 100/- మరియు గరిష్ఠము రూ. 2000/- లకు లోబడిన రుసుము, మరియు

(బి) ఇతర అన్ని సందర్భాలలో రూ. 100/- ల రుసుము

చెల్లించబడినట్లు ఆధారముగా ట్రెజరీ రశీదుతో కూడా అది జతచేయబడవలెను.

(2) 21 వ సెక్షను క్రింద అసెసీ చేతదాఖలు చేయబడిన అప్పీలును అప్పిలేటు ట్రిబ్యునలు అనుమతించినట్లయితే అది తన విచక్షణ ననుసరించి, ఉత్తర్వు పూర్వకముగా, 21వ సెక్షను యొక్క (3) వ సబ్ - సెక్షను క్రింద అసెసీ చేత చెల్లింపబడిన రుసుమును మొత్తమగా గానీ లేక అందలి భాగమును గానీ వాపసు చేయవచ్చును.

(3) 21వ సెక్షను క్రింద అప్పిలేటు ట్రిబ్యునలు చేత పాస్ చేయబడిన ప్రతి ఉత్తర్వు, 21 వ సెక్షను యొక్క(3) వ సబ్-సెక్షను నందు నిర్దిష్ట పర్చబడిన వారికి అదనముగా వాణిజ్య పన్నుల ఉపకమీషనరుకు మరియు అమ్మకపు పన్ను అప్పిలేటు ట్రిబ్యునలు ముందున్న రాష్ట్ర ప్రతినిధికి అందజేయబడవలెను.

**39.** 21వ సెక్షను క్రింద అమ్మకపు పన్ను అప్పిలేటు ట్రిబ్యునలు యొక్క ఉత్తర్వు డీలరుకు అందజేయబడిన తేదీ నుండి 90 రోజుల లోపు అతడు లేక రాష్ట్ర ప్రతినిధి, అప్పిలేటు ట్రిబ్యునలు ఏదయినా చట్టపరమైన ప్రశ్నను పొరపాటుగా నిర్ణయించెనన్న లేక నిర్ణయించుటలో విఫలమయ్యేనన్న ఆధారముపై ఆ ఉత్తర్వునకు వ్యతిరేకముగా 22వ సెక్షను క్రింద హైకోర్టుకు అర్జీనిదాఖలు చేయవచ్చును.

**40.** 22(1) సెక్షను క్రింద హైకోర్టుకు చేసే ప్రతి అర్జీ ఫారము – III నందుండవలెను మరియు దాని యందు నిర్దిష్ట పర్చబడిన విధానము నందు అది పరిశీలింపబడవలెను.

ఆ అర్జీ అప్పిలేటు ట్రిబ్యునలు యొక్క ఉత్తర్వు యొక్క ధృవీకరింపబడిన నకలుతో జతచేయబడవలెను మరియు అది డీలరు చేత దాఖలు చేయబడినపుడు రూ. 500/- ల రుసుముతో జతచేయబడవలెను.

## పట్టిక

| (1) | (2) |
|---|---|
| 1. సంయుక్త కమీషనరు, అప్పిలేటు ఉపకమీషనరులతోసహా ఉపకమీషనరులు, సహాయ కమీషనరులు, వాణిజ్య పన్నుల అధికారులు, ఉపవాణిజ్య పన్నుల అధికారులు మరియు సహాయ వాణిజ్య పన్నుల అధికారులు | వాణిజ్య పన్నుల కమీషనరు |
| 2. అప్పిలేటు ఉప కమీషనరులతో సహా ఉపకమీషనరులు, సహాయ కమీషనరులు, వాణిజ్య పన్నుల అధికారులు, ఉపవాణిజ్య పన్నుల అధికారులుమరియు సహాయ వాణిజ్య పన్నుల అధికారులు | సంయుక్త కమీషనరు (వాణిజ్య పన్నులు-లీగల్) |
| 3. సహాయ కమీషనరులు, వాణిజ్య పన్నుల అధికారులు, ఉపవాణిజ్య పన్నుల అధికారులు మరియు సహాయ వాణిజ్య పన్నుల అధికారులు | సంబంధిత డివిజను యొక్క (ఉపకమీషనరు వాణిజ్యపన్నులు |
| 4. ఉప వాణిజ్య పన్నుల అధికారులు మరియు సహాయ వాణిజ్య పన్నుల అధికారులు యొక్క వాణిజ్య పన్నుల | సంబంధిత ప్రదేశము యొక్క వాణిజ్య పన్నుల అధికారులు |

**44-ఎ.ఎ. 33**వ సెక్షను క్రింద వాపసు కొరకు ప్రతి క్లైము అసెసింగ్ అథారిటీకి ఫారము –XXIII నందు చేయబడవలెను మరియు అందు నిర్దిష్ఠపరచబడిన విధానము నందు పరిశీలింపబడవలెను.

**45.** (1) సంవత్సరమునకు రూ. 2 లక్షల కన్నా తక్కువ మొత్తము టర్నోవరు కలిగిన ప్రతి డీలరు సరియైన మరియు యదార్థమైన లెక్కను, భారత రాజ్యాంగము యొక్క ఎనిమిదవ షెడ్యూలు నందు నిర్దిష్ట పరచబడిన ఏ భాషయందైననూ లేక ఇంగ్లీషు భాష యందు సిరాతో సత్వరముగా -

(i) తన చేత ఉత్పత్తి చేయబడిన, తయారు చేయబడిన లేక కొనబడిన సరుకుల విలువను;

(ii) అమ్మకందారు చేత యథాక్రమముగా సంతకము చేయబడి మరియు తేదీ వేయబడి జారీ చేయబడిన బిల్లు లేక డెలివరీ నోటు ఆధారముగా సరుకులు ఎవరి నుండి తనచేత కొనుగోలు చేయబడినవో ఆ ప్రతివ్యక్తి యొక్క పేర్లు మరియు చిరునామాలను; మరియు

(iii) సరుకులు కొనబడక పోయినను డీలరు యొక్క వ్యాపార ప్రదేశము లేక గోదాములోనికి స్వీకరింపబడిన లేక అందు కనుగొనబడిన లేక అక్కడి నుండి జారీ చేయబడిన సందర్భమందు, అవసరమయిన ఓచర్లతో సమర్థింపబడిన యజమానుల పేర్లు మరియు చిరునామాలతో సరుకుల వర్ణనాత్మక మరియు పరిమాణాత్మక వివరములు మరియు అవి ఏ పరిస్థితులలో స్వీకరింపబడినవీ లేక ఉంచబడినవీ లేక జారీ చేయబడినవీ

చూపుతూ నిర్వహించు చుండవలెను.

(1-ఎ) (ఎ) సంవత్సరమునకు రు. 2 లక్షలకు తగ్గని మొత్తము టర్నోవరు కలిగిన ప్రతి డీలరు సరియైన మరియు యదార్థమైన లెక్కను, భారత రాజ్యాంగమొయొక్క ఎనిమిదవ షెడ్యూలు నందు నిర్దిష్ట పరచబడిన ఏ భాషయందైనను లేక ఇంగ్లీషు భాష యందు సిరాతో సత్వరముగా -

(i) తన చేత ఉత్పత్తి చేయబడిన, తయారు చేయబడిన, కొనబడిన మరియు అమ్మబడిన సరుకుల విలువ;

(సి) ప్లానింగు,-డిజైనింగు కొరకు ఖర్చులు మరియు ఆర్కిటెక్ట్ యొక్క ఫీజులు;

(డి) వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణము నందు ఉపయోగించబడిన యంత్రసామాగ్రి మరియు పనిముట్లను అద్దెకు లేదా ఇతర విధముగా పొందుటకు అయిన ఖర్చులు;

(ఇ) ఈ వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణమునందు ఉపయోగించబడిన నీరు, విద్యుత్, ఇంధనము వగైరా వంటి వినియోగవస్తువుల, వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణక్రమము నందు ఆస్తి బదిలీ ఉండరాదు, ఖర్చు;

(ఎఫ్) కూలి మరియు సేవల సరఫరా మేరకు సంబంధము గల కాంట్రాక్టరు యొక్క ఎస్టాబ్లిష్మెంటు ఖర్చు;

(జి) కూలి మరియు సేవల సరఫరాకు సంబంధించి ఇతర అనురూప ఖర్చులు;

(హెచ్) కూలి మరియు సేవల సరఫరాకు సంబంధించిన మేరకు వరకు కాంట్రాక్టరు చేత సంపాదించబడిన లాభము;

(ఐ) వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణమునందు సెక్షను 9(1) క్రింద నోటిఫికేషన్ ద్వారా మినహాయింపబడిన సరుకులు బదిలీ చేయబడిన అన్ని మొత్తములు.

(జె) వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణమునందు మూడవ షెడ్యూలు నందు నిర్దిష్ట పరచబడిన సరుకులు బదిలీ అయిన అన్ని మొత్తములు.

(కె) వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణనందు నాలుగవ షెడ్యూలు నందు నిర్దిష్టపరచబడిన సరుకులు బదిలీ అయిన అన్ని మొత్తములు.

(యల్) కేంద్ర అమ్మకపు పన్ను చట్టము, 1956 యొక్క 5వ సెక్షను క్రింద ఎగుమతి లేక దిగుమతి క్రమమునందు బదిలీ చేయబడిన లేదా నాలుగవ సెక్షను క్రింద రాష్ట్రము వెలుపల బదిలీ చేయబడిన లేదా 3వ సెక్షను క్రింద అంతర్రాష్ట్ర వర్తకము లేక వాణిజ్య క్రమమునందు బదిలీ చేయబడిన వర్క్స్ కాంట్రాక్టు యొక్క నిర్వహణము నందు ప్రమేయమైన సరుకుల టర్నోవరు;

వివరములు చూపుచూ ప్రత్యేక లెక్కలను నిర్వహించవలెను.

(2) (ఎ) సంవత్సరమునంద ఒక లక్ష రూపాయలకు తగ్గని మొత్తము టర్నోవరు గల ప్రతి డీలరు వంద రూపాయలకు తగ్గని మొత్తము ప్రమేయమయిన ప్రతి అమ్మకము విషయములో మరియు వంద రూపాయల కంటే తక్కువ మొత్తము ప్రమేయమైన అమ్మకపు సందర్భమునందు కొనుగోలు దారుని చేత డిమాండు చేయబడినపుడు నగదు రశీదు లేక బిల్లును ఫారము - XIX నందు జారీచేయవలెను.

(బి) ఆ విధముగా జారీ చేయబడిన ప్రతిబిల్లు లేక నగదు రశీదు డీలరు చేత లేక అతని మేనేజరు లేక ఏజెంటు చేత యథాక్రమముగా సంతకం చేయబడవలెను మరియు తేదీ వేయబడవలెను మరియు సదరు బిల్లు లేక నగదు రవీదు యొక్క కౌంటరు ఫాయిలు కూడా పైన చెప్పబడిన విధముగా సంతకం చేయబడి మరియు తేదీ వేయబడి డీలరుచేత ఉంచబడవలెను.

(సి) ఏ డీలరయిననూ కంప్యూటరైజ్డు బిల్లు లేక నగదు రశీదులను జారీ చేయునపుడు సదరు బిల్లు లేక నగదు రశీదు నమూనా తగినట్లుగా డీలరు చేత మార్పుచేయబడవచ్చును. కాని అది ఫారము – XIX నందు ప్రెస్క్రైబ్ చేయబడిన అన్ని వివరములను కలిగి ఉండవలెను.

**ఫారము - XIX**

(ii) అయితే - రాష్ట్రము వెలుపల నున్న ప్రదేశాల నుంచి రాష్ట్రములోనికి దిగుమతి అయ్యే సరుకుల సందర్భమునందు ఆ సరుకులు తమ ప్రయాణము నారంభించిన రాష్ట్రము యొక్క రహదారి పత్రము, వాణిజ్య పన్నుల కమీషనరు చేత ఆమోదింపబడినట్టి సదరు నమూనా యందున్న అధికారపత్రము లేక అమ్మకపు ఇన్వాయిస్ లేక డెలివరీ నోటుతో జత చేయబడినట్లయితే అంగీకరింపబడవలెను.

(ii) (i)వ క్లాజు ప్రయోజనార్థము వాణిజ్య పన్నుల కమీషనరు చేత ఇందు నిమిత్తము నోటిఫై చేయబడిన ప్రదేశములందు మరియు రాష్ట్రము వెలుపలి నుండి రవాణా చేయబడిన సరుకులు పాసయ్యే మొదటి చెక్‌పోస్టుల సందర్భమునందు, రాష్ట్ర ప్రభుత్వం యొక్క లేక వాణిజ్య పన్నుల కమీషనరు యొక్క అథారిటీ క్రింద ముద్రింపబడిన రహదారి పత్రములు మాత్రమే వాడబడవలెను. ముద్రింపబడిన రహదారి పత్రములను, స్థానీయేతర డీలరు సందర్భము నందు రవాణా స్వీకర్త వద్ద నుండి లేక స్థానీయేతర డీలరు చేత రవాణా చేయబడిన సరుకులు పాసయ్యే ప్రథమ చెక్‌పోస్టు ఇన్‌చార్జి అధికారి నుండి మరియు స్థానీయుడైన డీలరు సందర్భమునందు వాటి ధర చెల్లింపుపై సంబంధిత రిజిస్టరు చేయు అథారిటి నుండి పొందవచ్చును.

అయితే - రాష్ట్ర ప్రభుత్వము లేక వాణిజ్య పన్నుల కమీషనరు అథారిటీ క్రింద ముద్రింపబడిన రహదారి పత్రములు వాడకం నిమిత్తము ఏ కారణము వల్లనయినా సంసిద్ధముగా లభ్యం కానప్పుడు అట్లు ముద్రింపబడిన రహదారి పత్రములకు బదులుగా రవాణాదారుపై అధికార పరిధిగల అసెసింగ్ అథారిటి లేక రిజిస్టరు చేయు అథారిటీ యొక్క సంతకము మరియు కార్యాలయపు ముద్రను కలిగియున్నట్టి రహదారి పత్రములు వాడబడవలెను.

అయితే - చట్టము యొక్క నాలుగవ షెడ్యూలు నందు నిర్దిష్టపర్చబడిన

5. ప్రత్తి వస్త్రములు, మానవ తయారీ వస్త్రములు మరియు ఉన్ని వస్త్రములు;

6. పంచదార;

7. పొగాకు; మరియు

7-ఎ. కారా మసాలా, కిమామ్, దోక్తా, జర్దా, సుఖా మరియు సూర్తిగా పేరొందిన తయారీలతో కలిపి నమలబడే పొగాకు.

అంశములకన్నా భిన్నమైన సరుకులు, వాణిజ్య పన్నుల కమీషనరు లేక రాష్ట్ర ప్రభుత్వము అథారిటీ క్రింద ముద్రింపబడిన రహదారి పత్రములతో జతచేయబడనవసరము లేదు.

(iii) సరుకులు వాహనము లేక పడవ యొక్క యజమాని లేక ఇన్‌చార్జి అయిన ఇతర వ్యక్తి రహదారి పత్రము యొక్క అసలు మరియు రెండవ ప్రతులను తీసికొని పోవలెను మరియు తన మార్గములో సరుకుల వాహనము లేక పడవ దేని ద్వారా పాస్ అగునో ఆ మొదటి చెక్‌పోస్టు ఇన్‌చార్జి అధికారికి రహదారిపత్రము యొక్క అసలు ప్రతిని సమర్పించవలెను.

అయితే - వాహనము లేక పడవ, చెక్‌పోస్టు లేక అవరోధము గుండా పాస్ కానప్పుడు లేదా సహాయ వాణిజ్య పన్నుల అధికారి స్థాయికి తగ్గని వాణిజ్య పన్నుల శాఖ యొక్క ఏ ఇతర అధికారి చేతను సోదా చేయబడనప్పుడు డీలరు సరుకులను స్వీకరించిన తరువాత హేతుబద్ధమైన సమయములోపల తన అసెసింగ్ అథారిటీకి, అందున్న వివరములు తన లెక్కలందు ఎంటర్ చేయబడినవని ధృవీకరిస్తూ అసలు ప్రతిని సమర్పించవలెను.

(iv) క్లాజు (ii) క్రింద రహదారి పత్రాలను పొందుతున్న ప్రతివ్యక్తి తన చేత పొందబడిన, వాడబడిన మరియు

(8) డీలర్లు మరియు లైసెన్సు దారులచేత నిల్వలు, ఉత్పత్తి, కొనుగోళ్ళు, బట్వాడాలు మరియు అమ్మకాలకు సంబంధించి అన్ని ఓచర్లతో కలిసి నిర్వహించబడిన లెక్కలు, అవి దేనికి సంబంధించునో ఆ సంవత్సర సమాప్తి నుండి ఆరు సంవత్సరాల వ్యవధి వరకు వారిచేత పరిరక్షింప బడవలెను.

అయితే - అసెస్‌మెంటుకు సంబంధించి అప్పీలు లేక రివిజను లేక ఏ ఇతర ప్రొసీడింగు అయిననూ సంభవించినపుడు అట్టి అసెస్‌మెంటుకు సంబంధించిన పై చెప్పబడిన అన్ని ఓచర్లతో కలసి లెక్కలు, ఆ అసెస్‌మెంటు అంతిమమైన తర్వాత నాలుగు సంవత్సరాల కాలవ్యవధి వరకు పరిరక్షింపబడవలెను.

**45-ఎ** (1) (ఎ) చట్టము యొక్క 12(3) సెక్షను క్రింద బియ్యపు మిల్లరుగా రిజిస్టరయిన వానికంటె ఇతరమైన ప్రతి బియ్యపు మిల్లరు ఈ క్రింది రిజిస్టరులను నిర్వహించవలెను.

(i) ఫారము - XV నందు మిల్లు యొక్క వర్కింగ్ రిజిస్టరు.

**ఫారము - XV**

(ii) ఫారము - XVI నందు అద్దెకు మర వేయబడిన ధాన్యపు రోజువారి లెక్క, మరియు

**ఫారము - XVI**

(iii) ఫారము - XVII నందు నిల్వల రిజిస్టరు

**ఫారము - XVII**

(బి) అట్టి ప్రతి మిల్లరు తనకు బియ్యముగా మార్చేందుకు ధాన్యమును అప్పగించు ప్రతి వ్యక్తి నుండి ఫారము– XVIII నందు ఒక డిక్లరేషనును పొదవలెను. అట్లు పొందబడిన డిక్లరేషన్లు క్రమసంఖ్యను కలిగియుండవలెను మరియు ప్రతి సంవత్సరమునకు ఉంచబడవలెను.

**ఫారము - XVIII**

(2) ఈ చట్టము యొక్క 12(3) సెక్షను క్రింద రిజిస్టరయిన ప్రతి బియ్యపు మిల్లరు ఫారము - XVI నందు అద్దెకు మరవేయబడిన ధాన్యపు రోజువారీ లెక్కను నిర్వహించవలెను. తనకు బియ్యంగా మార్చేందుకు ధాన్యమును అప్పగించు ప్రతి వ్యక్తి నుంచి ఫారము - XVII నందు డిక్లరేషనును అతడు పొందవలెను. అట్లు పొందబడిన డిక్లరేషన్లు క్రమసంఖ్యను కలిగియుండవలెను మరియు ప్రతి సంవత్సరమునకు ఉంచబడవలెను.

(3) తొలగించబడినది.

**45-బి** తొలగించబడినది.

**45-సి** తొలగించబడినది.

**45-డి** తొలగించబడినది.

**45-ఇ.**(1) ఈ రూల్సుయందు విరుద్ధముగా ఏమున్నప్పటికీ, మోటారు స్పిరిటులందు వ్యాపారమును కొనసాగించుచున్న ప్రతి డీలరు, మోటారు స్పిరిటు నందు రోజువారీ వ్యవహారముల యదార్థమైన, సరియైన మరియు ఆ రోజు వరకు

లేదా ఆ సరుకులు కొనుగోలు పన్నుకు బాధ్యమయ్యేటట్లయితే రవాణా స్వీకర్త దరఖాస్తు పై (2) వ సబ్ - రూలు క్రింద చెల్లించబడిన మొత్తమును అతని నుండి బాకీ అయిన పన్నుకు సర్దుబాటు చేయుట గానీ లేదా అతడు పన్నుకు బాధ్యుడు కాడని కనుగొనబడినట్లయితే వాపసు చేయుటగానీ చేయవలెను.

(బి) రవాణా దారు లేక రవాణా స్వీకర్త, సందర్భానుసారముగా ఎవరయితే వారు, తన నుంచి బాకీ అయిన పన్నుకు ఆ మొత్తమును సర్దుబాటు చేయవలెనని కోరుకున్నట్లయితే ఈ రూల్సు క్రింద తాను పంపవలసిన రిటర్నుతోపాటు దరఖాస్తు మరియు చెల్లింపు కొరకు రశీదును పంపవలెను మరియు అతడు ఆ మొత్తము యొక్క వాపసును క్లెయిమ్ చేయవలెనని కోరుకున్నట్లయితే, ఆ మొత్తము చెల్లింపబడిన తేదీ నుండి 30 రోజుల లోపల, అసెసీ సందర్భమునందు ప్రధాన వ్యాపార ప్రదేశముపై అధికార పరిధి గల అసెసింగ్ అథారిటికి లేదా ఇతరుల సందర్భమునందు తన నివాస ప్రదేశంపై అధికార పరిధిగల ఉపవాణిజ్య పన్నుల అధికారికి దరఖాస్తు చేయవలెను.

(5) సదరు అధికారి, 29వ సెక్షను యొక్క (6) వ సబ్ - సెక్షను క్రింద ఆ సరుకులను నిర్బంధించుటకు నిర్ణయించినట్లయితే, నిర్బంధించబడిన సరుకుల వర్ణనము, పరిమాణము మరియు విలువలను మరియు అట్టి నిర్బంధమునకు కారణములను నిర్దిష్టపరచుచూ ఒక ఉత్తర్వును అతడు పాస్ చేయవలెను. ఆ ఉత్తర్వు యొక్క నకలు సరుకుల యజమానికి మరియు ఆ తావునందు అతడు హాజరుగా లేనట్లయితే, ఆ సరకుల వాహనము లేక పడవ యొక్క డ్రైవరు లేక ఇన్‌చార్జి అయిన ఏ ఇతర వ్యక్తికైననూ, సందర్భానుసారముగా ఎవరైతే వారికి, అందచేయబడవలెను.

(6) 29వ సెక్షను యొక్క (6) వ సబ్ - సెక్షను నందు నిర్దేశితమైన తరువాతి ఉన్నత అథారిటి, చెక్‌పోస్టు లేక అవరోధం, సందర్భానసారముగా ఏదయితే అది, పై అధికార పరిధి గల వాణిజ్య పన్నుల అధికారి అయి ఉండును.

(7) 29వ సెక్షను యొక్క (6) వ సబ్ - సెక్షను క్రింద నిర్బంధించబడిన సరుకులకు 30 రోజుల లోపల ఎట్టి క్లెయిమ్ చేయబడనపుడు సదరు అధికారి ఆ చెక్‌పోస్టు లేక అవరోధముపై, సందర్భానుసారముగా ఏదయితే అది, అధికార పరిధి కల ఉపవాణిజ్య పన్నుల అధికారికి ఆ సరుకులను బదిలీ చేయవలెను.

(8) (7) వ సబ్-రూలునందు నిర్దిష్ట పర్చబడిన ఉపవాణిజ్య పన్నుల అధికారి, నిర్బంధించబడిన మరియు అమ్మకం నిమిత్తమైన సరుకుల జాబితాను, నిర్బంధించబడిన సరుకులు బహిరంగ వేలము నందు ఏ ప్రదేశమున, ఏ తేదీన మరియు ఏ సమయమున అమ్మబడునో నిర్దిష్టపరచుచూ తన సంతకముతో జారీ అయిన నోటీసుతో తన కార్యాలయపు నోటీసు బోర్డు నందు ప్రకటించుటకు చర్య తీసుకొనవలెను మరియు ఇట్టి జాబితా మరియు నోటీసు యొక్క నకళ్ళను, ఆ సరుకులు ఎచట నిర్బంధించబడినవో ఆ చెక్‌పోస్టు లేక అవరోధము వద్ద మరియు ఆ సరుకులు ఎచ్చట నిర్బంధించబడినవో ఆ చెక్‌పోస్టు లేక అవరోధముపై అధికారపరిధి గల వాణిజ్య పన్నుల అధికారి కార్యాలయము నందు ప్రదర్శింపవలెను.

(9) వేలము నిర్వహింపబడుటకు ముంద 15 రోజుల నోటీసు ఇవ్వబడవలెను.

(10) ఉద్దేశ్యము గల వేలం పాటదారులు సరుకుల యొక్క అంచనా వేయబడిన విలువలో 5 శాతమునకు సమానమయిన మొత్తమును బయానా సొమ్ముగా డిపాజిట్ చేయవలెను.

(11) నియమిత సమయమున, అమ్మకపు వేలమును నిర్వహిస్తున్న అధికారి అవసరమని పరిగణించునట్లు ఒకటి లేక ఎక్కువ లాటులందు ఆ సరుకులు అమర్చబడవలెను మరియు వేలం వేయబడిన సరుకుల విలువ రూ. 1000/- కు మించనపుడు ఆ సరుకులు ఎచట నిర్బంధించబడినవో ఆ చెక్‌పోస్టు లేక అవరోధముపై అధికార పరిధి గల వాణిజ్య పన్నుల అధికారి చేత మరియు ఇతర సందర్భములందు ఉపకమీషనరు చేత అమ్మకము ఖాయము

ప్రతులను తీసుకుపోవలెను మరియు అసలు ప్రతిని తాను రాష్ట్రము నుండి నిష్క్రమించుటకు ముందు వచ్చు ఆఖరి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారికి సమర్పించవలెను.

(4) వాహనము యొక్క డ్రైవరు లేక ఇన్‌చార్జి అయిన వ్యక్తి రాష్ట్రము వెలుపలకు తీసుకుపోబడుతున్న సరుకులు ట్రాన్సిట్ పాసును పొందినట్టి సరుకులేయని నిర్ధారించుకొను నిమిత్తము అధికార పత్రములు, ట్రాన్సిట్ పాసు మరియు సరుకులను తనిఖీచేయుట కొరకు వాహనమును ఆపవలెను మరియు ఆఖరి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారిని అనుమతించవలెను.

(5) అట్టి తనిఖీపై, రవాణాయందున్న సరుకులు ట్రాన్సిట్ పాసునందు పేర్కొనబడిన అవే సరుకులు (పరిమాణము మరియు వర్ణన రెండింటి దృష్ట్యా) అని ఆఖరి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారి సంతృప్తి చెందినపుడు అతడు ట్రాన్సిట్ పాసు యొక్క రెండవ ప్రతి యందు తన సంతకము క్రింద చెక్‌పోస్టు యొక్క ముద్రను వేయవలెను మరియు ఆ వాహనమును ఇతర రాష్ట్రములోనికి పాస్ అగుటకు అనుమతించవలెను.

(6) అట్టి తనిఖీపై, రవాణా యందున్న సరుకుల పరిమాణము ట్రాన్సిట్ పాసునందు పేర్కొనబడిన పరిమాణము కంటే తక్కువగా ఉన్నట్టు లేదా సరుకుల వర్ణన ట్రాన్సిట్ పాసు నందు పేర్కొనబడిన వర్ణన కంటే భిన్నముగా ఉన్నట్లుగా అన్పించినట్లయితే, అట్టి చివరి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారి ఆ పరిధి మేరకు సరుకులు సరుకుల వాహనము యొక్క యజమాని లేక ఇన్‌చార్జి అయిన వ్యక్తి చేత రాష్ట్రమునందు అమ్మబడినవని సంభావించవలెను మరియు సరుకుల వాహనము యొక్క యజమానిని 15-ఎ సెక్షను క్రింద తదనుసారముగా అసెస్ చేయవలెను. ఆ వాహనమును తాను హేతుబద్ధముగా అవసరమని భావించునంత సేపు నిర్బంధించుటకు సదరు అధికారికి అధికారము కలదు.

(7) (6)వ సబ్-సెక్షను నందు నిర్దేశితమైన స్వభావం కల అధికారములు శాఖయొక్క సహాయ వాణిజ్య పన్నుల అధికారి స్థాయికి తగ్గని అధికారి చేత వినియోగింపబడవచ్చును. అతడు, ఏమయినప్పటికీ, అసెస్‌మెంటు చేయవలెనని ప్రతిపాదించు చున్నట్లయితే, సదరు తనిఖీ తరువాత ఏడు రోజులలోపల మొదటి చెక్‌పోస్టు యొక్క ఇన్‌చార్జి అధికారికి తెలియచేయవలెను.

(8) ఆఖరి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారి చేత అట్లు స్వీకరించబడిన ట్రాన్సిట్ పాసుయొక్క అసలు ప్రతి అతని చేత రిజిస్టర్డు పోస్టుద్వారా మొదటి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్‌చార్జి అధికారికి సరుకుల వాహనము యొక్క డ్రైవరు లేక ఇన్‌చార్జి అయిన ఇతర వ్యక్తి నుండి స్వీకరించిన తేదీనుండి పదిరోజుల లోపల పంపబడవలెను. (6)వ సబ్-రూలు క్రింద తీసుకొనబడిన చర్య కూడా సదరు సమయము లోపల తెలియజేయబడవలెను.

(9) తనచేత జారీ చేయబడిన తర్వాత ముప్పది రోజుల లోపల ట్రాన్సిట్ పాసు యొక్క అసలు ప్రతిని స్వీకరించలేక పోయినట్లయితే మొదటి చెక్‌పోస్టు లేక అవరోధము యొక్క ఇన్-చార్జి అధికారి చట్టము యొక్క 29-బి సెక్షనుతో చదువదగిన 15-ఎ సెక్షను క్రింద సరుకుల వాహనము యొక్క యజమానిని అసెస్ చేయు, మొదటి చెక్‌పోస్టు లేక అవరోధముపై అధికార పరిధి కల వాణిజ్యపన్నుల అధికారికి ఒక రిపోర్టును పంపవలెను.

**47.** (1) చెక్‌పోస్టు లేక అవరోధాల కన్నా భిన్నమైన ఏ ప్రదేశము నందయిననూ శాఖ యొక్క సహాయ వాణిజ్య పన్నుల అధికారి స్థాయికి తగ్గని ఏ అధికారి చేత నయిననూ, డిమాండుపై, సరుకుల వాహనము లేక పడవ యొక్క, సందర్భానుసారముగా ఏదయితే అది, డ్రైవరు లేక ఇన్‌చార్జి అయిన ఏ ఇతర వ్యక్తి అయిననూ హేతుబద్ధంగా అవసరమయినంత సేపు

* సి చేత కొనుగోలు సమయము నందు చెల్లించబడిన పన్ను ఈ అంకె నందు చేరదు.

విశదీకరణము : పన్ను కొరకు 'సి' రూ. 520/- వసూలు చేయవచ్చును మరియు దాని నుండి కొనుగోలు సమయంలో పన్నుగా తన చేత చెల్లించబడిన రూ. 496/- ను తగ్గించవచ్చు మరియు మిగిలిన మొత్తమైన రూ. 24/- ను పన్నుగా శాఖవారికి చెల్లించవలెను.

ప్రథమ అమ్మకపు స్థానము వద్ద డీలరు చేత వసూలు చేయబడిన పన్నును విడిగా చూపించుట యందు ఎట్టి కష్టము ఉండదు. రెండవ మరియు తదుపరి అమ్మకము యందు ఏక అమ్మకపు స్థానము వద్ద పన్నుకు బాధ్యమయ్యే సరుకులకి సంబంధించి రెండవ అమ్మకపు దారుచేత కొనుగోలు సమయము నందు చెల్లించబడిన పన్ను అమ్మకపు బిల్లు నందు చూపించాల్సి ఉంటుంది. ఏక స్థాన పన్నుల విధానము నందు పన్ను ప్రథమ అమ్మకపు స్థానము నందు మాత్రమే విధించబడుతుంది. మరియు ఆ పన్ను మొత్తమే రెండవ లేక తదనంతర అమ్మకపు స్థానముల యందు ఆ వస్తువుపై వసూలు చేయబడుతుంది. పన్ను మొత్తము మారదు కాబట్టి రెండవ మరియు తదనంతర అమ్మకపు దారునకు కొనుగోలు దారు నుండి అమ్మకపు దారు చేత వసూలు చేయబడిన పన్నుని విడిగా చూపించుట యందు ఎలాంటి కష్టము ఉండదు. ఉదాహరణకు ఆంధ్ర ప్రదేశ్ నందు ఎ నుండి 100 సబ్బులకు విలువగా 1000 రూ.లను మరియు పన్ను కొరకు 100 రూ. లను చెల్లించుట ద్వారా బి కొనుగోలు చేశాడు. న్ను రేటు 10% ఒక సబ్బుకు చెల్లించబడిన పన్ను 1 రూ. బి 50 సబ్బులను ప్రతి సబ్బు 11 రూ. చొప్పున అమ్మినట్లయితే అతను సరుకుల విలువను 550 రూ.గా మరియు పన్ను 50 రూ. గా (1 సబ్బునకు 1 రూ. రేటు చొప్పున) విడిగా చూపవలెను. (మాదిరి ఇన్వాయిస్ అనుబంధం డి నందు ఇవ్వబడినది) అదే విధముగా తదనంతర అమ్మకపు దారులు కూడా సరుకుల విలువను మరియు పన్నును విడిగా చూపించాలి.

**అనుబంధము - డి (వ్యాట్ సరుకుల)**

**బిల్లు / నగదు రశీదు**

బిల్లు సంఖ్య :

తేది :

అమ్మకం చేయుచున్న డీలరు పేరు మరియు చిరునామా : బి & కో, హైద్రాబాదు.

రిజిస్ట్రేషను ధృవ పత్రము సంఖ్య :

లైసెన్సు సంఖ్య :

(ఏ ఇతర చట్టము క్రిందనైనా ప్రెస్క్రైబ్ చేయబడినట్లయితే)

కొనుగోలు చేయబడుచున్న డీలరుపేరు మరియు చిరునామా : సి & కొ, హైద్రాబాదు.

సింగిల్ పాయింట్ వస్తువులకు రెండవ అమ్మకపు స్థానము వద్ద జారీచేయబడిన ఇన్వాయిస్.

| వరుస సంఖ్య | సరుకుల వర్ణన | యూనిట్లు | యూనిట్‌కు ధర | విలువ | పన్ను @ 16% | వెరసి మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1. | సబ్బులు | 50 | 11/- | * 550/- | * *50/- | 600/- |
| | | | | | మొత్తము: | 600/- |

మరియు పప్పు ధాన్యములు. 5. రవ్వ, మైదా, గోధుమ పిండి మరియు గోధుమ 6. విద్యుత్ వస్తువులు. 7. మోటారు భాగములు 8. మద్యములు 9. ఇనుము మరియు ఉక్కు మరియు ఇనుప కాస్టింగులు. 10. బెల్లము. 11. ప్రత్తి. 12. జీడిపప్పు 13. మిరపకాయలు 14. పసుపు 15. తోళ్ళు మరియు చర్మములు 16. చింతపండు 17. బీడీ ఆకులు 18. ధనియాలు 19. అలంకరణ సామాగ్రి 20. ఇంజిన్ ఆయిల్సు, ల్యూబ్రికేటింగ్ ఆయిల్స్ 21. ఫైర్ వర్క్స్ 22. మార్బుల్ మరియు మార్బుల్ వస్తువులు.

## సెక్షను 14-డి (స్వయం అసెస్మెంటు) :

14-డి సెక్షను క్రింద, 25 లక్షల రూపాయిల కన్నా తక్కువ టర్నోవరు గల డీలరు టర్నోవరు యొక్క స్వయం అసెస్మెంటుకు హక్కు దారుడు మరియు సంవత్సరం యొక్క ముగింపు నుండి 30 రోజుల లోపు ఒక రిటర్నుని దాఖలు చేయవలెను. క్యాజువల్ ట్రేడరు లేదా 14-సి సెక్షను క్రింద పన్ను చెల్లింపును ఎంపిక చేసుకొన్న డీలరు లేదా స్థానికేతర డీలరు యొక్క ఏజెంటు చేత ఈ సెక్షను క్రింద స్వయం అసెస్మెంటు యొక్క సౌకర్యము ఉపయోగించుకొనలేడు.

17 లేక 15వ రూలు క్రింద, సందర్భానుసారముగా ఏదయితే అది, దాఖలు చేయబడవలసిన ఎ2 లేక ఎ1 రిటర్నులకు అదనముగా ఈ సెక్షను క్రింద ఒక రిటర్నుని డీలరు దాఖలు చేయవలెను.

క్రొత్తగా రిజిస్టరు అయిన డీలర్లు రిజిస్ట్రేషను తేదీ నుండి 3 సంవత్సరముల వరకు స్వయం అసెస్ మెంటు కొరకు రిటర్నును దాఖలు చేయుటకు అర్హులు కారు.

స్వయం అసెస్మెంటు కొరకు డీలరు చేత దాఖలు చేయబడిన రిటర్ను ఈ క్రింది సందర్భాలలో అంగీకరించబడదు.

ఎ) డీలరుచేత దాఖలు చేయబడిన రిటర్ను సరి అయినది లేక సమగ్రమయినది కానపుడు లేదా దానిపై బాకీ అయిన పన్ను పూర్తిగా చెల్లించబడనట్లయితే,

బి) ఆ సంవత్సరము నందలి నికర టర్నోవరు నందు పెరుగుదల తత్పూర్వ సంవత్సరముతో పోల్చినపుడు 25% కన్నా తక్కువ అయినట్లయితే.

సి) తత్పూర్వ 3 సంవత్సరముల యందు దేని యందైనా డీలరు యొక్క టర్నోవరు 25 లక్షల రూపాయిలు మించినట్లయితే,

డి) దాఖలు చేయబడిన రిటర్నుల యందు టర్నోవరు యొక్క భాగము లేక మొత్తాన్ని డీలరు అణచి పెట్టినట్లుగా వ్యాపార ప్రదేశముల యొక్క తనిఖీ ద్వారా గమనించబడినట్లయితే.

ఇ) తప్పుకున్న అసెస్మెంటు లేక జరిమానా విధింపు కొరకు ఏవయినా ప్రొసీడింగులు ఏడీలరు పైనైనా పెండింగులో నున్నప్పుడు.

ఎఫ్) వే బిల్లులు, "సి" ఫారములు, "ఎఫ్" ఫారములు "హెచ్" ఫారములు మరియు "జి" ఫారముల వంటి చట్టబద్ధ ఫారములు వాడకము యొక్క వివరములను సమకూర్చుట యందు డీలరు విఫలమయినపుడు ఇతర తరగతుల కేసుల యందు కూడా అసెసింగ్ అథారిటీల పరిశీలన కొరకు అవసరమని భావించు అట్టి కేసులను పూర్తి స్థాయి అసెస్మెంటు కొరకు చేపట్టవచ్చును. కాని పరిశీలన కొరకు కేసులను ఎంపిక చేయునపుడు అసెసింగ్ అథారిటీ ఈ క్రింది కారణముల విమర్శనాత్మక పరిశీలన చేయాలి.

షెడ్యూళ్ళలో ప్రధానంగా వచ్చిన మార్పు ఏమిటంటే దాదాపు 19 వస్తువులను మొదటి షెడ్యూలు నుండి తొలగించి ఆరవ షెడ్యూలు నందు చేర్చారు. ఈ ఆరవ షెడ్యూలు నందు చేర్చబడిన వస్తువులు మాత్రమే వ్యాట్ పరిధిలోనికి వస్తాయి.

ఈ క్రింద ఇవ్వబడిన పట్టిక యందు 1995 వ సంవత్సరంలో 22వ చట్టము ద్వారా ఆరవ షెడ్యూలులో చేర్చబడిన వస్తువులు ఇంతకు ముందు మొదటి షెడ్యూలులో ఎన్నవ అంశముగా ఉండేది తెలియచేయబడినది.

| ఆరవ షెడ్యూలులో అంశము సంఖ్య | మొదటి షెడ్యూలులో అంశము సంఖ్య | ఆరవ షెడ్యూలులో అంశము సంఖ్య | మొదటి షెడ్యూలులో అంశము సంఖ్య |
|---|---|---|---|
| 2 | 5 | 11 | 63 |
| 3 | 6 | 11-ఎ | 145 |
| 4 | 7 | 12 | 101 |
| 4-ఎ | 51 | 13 | 102 |
| (ఫర్నిచర్) | (అప్‌హోల్‌స్టర్‌డ్ ఫర్నిచరు) | 13-ఎ | 102-ఎ |
| 5 | 16 | 14 | 140 |
| 5-ఎ | 81 | 14-ఎ | లేదు |
| 5-బి | 87 | (క్రొత్తగా చేర్చారు) | |
| 6 | 38(i),(iv) | 15 | 104 |
| 7 | 41 | 16 | 105(ఎ) |
| 8 | 45 | 17 | 114 |
| 9 | మొదటి షెడ్యూలు యొక్క | 18 | 123 |
| | (iv) వ వివరణము | 19 | 143 |
| 10. | 54 | 20 | 163 |

3. దరఖాస్తుతో పాటు ఫారము "ఎ" నందు అంచనా టర్నోవరును" సూచించాలి.

4. దరఖాస్తు నందు పేర్కొన్న సమాచారానికంతటికీ ఆధారాలను (ఎవిడెన్సులు) సమకూర్చాలి.

5. అంచనా టర్నోవరును అనుసరించిగాని, తన విచారణపై గాని ఆర్.సి. జారీ చేసేందుకు సెక్యూరిటీ డిపాజిట్టుగా కోరిన ధనాన్ని డిపాజిట్టు రూపంగా సమకూర్చాలి.

**డీలర్ల బాధ్యతలు**

1. ప్రతి సంవత్సరం ఆరంభమైన 30 రోజులలోపు రిజిస్ట్రేషను రుసుమును ప్రధాన వ్యాపార ప్రదేశానికి 100 రూ. చొప్పున ఇతర ప్రదేశాలకు 20. రూ. చొప్పున పునర్నవం (రెన్యువల్) చేసేందుకు విధిగా చెల్లించాలి.

2. ఆర్.సి.ని విధిగా వ్యాపార ప్రదేశంలో సువ్యక్తమైన తావులో (కాన్స్పిక్యువస్ ప్లేస్) ప్రదర్శించాలి.

3. ఫరము నందు భాగస్వాముల మార్పులు, చేర్పులు, ఏ కారణం వల్ల జరిగినా క్రొత్త రిజిస్ట్రేషను ధృవ పత్రం కోసం దరఖాస్తు చేసి, పొందాలి.

4. ఆర్.సి. పోయినట్లైతే 10 రూపాయల రుసుమును చెల్లించి రెండవ ప్రతిని (డూప్లికేట్) పొందాలి.

5. ఆర్.సి. లేనట్టి ప్రదేశంలో సరుకులను దాచటం, వ్యాపార వ్యవహారాల్ని నిర్వహించడం చేయరాదు.

6. చట్టపరమైన అన్ని నిబంధనలను విధిగా పాటించి తీరాలి.

7. ఏదయినా వ్యాపార ప్రదేశమును మార్చినట్లయితే తక్షణమే లెటరు ద్వారా రిజిస్టరింగు అథారిటీకి తెలియచేయాలి.

8. ఫరమ్ నందు ఎట్టి మార్పులు సంభవించినా ఫారము-డి నందు దరఖాస్తు చేసి క్రొత్త రిజిస్ట్రేషను ధృవపత్రాన్ని పొందాలి.

**5-బి సెక్షను క్రింద రిజిస్ట్రేషను :**

రాష్ట్రము నందు తయారీదారుగా రాయితీరేటు వద్ద సరుకులను కొనుగోలు చేయవలెననుకొను ప్రతి తయారీదారుడు 5-బి సెక్షను క్రింద రిజిస్ట్రేషను కొరకు ఫారము జి-1 నందు ఒక దరఖాస్తును ఇవ్వవలెను. 5-బి సెక్షను క్రింద ధృవపత్రము యొక్క నకలును రూ.5/- రుసుము చెల్లించి, లెటరు ద్వారా పొందవచ్చును.

**రిజిస్ట్రేషనులో అధికారులకు సంబంధించిన కొన్ని వివరాలు**

**12 వ సెక్షను క్రింద :** ఫారము-డి నందు రిజిస్ట్రేషను కొరకు దరఖాస్తును పొందిన తర్వాతి 30 రోజుల లోపల రిజిస్టరింగు అథారిటీ సముచితమైన విచారణను చేసిన పిదప ఫారము-డి-1 నందు రిజిస్ట్రేషను ధృవ పత్రమును 28వ రూలు క్రింద జారీ చేయాలి.

తదుపరి విచారణ ఏదైనా అవసరమని భావించినపుడు అందు నిమిత్తము నోటీసును దరఖాస్తుదారునికి జారీ చేయాలి.

# రిటర్నులు

ఏయే డీలర్లు ఏయే రిటర్నులను దాఖలు చేయాలో ఈ క్రింద సమగ్రంగా పొందుపరచడం జరిగింది. డీలర్లకు, శాఖాధికారులకు మధ్య సమాచార వాహకాలుగా ఉండే ఈ రిటర్నులు చట్టపరంగా ముఖ్యంగా అసెస్‌మెంటు విషయంలో ఎక్కువ ప్రాముఖ్యాన్ని వహిస్తాయి. అందువల్ల వాటిని గురించి అవగాహన కల్గించేందుకు ఇక్కడ పొందుపరచడం జరిగింది.

**రిటర్ను సరైనది అనగా**

1. రిటర్నులోని కాలమ్‌లన్నీ నింపబడాలి తన లెక్కల్లో చూపిన సమాచారానికి సరిపోయేట్లు ఉండాలి.
2. ప్రధానంగా డీలరు/బాధ్యుడైన వ్యక్తి సంతకాన్ని కలిగియుండాలి.
3. పూర్తి వివరాలను కలిగి యుండాలి.

**రిటర్ను సంపూర్ణమైనది అనగా**

1. చలానుతో జత చేయబడాలి.
2. మినహాయింపు ఎందుకు కోరబడింది, ఆధారాలేమిటి స్పష్టంగా “ఇ” రిటర్నునందు పేర్కొనబడాలి.
3. ఆవశ్యకమయ్యే ఫారములు (ఉదా : ‘ఐ ఫారము మరియు జి’ డిక్లరేషను ఫారములు) జత చేయబడాలి.

**1. తాత్కాలిక వార్షిక అసెస్‌మెంటుకు బాధ్యులయ్యే డీలర్లు**

ఒకటవ, రెండవ, మూడవ, అయిదవ, ఆరవ, ఏడవ షెడ్యూళ్ళనందు వ్యాపారం చేస్తున్న అందరు డీలర్లు వ్యాపారాన్ని ఆరంభించిన ముప్పై రోజుల్లో ‘ఎ’ రిటర్నును సమర్పించాలి.

## ఎ1 రిటర్ను

ఎ) రిటర్ను ఎవరు ఫైల్ చేయాలి?

- సంవత్సరములో రూ.10 లక్షలకు మించని టర్నోవరు కలిగినటువంటి

మరియు/లేదా

-రూ. 12,000/- కన్నా తక్కువ పన్నుకు బాధ్యుడయిన

ఏ డీలరయినా ఎ1 రిటర్ను ఫైల్ చేయాలి. ఇది వార్షిక రిటర్ను మరియు ఈ రిటర్నుకు సంబంధించిన డీలరు యొక్క ఆర్థిక సంవత్సరము ముగియు తేది నుంచి (30) రోజులలోగా ఫైల్ చేయబడాలి. ఏ సంవత్సర క్రమము నందైనా డీలరు తన వ్యాపారమును ముగించిన/విరమించిన, ఆ ముగింపు/విరమణ నుంచి 30 రోజుల లోగా రిటర్ను ఫైల్ చేయాలి.

**2. నెలవారి అసెసీలు :**

## ఎ2 రిటర్ను

ఎ2 రిటర్ను ఎవరు ఫైల్ చేయాలి?

సంవత్సరమునకు రూ. 10 లక్షలు దాటిన టర్నోవరు కల్గినట్టి

మరియు/లేదా

**డి) వస్తువు సంకేతము(లు)ను సరిగా ఉదహరించాలి :** ప్రతి వస్తువు, 4 అంకెల వస్తు సంకేతముతో గుర్తించబడుతుంది. ప్రతి డీలరు, 'స్టేట్‌మెంటు' పేరుతో ఉన్న రిటర్ను రెండవ భాగము నందు, తాను వ్యాపారము చేయుచున్న వస్తు సంకేతంను పేర్కొనాల్సి ఉంటుంది. ఒకవేళ అతను ఒకటి కన్నా ఎక్కువ వస్తువులతో వ్యాపారము చేయుచున్న ఎడల విభిన్న వస్తువులకు వస్తు సంకేతములను ప్రతి వస్తువునకు ప్రత్యేకంగా ఉదహరించవలెను.

**ఇ) టర్నోవరు కాలమ్‌లు :** ప్రతి డీలరూ, మొత్తం టర్నోవరూ, మినహాయించబడిన టర్నోవరు, నికర టర్నోవరు వివరాలను ప్రతి ఒక్క వస్తువుకు ప్రత్యేకంగా ఉదహరించాలి. డీలరు ఒక వస్తువు నందే వ్యాపారము చేయుచున్నప్పటికీ కొన్ని తరగతుల అమ్మకములకు ఏదైనా నోటిఫికేషన్ వగైరాల ద్వారా విభిన్న పన్నురేట్లు, విధించబడవచ్చు. అటువంటి సందర్భములలో ఆ వస్తువు యొక్క మొత్తం టర్నోవరు, మినహాయింపబడిన టర్నోవరు, నికర టర్నోవరులని, విభిన్న పన్నురేట్ల రిఫరెన్సుతో ప్రత్యేముగా చూపవలెను.

ఒక్క డీలరు ఒకటి కన్న ఎక్కువ వస్తువులతో వ్యాపారం చేస్తుండవచ్చును. చాలా తరచుగా, టర్నోవరు స్టేటుమెంటులో అన్ని వస్తువుల మొత్తం టర్నోవరుని ఒక దానితో ఒకటి కలిపివేసి (2) వ కాలంలో ఉదహరించడం జరుగుతూ ఉంటుంది. మినహాయించబడిన టర్నోవరును, నికర టర్నోవరును కూడా ఎటువంటి వస్తు విభజన లేకుండా అన్ని వస్తువులకు కలిపి నమోదు చేయుట జరుగుతూ ఉంటుంది. ఈ పద్ధతి సరికాదు. అన్నీ ఒకే పన్ను రేటుకు బాధ్యమయ్యే వస్తువులు అయినప్పటికీ మొత్తం టర్నోవరును, మినహాయించబడిన టర్నోవరును, నికర టర్నోవరును, ప్రతి వస్తువుకు విడివిడిగా, ప్రత్యేకంగా చూపించవలెను.

**వ్యాట్ సరుకులు :** వ్యాట్ సరుకుల డీలరు ఎ2 రిటర్నులోని టర్నోవరు స్టేటుమెంటు యొక్క 7, 8, 9 మరియు 10 కాలమ్స్ క్రింద వివరాలను సమకూర్చవలెను.

నెలక్రమము నందు వ్యాట్ సరుకుల కొనుగోళ్ళు (7) వ కాలమ్ నందు పేర్కొనబడాలి.

కొనుగోలు సమయమునందు ఆ కొనుగోళ్ళపై డీలరు చేత విధింపబడిన పన్నును (8) వ కాలమ్ నందు పేర్కొన వలెను.

(6) వ కాలమ్‌లో పేర్కొనబడినటువంటి వ్యాట్ సరుకుల అమ్మకపు టర్నోవరుపై పన్ను బాకీ నుండి (8) వ కాలంలో చూపబడిన పన్ను తీసివేయబడవలెను మరియు మిగిలిన మొత్తమును (9) వ కాలమ్ నందు పేర్కొనవలెను. వ్యాట్ సరుకులు కానటువంటి సరుకుల విషయంలో (7), (8), (9) కాలమ్‌లు పూర్తి చేయబడనవసరం లేదు.

నెలక్రమము నందు అంతర్రాష్ట్ర అమ్మకాలు, ఎగుమతులు, దిగుమతుల టర్నోవరు ఫారము సి.యస్.టి- VI రిటర్ను నందు విడిగా రిపోర్టు చేయబడటమేగాక, మొత్తము టర్నోవరులో భాగంగా రిటర్ను నందు చూపబడవలెను.

**3. క్యాజువల్ ట్రేడరు**

అంచనా టర్నోవరును సూచిస్తూ "ఎ ఎ" రిటర్నును తాను నిర్దిష్ట ప్రదేశానికి చేరుకొన్న 24 గంటలలోపు దాఖలు చేయాలి. పన్ను బాకీతో సహా "ఎ-3" రిటర్నును ఆ ప్రదేశాన్ని వదిలి వెళ్ళేలోపు ఆఖరి రోజున గాని అంతకు ముందుగాని దాఖలు చేయాలి.

| (1) | (2) | (3) | (4) |
|---|---|---|---|
| IV | అమ్మకపు స్థానమువద్ద పన్నుకు బాధ్యమయ్యే, ప్రిన్సిపల్ తరపున చేయబడిన, వేనిపై మినహాయింపు క్లెయిమ్ చేయబడినదో ఆ సరుకుల అమ్మకములు. | రాష్ట్రములోని మరో డీలరు దగ్గర్నుంచి కొనుగోలు చేయబడి, స్థానిక డీలరు తరపున అమ్మబడే కందులు వంటి వస్తువుల రెండవ అమ్మకాలు. | ఎవరి తరపున సరుకులు అమ్మబడుచున్నవో ఆ డీలరు యొక్క వివరాలు మరియు ఎవరి వద్ద నుంచి సరుకులు కొనుగోలు చేయబడ్డాయో ఆ డీలరు వివరాలు సమకూర్చబడవలెను. |
| V | అమ్మకపు స్థానము వద్ద పన్నుకు బాధ్యమయ్యే సరుకుల కొనుగోళ్ళు ప్రిన్సిపల్ తరపున చేయబడి నపుడు. | రైతుల నుండి లేదా ఇతర డీలర్ల వద్ద నుండి స్థానిక ప్రిన్సిపల్ తరపున కందుల వంటి వస్తువుల కొనుగోలు. | ఎవరి వద్ద నుంచి సరుకులు కొనబడ్డాయో ఆ వ్యక్తులు లేదా డీలర్ల వివరాలు సమకూర్చ బడవలెను. ఈ టర్నోవరు మీద ఏజంటు పన్నుకు బాధ్యుడు కాడు. కొనుగోలు రైతుల నుండి అయినట్లయితే ఆ సరుకులపై ప్రిన్సిపల్, ఆ సరుకులు అతని చేత అమ్మబడినపుడు పన్నుకు బాధ్యుడౌతాడు. |
| VI | ప్రిన్సిపల్ తరపున చేయబడిన, కొనుగోలు స్థానము వద్ద పన్నుకు బాధ్యమయ్యే వస్తువుల అమ్మకాలు. | స్థానిక ప్రిన్సిపల్స్ తరపున మిరప కాయల అమ్మకాలు. | ప్రిన్సిపల్ వివరాలు, ఎవరి వద్ద నుంచి సరుకులు కొనుగోలు చేయబడ్డాయో ఆ డీలరు వివరాలు సమకూర్చ బడవలెను. అట్టి అమ్మకాలపై ప్రిన్సిపల్ కానీ, ఏజంటుగాని పన్నుకు బాధ్యులు కారు. |

**6. ప్రభుత్వ శాఖలు**

వ్యాపార వ్యవహారాల్ని నిర్వహించడం వల్ల పన్నుకు బాధ్యమయ్యే ప్రభుత్వ శాఖలు 'ఎ-6' రిటర్ను ప్రతి నెల తదుపరి నెల 25వ తేదీ లోపు సమర్పించాలి.

**7. షెడ్యూల్డు బ్యాంకులు**

అసెసింగ్ అథారిటీ కోరినట్లైతే ప్రతి షెడ్యూల్డు బ్యాంకు లేక దాని శాఖ "ఎ-8"' రిటర్నును ప్రతి నెలకు తదుపరి నెల 25వ తేదీలోపు సమర్పించాలి.

## రిటర్నులకు అనుబంధంగా ఉండే ఫారములు

**ఫారము "ఇ"** ఇ-రిటర్ను

ఏ స్థానము వద్దనయితే సరుకులు పన్నుకు బాధ్యమౌతాయో అట్టి స్థానము కన్న భిన్నమయిన స్థానము వద్ద జరిగే సరుకుల కొనుగోళ్ళు, అమ్మకాలపై మరియు వ్యాట్ వస్తువుల విషయంలో ద్వితీయ స్థానము వద్ద లేదా తదనంతర అమ్మకాలపై మినహాయింపు క్లెయిము చేయు ప్రతి డీలరు ఎ2 రిటర్నుతో పాటుగా ఇ-రిటర్నును ఫైలు చేయాలి.

ఈ స్టేటుమెంటులు పూర్తి చేయునపుడు, డీలరు చేత అమ్మబడిన లేదా కొనుగోలు చేయబడిన వస్తువు వర్ణన మరియు సంకేతము, లావాదేవీల యొక్క ఇన్‌వాయిస్ నంబరు మరియు తేదీ సరిగా పేర్కొనబడవలెను. ఎవరి వద్ద నుంచయితే సరుకులు కొనుగోలు చేయబడ్డాయో లేదా ఎవరికయితే సరుకులు అమ్మబడ్డాయో, సందర్భానుసారంగా ఏదయితే అది, ఆ డీలరు యొక్క పేరు, చిరునామా, మరియు ఆర్.సి.సంఖ్య కూడా సరిగా పేర్కొనబడవలెను. చాలా సందర్భాలలో, అమ్మచున్న డీలరు యొక్క ఆర్.సి. సంఖ్య, డివిజన్, సర్కిల్, యూనిటులకు ఇవ్వబడిన పూర్తి సంకేతముతో వ్రాయబడటం లేదని, గమనించడం జరిగింది. ఫలితంగా అసెసింగ్ అథారిటీకి లావాదేవీల క్రాస్ వెరిఫికేషను కష్టమౌతుంది మరియు మినహాయింపు తిరస్కరించబడుతుంది.

**ఫారము "యఫ్"**

కేంద్ర అమ్మకపు పన్ను చట్టం క్రింద చెల్లించిన మొత్తాన్ని వాపసు ఇవ్వవలసిందిగా కోరుతున్న డీలర్లు, అట్లు చెల్లించిన తేదీ నుండి  మూడు నెలలలోపు దీనిని దాఖలు చేయాల్సి ఉంటుంది.

**ఫారము "యఫ్-1"**

మూడవ షెడ్యూలుకు అనుబంధంగా ఉన్న IIIవ విశదీకరణాన్ని అనుసరించి ధాన్యంపై చెల్లించిన పన్ను మేరకు తగ్గింపు ఇవ్వవలెనని కోరుతున్న డీలర్లు దీనిని దాఖలు చేయాలి.

**ఫారము "జి"**

5-బి సెక్షను క్రింద కాంపోనెంట్లు, విడిభాగాలు వంటి  సరుకులపై రాయితీ రేటు ఇవ్వవలసిందిగా అభ్యర్థించే డీలర్లు రిటర్నుతో గాని, అసెస్‌మెంటుకు ముందుగా గాని దీనిని సమర్పించాలి.

**ఫారము "ఐ"**

బెల్లం డీలర్లు తమపై పన్ను బాధ్యత నిరూపణగా "ఎ-1" లేక "ఎ-2" రిటర్నులతో పాటు దాఖలు చేయాలి.

స్వయం అసెస్‌మెంటు కొత్తగా చేర్చబడినది. (దీనికి సంబంధించిన వివరాల కొరకు ప్రత్యేక అనుబంధములో 337వ పేజిని చూడండి.)

తాత్కాలిక అసెస్‌మెంటు అంతిమ అసెస్‌మెంటుకు లోబడి ఉంటుంది.

"అంతిమ అసెస్‌మెంటు" అసెస్‌మెంటు సంవత్సరం మొత్తానికి కలిపి చేయబడుతుంది. డీలరు మొత్తం టర్నోవరు లభ్యం కావటం ఇందులో ప్రధానంగా ఆవశ్యకమౌతుంది. కాబట్టి సంవత్సరం ముగిసిన తరువాత మాత్రమే జరుగుతుంది. శ్రేష్ఠతమ న్యాయ నిర్ధారణ (బెస్ట్ ఆఫ్ జడ్జిమెంటు అసెస్‌మెంట్) ఈ క్రింది సందర్భాలలో జరుగుతుంది.

1. డీలరు అసలు రిటర్నును దాఖలు చేయటంలోనే విఫలమైనప్పుడు.

2. దాఖలు చేయబడిన రిటర్ను సరియైనది కానట్లు లేక సంపూర్ణంగా లేనట్లు అనిపించినప్పుడు.

3. రిటర్నులో చూపిన వివరాల కన్నా మరింతఖచ్చితమైన వివరాలను అసెసింగ్ అథారిటీ ఇంటలిజెన్స్, తనిఖీ, మరే విదంగా నైనా పొంది యున్నప్పుడు.

**అసెస్‌మెంటులో డీలరు బాధ్యతలు**

1. తన చేత సమర్పించబడిన రిటర్ను సరియైనది మరియు సంపూర్ణమైనది అని నిరూపించవలసిన బాధ్యత డీలరు పైననే యున్నది.
2. సక్రమంగాను, సకాలంలోను రిటర్నులను దాఖలు చేయటం.
3. అసెసింగ్ అథారిటీ కోరే ఇతర సమాచారాన్ని, వివరాలను అందచేయటం.
4. సకాలంలో స్టేటుమెంటులను, డిక్లరేషన్లను, ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారాలను సక్రమంగా అందచేయటం.
5. అభ్యంతరాలను కోరుతూ అడిగిన సంజాయిషీకి చట్టపరంగా సాంకేతికంగా ఖచ్చితమైన సమాచారాన్ని, సాక్ష్యాన్ని (ఎవిడెన్సు) యివ్వటం.
6. చెల్లించాల్సిన పన్నును సకాలంలో చెల్లించడం.
7. న్యాయపరమైన సదుపాయాలను (లీగల్ రెమిడీస్) సకాలంలో వినియోగించుకోవటం వగైరా.

**"అసెస్‌మెంట్" కోసం అధికార యంత్రాంగం**

చట్టము యొక్క 4వ సెక్షను క్రింద అదికార యంత్రాంగం పేర్కొనబడింది. అయితే- ప్రాధమికంగా ఉపవాణిజ్య పన్నుల అధికారులు, వాణిజ్య పన్నుల అధికారులు మాత్రమే 'అసెసింగ్ అథారిటీలు' గా యుంటారు.

సహాయ వాణిజ్య పన్నుల అధికారులు, ఉపవాణిజ్య పన్నులఅధికారుల చేత బదిలీ చేయబడిన అసెస్‌మెంటులకు రూ.3,00,000/- టర్నోవరుకు లోబడి "అసెసింగ్ అథారిటీలు"గా ఉంటారు. ఉపవాణిజ్య పన్నుల అధికారులు రూ.3,00,000/- ల నుంచి రూ.15,00,000/- ల వరకు పరిమితిగల టర్నోవరుకు, వాణిజ్య పన్నుల అధికారులు పరిమితితో సంబంధం లేకుండా పదిహేను లక్షల రూపాయలకు మించిన టర్నోవరుపై అసెసింగ్ అథారిటీలుగా వ్యవహరిస్తారు.

సంబంధిత ప్రదేశంపై అధికార పరిధికల వా.ప. ఉప కమీషనరు ఒక డీలరు/ఒక డీలర్ల వర్గాన్ని ఒక 'అసెసింగ్ అథారిటీ నుంచి వేరొక అసెసింగ్ అథారిటీకి' బదిలీ చేసే అధికారాన్ని కలిగియుంటారు.

అలాగే క్రింది స్థాయి అధికారులు చేసే అసెస్‌మెంటును తానే స్వయంగా చేపట్టి చేసేందుకు ఉన్నత స్థాయి అధికారికి స్వేచ్ఛ యుంటుంది.

# అపరాధములు

సాధారణంగా అన్ని చట్టాల్లో యున్నట్లుగానే ఆంధ్ర ప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టము కూడా కొన్ని నిర్దిష్టమైన అపరాధాల్ని పేర్కొన్నది. సాధారణంగా అపరాధాలు రెండు రకాలుగా యుంటాయి - చట్టం సంబంధిత వ్యక్తుల్ని కొన్నింటిని ఆచరించాల్సిందిగా లేదా పాటించాల్సిందిగా పేర్కొంటుంది. వాటిని పాటించక పోవటం వల్ల లేదా కార్యలోపం (కమిషన్) వల్ల కొన్ని అపరాధాలు జరిగినట్లు భావించబడతాయి. కొన్ని సందర్భాలలో చట్టం నిర్దేశించిన తీరుకన్నా భిన్నమైన తీరులో ప్రవర్తించడం కూడా చట్టరీత్యా అపరాధం చేసినట్లవుతుంది. వీటిని అపరాధ కార్యాలుగా (కమిషన్) భావించి నిబంధనల కనుగుణంగా శిక్షించడం జరుగుతుంది.

చట్టంలో 30వ సెక్షనులో అపరాధాలు, జరిమానాలు గురించి విస్తారంగా విశదీకరించబడింది. ఇందులో నిర్దుష్టంగా గుర్తించి, ఆమోదించిన ఇతరమైన అపరాధాల్తో పాటు 30 (1) (సి) సెక్షను క్రింద "ఉద్దేశ్యపూర్వకంగా ఈ చట్టం నిబంధనలను ఉల్లంఘించడం" అపరాధమౌతుందని చెప్పబడింది. నిర్దుష్టంగా 30వ సెక్షనులో పేరు పెట్టి పేర్కొనిన అపరాధాలన్నీ ఈ తరహాకి చెందుతాయి. ఇవి సర్వ సాధారణంగా ఉండేవి కాబట్టి వీటిని ముందుగా తెలుసుకొని నిర్దుష్టంగా ఉన్నవాటిని తరువాత తెలుసుకొందాము.

1. రూల్సు ద్వారా కోరబడినట్లుగా అమ్మకాల బిల్లులను జారీ చేయకపోవటం.
2. రిజిస్ట్రేషన్ ధృవపత్రము నందు ఉదహరించబడిన వాని కంటె భిన్నమైన ప్రదేశాలలో సరుకులను యుంచటం.
3. వ్యాపారపు నిలిపివేతను నివేదించకపోవటం.
4. వ్యాపారపు ప్రదేశంలో మార్పును నివేదించకపోవటం.
5. అర్హుడైన అధికారి ఆపమని కోరినప్పుడు సరుకుల వాహనాన్ని ఆపకపోవటం.
6. లెక్కలను నిర్వహించకపోవటం మొదలైనవి.

**లెక్కలను నిర్వహించటంలో అపరాధాలు**

**25వ సెక్షను ప్రకారం లెక్కలను ఫలానా తీరులో విధిగా నిర్వహించి తీరాలని కోరేందుకు అధికార యంత్రాంగానికి అధికారం యుంది. అట్లా కోరబడినప్పుడు డీలరు కోరిన విధంగా లెక్కలను నిర్వహించటంలో విఫలమైతే 30-ఎ సెక్షను క్రింద చెల్లించాల్సిన పన్నుకు రెట్టింపు పన్నును గాని, రూ. 2000/- లకు తగ్గని జరిమానాను గాని, ఏది తక్కువగా యుంటే దానిని చెల్లించాల్సి యుంటుంది.**

**చట్టం కొన్ని అపరాధాల్ని నిర్దిష్టంగా, స్పష్టంగా పేర్కొన్నది. అలాగే వాటికి జరిమానాల్ని, శిక్షల్ని కూడా పేర్కొన్నది. ఇంతకు ముందు పేర్కొన్న సాధారణ అపరాధాల కంటే (నిబంధన సాధారణ ఉల్లంఘున) నిర్దిష్ట అపరాధాలుగా ఈ క్రింద పేర్కొన్న వాటిని వ్యవహరిస్తారు.**

**(డి) బిల్లుల్ని జారీ చేయక పోవడం**

ఖాతాదారు కోరినట్లయితే విధిగాను, రూ. 10 లు మించిన ప్రతి అమ్మకానికి విధిగా అమ్మకం బిల్లును జారీ చేయాల్సిన బాధ్యత డీలరుపై నున్నదని చట్టం పేర్కొన్నది. బుద్ధిపూర్వకంగా అట్లా జారీ చేయకపోవటం కూడా నేరమే.

**(ఇ) తనిఖీ లేదా పరీక్షను నిరోధించడం.**

సంబంధిత పత్రాల్ని, ఆధారాల్ని తనిఖీ చేసేందుకు, సరుకుల్ని పరీక్షించేందుకు చట్టము 29వ సెక్షను ద్వారా అధికారులకు వీలు కల్పించింది. సదరు తనిఖీ లేక పరీక్షలను నిరోధించడం గాని, బుద్ధి పూర్వకంగా సమాచారాన్ని లేక పత్రాల్ని దాఖలు చేయటంలో విఫలమవటం 30 (1) (ఇ) సెక్షను క్రింద అపరాధంగా పరిగణించబడుతుంది.

**5. రాయితీ పన్ను రేటు వినియోగంలో అపరాధాలు**

5-బి సెక్షను క్రింద తానిచ్చిన డిక్లరేషను కన్నా భిన్నంగా సరుకులను ప్రకటించిన తీరుకన్నా వేరే రీతిలో వినియోగించడం 30 (4) సెక్షను క్రింద అపరాధంగా భావించబడుతుంది.

**ఏమౌతుంది?**

4-ఎ, బి, సి, డి, ఇ మరియు 5 క్రింద అపరాధములకు జరిమానా ఈ క్రింది విధంగా విధించబడుతుంది.

అపరాధం మొదటి పర్యాయం అయినట్లయితే రూ. 500ల నుంచి రూ. 2000 ల వరకు జరిమానా విధించబడుతుంది. అపరాధం రెండవ పర్యాయం అయితే సంవత్సరం పాటు విస్తరించే సాధారణ కారాగారం మరియు రూ. 500 నుంచి రూ. 2000 లు వరకు జరిమానా విధించబడుతుంది.

అదే అపరాధం 3వ సారి లేక ఉత్తరోత్తరా జరిగితే 3 నెలలకు తగ్గకుండా సంవత్సరం దాకా విస్తరించే కారాగార శిక్ష మరియు రూ. 500 నుంచి రూ. 2000 లు వరకు జరిమానా విధించబడుతుంది.

**6. సరుకుల వాహనం, పడవ యజమానులు వగైరా సరియైన పత్రాలను తీసుకొని వెళ్ళకపోవటం**

26, 27 వ సెక్షన్లు సరుకుల వాహనం, పడవ యజమానులు గాని, వాటిని తన అధీనమందు కలిగియున్న వ్యక్తులుగాని వే బిల్లు, ట్రిప్పుషీటు, బిల్లు వగైరాలను రవాణా చేస్తున్న సమయంలో తమ వెంట తీసుకొని వెళ్ళాలని నిర్దేశిస్తోంది. అట్లా తీసుకొని వెళ్ళకపోవటం 30 (5) (ఎ) సెక్షను క్రింద అపరాధం చేసినట్లవుతుంది.

**ఏమౌతుంది?**

ఎ) నేర నిర్ణయంపై ఒక సంవత్సరం పాటు విస్తరించే సాధారణ కారాగార శిక్షతో బాటు రూ.500/- లకు తగ్గని రూ.2000/- లవరకు విస్తరించే జరిమానాకు బాధ్యులౌతారు

బి) పై చెప్పబడిన అపరాధం సరుకుల వాహనం లేక పడవ యజమానికి కూడా వర్తిస్తుంది. ఆ అపరాధ సమయంలో వాటి అధీనం తనకు లేనప్పటికీ ఇది వర్తిస్తుంది. సదరు శిక్షలకు కూడా అతడు బాధ్యుడౌతాడు.

# అప్పీళ్ళు

**1. మొదటి అప్పీలు ఎవరికి చేయబడాలి? ప్రొసీజరు ఏమిటి?**

మొదటి అప్పీలు అప్పిలేటు ఉప కమీషనరుకు ఆ ఉత్తర్వు లేక ప్రొసీడింగు అందజేయబడిన తేదీ నుండి 30 రోజుల లోపల ఫారము-I నందు రెండు ప్రతులతో మొదటి అప్పీలు చేసుకోవాలి. పన్ను లేక జరిమానా వివాదగ్రస్తమైన సందర్భములో వివాదగ్రస్తమైన పన్ను మరియు/లేదా జరిమానా యందు 2% చొప్పున, కనీసము రూ. 50/- మరియు గరిష్టము రూ. 1000/- కు లోబడి రుసుము మరియు అన్ని ఇతర సందర్భములలో రూ. 50/- రుసుము అప్పీలుకు జత చేయాలి. 33వ రూలును చూడుము.

ఏ ప్రొసీడింగుల నందైనా హైకోర్టు కన్నాభిన్నమైన అథారిటీ ముందు హాజరగుటకు ఆథరైజేషను ఫారము–XXVI నందు ఉండవలెను. న్యాయవాదులయితే రూ. 3/- ల కోర్టు ఫీజు స్టాంపుతోను మరియు ఇతరులైతే నాన్ జ్యూడిషియల్ పేపరు పై రూ. 10/- ల అథెసివ్ స్టాంపులను అప్పీలుకు జతచేయాలి. 63-ఎ రూలును చూడుము

**2. పన్ను వసూలు 'స్టే' కొరకు దరఖాస్తు :**

**i) అప్పిలేటు ఉపకమీషనరుకు :**

వివాదగ్రస్త పన్ను వసూలు యొక్క 'స్టే' కొరకు దరఖాస్తు అప్పిలేటు ఉప కమీషనరు ముందు అప్పీలుతో పాటుగా గాని లేక అప్పీలు అనుమతించబడిన తర్వాత గాని రెండు ప్రతులలో ఫారము—XXII నందు దాఖలు చేసుకోవాలి. దరఖాస్తుతో పాటుగా వివాదగ్రస్త అసెస్‌మెంటు లేక జరిమానా ఉత్తర్వు యొక్క ధృవీకరించబడిన నకలు మరియు రూ. 3/- ల కోర్టు ఫీజు స్టాంపును జత చేయాలి. సెక్షను 19(2-ఎ) చూడుము.

**ii) సంయుక్త కమీషనరుకు :**

పన్ను వసూలు యొక్క 'స్టే' కొరకు 19(2-బి) లేక 19(2-సి) సెక్షను క్రింద దరఖాస్తు సంయుక్త కమీషనరుకు అప్పిలేటు ఉపకమీషనరు 'స్టే' ను తిరస్కరించిన ఉత్తర్వు అందజేయబడిన తేదినుండి 30 రోజుల లోపల రెండు ప్రతులలో ఫారము—XXII నందు దాఖలు చేసుకోవాలి. దరఖాస్తుతో పాటుగా 'స్టే' ను తిరస్కరించిన ఉత్తర్వు లేక అమ్మకపు పన్ను అప్పిలేటు ట్రిబ్యునలుకు దాఖలు చేయబడిన దరఖాస్తు యొక్క నకలు మరియు రూ. 3/- ల కోర్టు ఫీజు స్టాంపుతో జత చేయాలి.

**3. వాయిదా అర్జీలకు రూ. 2/- ల కోర్టు ఫీజుస్టాంపు జత చేయాలి.**

**4. అఫిడవిట్లకు రూ. 10/- ల నాన్-జ్యూడిషియల్ స్టాంపును జత చేయాలి.**

**5. పన్ను చెల్లించబడినట్లుగా డిక్లరేషను :**

అప్పీలుతో పాటు ఫారము I-ఎ నందు బాకీయైన పన్ను లేక సదరు వాయిదాలు చెల్లించబడినవని ఒక డిక్లరేషనును జతచేయాలి.

బి) వాణిజ్య పన్నుల కమీషనరు యొక్క ఉత్తర్వు సర్టిపై చేయబడిన కాపీ

సి) అప్పీలుకు ఆధారాలు లేక న్యాయ సంబంధ అంశములను జతచేయాలి. 41వ రూలును చూడుము

**ii) అప్పీలు పై తన చేత పాస్ చేయబడిన ఉత్తర్వుల పై హైకోర్టుచేత రివ్యూ:**

హైకోర్టు యొక్క ఉత్తర్వు అందజేయబడిన తేదీ నుండి ఒక సంవత్సరము లోపల ఫారము–VI నందు రివ్యూ అర్జీ దాఖలు చేయబడవలెను. అప్పీలుతో పాటుగా

ఎ) హైకోర్టు ఉత్తర్వు యొక్క సర్టిపై చేయబడిన కాపీ

బి) అసలు ఉత్తర్వును పాస్ చేసే సమయంలో హైకోర్టు ముందు లేనటువంటి క్రొత్త వాస్తవాలు.

సి) డీలరు చేత అర్జీ దాఖలు చేయబడినపుడు రూ.100/- ల రుసుము

జత చేయబడాలి.

**అప్పీళ్ళ విషయంలో అధికారులకు సంబంధించిన కొన్ని వివరాలు**

**1. ఏ అప్పీలు ఉత్తర్వులను అధికారులు ఎప్పటిలోగా అమలు చేయాలి?**

20వ సెక్షను క్రింద మొదటి అప్పిలేటు అథారిటీ లేక రివిజనల్ అథారిటీ చేత పాస్‌చేయబడిన ఉత్తర్వు, ఆ ఉత్తర్వు అందిన తేది నుండి రెండు నెలల లోపల అమలు చేయబడాలి.

అప్పిలేటు ట్రిబ్యునలు లేక హైకోర్టు చేత ఇవ్వబడిన అథరైజేషనుపై సదరు అథారిటీ, ఆ ఉత్తర్వు అందిన తేది నుండి రెండు నెలల లోపల అమలు చేయాలి

**2. ఉత్తర్వుల రివిజను కొరకు కాలపరిమితి :**

వాణిజ్య పన్నుల అధికారి చేత, ఉపకమీషనరు/సంయుక్త కమీషనరు చేత లేక వాణిజ్య పన్నుల కమీషనరు చేత ఏ ఉత్తర్వు లైననూ అవి అందజేయబడిన తేదీ నుండి 4 సంవత్సరములలోపు మాత్రమే రివిజను చేయబడాలి.

| క్రమ సంఖ్య | అధికారము/విధి | ఆ.ప్ర.సా.అ.ప.చ. క్రింద సెక్షను/రూలు |
|---|---|---|
| 10. | అవసరమయిన చోట సరిక్రొత్త సెక్యూరిటీ లేదా అదనపు సెక్యూరిటి కొరకు డిమాండు చేయుటకు. | S.12(10)(14) R.28(14)(15) |
| 11. | డీలరు యొక్క రిజిస్ట్రేషన్ రద్దు అగునంత వరకూ, అతను ప్రతి సంవత్సరము ప్రెస్క్రైబ్డు ఫీజును చెల్లించునట్లుగా చూచుటకు | S.12(18) R.28(13) |
| 12. | డీలరు చేత చెల్లించబడాల్సిన పన్ను లేక జరిమానా లేక వడ్డీ లేక ఇతర బాకీల మొత్తం యొక్క వసూలు కొరకు, చట్టము లేదా రూల్సు నందు నిర్దేశితమయిన ఫారముల దుర్వినియోగం చేసిన లేదా వాటిని యుక్తమైన సంరక్షణ యందుంచుటలో విఫలమైన డీలరు చేత సమకూర్చబడిన సెక్యూరిటీని మొత్తం లేక కొంత భాగమును ఫోర్ఫీట్ చేయుటకు | S.12(13) R.28(16) |
| 13. | డీలరు యొక్క దరఖాస్తుపై, సెక్యూరిటీని, అది చట్టం యొక్క ప్రయోజనాల కొరకు అపేక్షితం కాని యెడల వాపసుకు ఆదేశించుటకు | S.12(16) R. 28(17) |
| 14. | ఒరిజినల్ పోయిన యెడల, నాశనమయినపుడు, చెరిగిపోయినపుడు లేదా విరూపితమయినపుడు, ప్రెస్క్రైబ్డ్ ఫీజు చెల్లింపబడినట్లయితే డూప్లికేటును జారీ చేయుటకు | R. 28(19) |
| 15. | (ఎ) డీలరు దరఖాస్తు చేసుకున్నప్పుడు<br>(బి) డీలరుకు బాకీ నోటీసు ఇచ్చిన తరువాత<br>రిజిస్ట్రేషన్ సర్టిఫికేటును మార్చుటకు, సవరించుటకు, లేదా రద్దు చేయుటకు | S. 12(17) R. 28(20) |
| 16. | డీలరు తన ప్రధాన వ్యాపార ప్రదేశమును మార్చ సంకల్పించినపుడు ఎవరి అధికార పరిధికి మార్చ సంకల్పించెనో ఆ రిజిస్ట్రేషన్ అథారిటీకి రిజిస్ట్రేషన్ ఫైల్‌ను బదిలీ చేయుటకు | R.28(21-a)(b) |
| 17. | డీలరు ఎవరి అధికార పరిధి నుంచి తన ప్రధాన వ్యాపార ప్రదేశమును మార్చెనో, ఆ రిజిస్ట్రేషన్ అథారిటీ నుంచి రిజిస్ట్రేషన్ ఫైల్ తనకు మార్చబడినపుడు, సరిక్రొత్త రిజిస్ట్రేషన్ ధృవపత్రంను జారీ చేయుటకు | R. 28(21-a)(c) |
| 18. | డీలరు చేత సమకూర్చబడిన సెక్యూరిటీ హామీ పత్రము రూపంలో ఉన్నపుడు సదరు హామీదారుడు మరణించినను లేక దివాళ తీసినను, క్రొత్త హామీ పత్రమును పొందుటకు | S. 12 (12) |
| 19. | (ఎ) యోగ్యమైన మరియు తగిన కారణాలపై,<br>(బి) డీలరు దరఖాస్తు చేసుకున్నప్పుడు<br>రిజిస్ట్రేషన్, ధృవపత్రమును రద్దు చేయుటకు | S. 12 (17) |
| 20. | రద్దు చేయుటకు ముందు డీలరుకు నోటీసును మరియు తనవాదం వినిపించుకొనేందుకు అవకాశం ఇచ్చుటకు | S. 12 (17) R. 28(24) |

ప్రత్యేక అనుబంధము

| క్రమ సంఖ్య | అధికారము/విధి | ఆ.ప్ర.సా.అ.వ.చ. క్రింద సెక్షను/రూలు |
|---|---|---|
| | ఇ) తత్పూర్వ 3 సం॥లలో దేనియందైనా అతడు పన్ను బకాయిలలో ఉన్నట్లైతే<br>యఫ్) తత్పూర్వ 3 సం॥లలో దేనియందైనా 14(4) సెక్షను క్రింద చర్య తీసుకోబడినట్లయితే లేక ప్రొసీడింగులు పెండింగులో ఉన్నట్లయితే. | |
| 13. | టర్నోవరు 25 లక్షల రూపాయలు మించనటువంటి డీలరును స్వయం అసెస్‌మెంటుకు అనుమతించుట మరియు అట్లు అనుమతించుకుండుట. | S.14-D(1) (2) |
| 14. | పై (13)వ అంశము నందు ఉదహరింపబడిన డీలరును సమగ్రమయిన అసెస్‌మెంటు కొరకు చేపట్టుట.<br>i) రిటర్ను సరిఅయినది కానట్లు లేక అసమగ్రమయినదిగా కనిపించినట్లయితే లేక స్వయం అసెస్‌మెంటుపై పన్నును డీలరు పూర్తిగా చెల్లించనపుడు.<br>ii) పన్నుకు భాద్యమయ్యే నికర టర్నోవరు యందు పెరుగుదల తత్పూర్వ సంవత్సరంతో పోలిస్తే 25% కంటే తక్కువ ఉన్నపుడు;<br>iii) తత్పూర్వ 3 సం॥ లో దేనియందైనా అతని మొత్తము టర్నోవరు రూ. 25 లక్షలు మించినట్లయితే<br>iv) ఎ) అతడు పన్నుబకాయిలలో ఉన్నపుడు<br>బి) అతడు టర్నోవరు మొత్తాన్ని లేక భాగాన్ని అణిచిపెట్టినట్లు లేక పన్ను వసూలుని ఎగవేసినట్లు కనుగొనబడినపుడు | S.14-D (1)to (4) |
| 15. | ఎట్టి రిటర్ను దాఖలు చేయబడనపుడు లేక తనిఖీ తర్వాత రిటర్ను దాఖలు చేయబడినపుడు లేక రిటర్ను లేక రిటర్నులు సరిఅయినవి కానివిగా లేక అసమగ్రమయినవిగా కనుగొనబడినట్లయితే, లేక పై (6) నుండి (14) అంశముల సంబంధంగా ఏవయినా అవకతవకలు ఉన్నట్లయితే తనబెస్టు జడ్జిమెంటు రీత్యా అసెస్‌మెంటు చేయుటకు | S14(i)(1A) (3) (7), 14B R.12,15 (5) 17(6) |
| 16. | బెస్ట్ జడ్జిమెంటు అసెస్‌మెంటు విషయంలో జరిమానా విధింపునకు | S.14(2),(3)(8) S.14-B |
| 17. | ఎవరైనా డీలరు యొక్క టర్నోవరు - పన్ను అసెస్‌మెంటు నుండి తప్పించబడినదో, లేదా అండర్ అసెస్ చేయబడినదో, లేదా సరిఅయిన రేటు కాకుండా తగ్గింపు రేటు వద్ద అసెస్ చేయబడినదో చూచుటకు, ఒకవేళ అలా జరిగిన, ఆ అసెస్‌మెంటును సరిగా ఏర్పాటు చేయుటకు | S.14 (4) S. (4A) (7A) S.14-A(1)(c) 14-B R.31 |
| 18. | పైన (16) నందు వర్ణించబడిన విధంగా, అసెస్‌మెంటు యొక్క బెస్టు జడ్జిమెంటు విషయంలో జరిమానా విధించుటకు | S.14(4) (4A) (8)14-A(2),14B |
| 19. | పైన (16) మరియు (18) లలో పేర్కొనబడిన జరిమానా విధింపునకు ముందు, డీలరు తన వివరణ ఇచ్చుటకు అవకాశం ఇచ్చుటకు | S.14(4B) |

| క్రమ సంఖ్య | అధికారము/విధి | ఆ.ప్ర.సా.అ.ప.చ. క్రింద సెక్షను/రూలు |
|---|---|---|
| 33. | రిటర్ను నందు చూపబడిన దానికన్నా భిన్నమయిన సంఖ్య చొప్పున డీలరు యొక్క టర్నోవరును నిర్ణయించినపుడు అందుకు గల కారణములను అసెస్‌మెంటు ఉత్తర్వు నందు రికార్డు చేయుటకు | R.18 |
| 34. | ప్రెస్క్రైబ్ చేయబడిన వివరాలను చూపుచున్న లెక్కల (Accounts) నిర్వహణను అమలు చేయించుటకు | S–25 R.18–A |
| 35. | నిర్దేశించిన విధంగా లెక్కలు నిర్వహించుటలో విఫలమయినచో జరిమానా విధించుటకు | S.30–A R.18–A |
| 36. | రొక్కము కన్నా ఇతరమయిన విలువయిన మూల్యము కొరకు సరుకుల అమ్మకము లేదా కొనుగోలు చేయబడు సందర్భములో, టర్నోవరు నిర్ణయించుటకు మరియు అసెస్ చేసేందుకు అట్టి మూల్యం విలువను రొక్కరూపంలో అంచనా వేయుటకు | R.19 |
| 37. | తన చేత పాస్ చేయబడిన ఉత్తర్వు తేది నుండి 4 సంవత్సరములలోపు ఏ సమయమందైననూ రికార్డు నందు స్ఫుటముగా నున్న ఏదైనా లేఖన లేదా అంకగణిత దోషమును సరిదిద్దుటకు | R.50 |
| 38. | డీలరు - సెక్యూరిటీని, Fresh సెక్యూరిటీని, అదనపు సెక్యూరిటీని లేదా సెక్యూరిటీ బాండును సమకూర్చుటలో విఫలమయినచో చట్టము మరియు రూల్సు క్రింద ప్రెస్క్రైబ్ చేయబడిన ఫారములను జారీ చేయుటకు తిరస్కరించుటకు | S.12(15) |
| 39. | స్థానిక తయారీదారులకు, వారు ముడి పదార్థాలు తగ్గింపు ధరల వద్ద కొనుగోలు చేసేందుకు తయారీదారు సర్టిఫికేటులను జారీ చేయుటకు | S.30–A |
| 40. | పైన (39) నందు చూపబడిన ఐటమ్ దృష్ట్యా షరతులను అతిక్రమించినన జరిమానాలను విధించుటకు | S.5–B (2) |

## తనిఖీ చేయు అథారిటీ

| క్రమ సంఖ్య | అధికారము/విధి | ఆ.ప్ర.సా.అ.ప.చ. క్రింద సెక్షను/రూలు |
|---|---|---|
| 1. | లెక్కలు, రిజిస్టర్లు మరియు ఇతర అధికార పత్రములను తనముందు దాఖలు చేయమని మరియు తన వ్యాపారమునకు సంబంధించిన సమాచారమును సమకూర్చమని డీలరును అపేక్షించుటకు | S.28(1)(17) |
| 2. | డీలరు యొక్క ఆధీనమునందున్న లెక్కలు, రిజిస్టర్లు మరియు ఇతర అధికార పత్రములను మరియు కార్యాలయము, దుకాణము, గోదాములు, వెసెల్సు మరియు వాహనములందున్న సరుకులను వ్యాపారసమయములందు లేక అన్ని హేతుబద్ధ సమయములందు తనిఖీ చేయుటకు | S.28 (2) R. 49 (1) |
| 3. | ఈ చట్టము క్రింద బాకీయైన పన్ను చెల్లింపు లేక ఇతర మొత్తాన్ని ఎగవేయుటకు డీలరు ప్రయత్నించుచున్నాడని నమ్ముటకు కారణమున్నట్లయితే అతని లెక్కలు, రిజిస్టర్లు మరియు ఇతర అధికార పత్రములను సీజ్ చేయుటకు | S. 28 (3) R. 49 (2) |

## ప్రత్యేక అనుబంధము

| క్రమ సంఖ్య | అధికారము/విధి | ఆ.ప్ర.సా.అ.ప.చ. క్రింద సెక్షను/రూలు |
|---|---|---|
| 17. | ఈ చట్టము క్రింద చెల్లించ వలసిన పన్ను, ఏదయినా ఉన్నట్లయితే చెల్లించబడినట్లు లేక ఆ సరుకుల అమ్మకము లేక కొనుగోలు రికార్డులందు సముచితముగా లెక్క చూపబడినదని సంతృప్తి చెందినపుడు వాహనం లేక పడవను విడుదల చేయుట. | S. 29 (3) (b)<br>R. 46 (1)<br>R. 47 (2) |
| 18. | పై (16) అంశంనందు ఉదహరించబడిన విధంగా సంతృప్తి చెందనప్పుడు ఆ సరుకులని నిర్బంధించుటకు మరియు డ్రైవరు లేక ఇన్‌చార్జి వ్యక్తిని పన్ను చెల్లించమని మరియు సెక్యూరిటీని సమకూర్చమని ఆదేశించుటకు | R. 47 (1)<br>S. 29 (3) (b)<br>R. 46 (1)<br>R. 47 (2) |
| 19. | పన్ను చెల్లించబడినపుడు మరియు సెక్యూరిటీ సమకూర్చబడినపుడు పై (17) వ అంశము క్రింద నిర్బందించబడిన సరుకులను విడుదల చేయుట. | S. 29 (4)<br>R. 46 (3) (a). |
| 20. | పన్ను మరియు సెక్యూరిటీల వసూలు యొక్క వాస్తవంని సంబంధిత అసెసింగ్ అథారిటీకి తెలియజేయుట. | R. 46 (3) (b)<br>R. 47 (2) |
| 21. | పన్ను చెల్లించుట యందు మరియు సెక్యూరిటీ సమకూర్చుట యందు వైఫల్యమపుడు చెల్లిచంబడవలసిందిగా మరియు సమకూర్చబడవలసిందిగా ఆదేశించబడిన పన్ను మరియు సెక్యూరిటీల మొత్తమునకు సుమారుగా సమానమైన విలువగల సరుకులని నిర్బందించుట. | S. 29 (6)<br>R. 46 (5)<br>R. 47 (2) |
| 22. | పన్ను బాకీ చెల్లింపబడకుండా లేక సముచితముగా లెక్క చూపబడకుండా సరుకులు మోసుకుపోబడుతుంటే పన్ను మరియు జరిమానాని వసూలు చేయుట. | S. 29 (6-A) |
| 23. | నిర్బందించబడిన సరుకులు క్షయమునకు లోబడునవి అయినట్లైతే లేక ప్రెస్క్రైబ్ చేయబడిన సమయము లోపల ఎట్టి క్లెయిము చేయబడనట్లయితే సరుకులను అమ్మివేయుట (సరుకులని నిర్బంధించిన అధికారి ఎ.సి.టి.వొ అయినట్లయితే, అతడు సరుకులను డి.సి.టి.వొ కు బదిలీ చేయవలెను మరియు సరుకులను డి.సి.టి.వో అమ్మవలెను). | S. 29 (7)<br>R. 46 (7)<br>R. 47 (2) |
| 24. | అమ్మకపు ఖర్చులు మరియు ఇతర ఇన్సిడెంటల్ చార్జీలు మరియు చట్టం క్రింద బాకీ అయిన పన్ను మరియు జరిమానా మొత్తములను తగ్గించిన తర్వాత అమ్మకపు రాబడులను సరుకుల యజమాని లేక రాబడులకు హక్కుదారయిన వ్యక్తికి వాపసు చేయుట. | S. 29 (8)<br>R. 46 (16)<br>R. 47 (2) |
| 25. | అప్పీలు లేక రివిజను యందు నిర్బందము యొక్క ఉత్తర్వు రద్దు జేయబడినట్లయితే నిర్బందించ బడిన సరుకులును (అప్పటికే అమ్మబడనట్లయితే) విడుదల చేయుట లేక అమ్మకపు ఖర్చులను మరియు ఇతర ఇన్సిడెంటల్ చార్జీలు మరియు నిర్బంధం యొక్క సమయం నుండి అమ్మకం యొక్క సమయం వరకు అయిన ఖర్చులను తగ్గించిన తర్వాత అమ్మకపు రాబడులను వాపసు చేయుట. | R. 46 (15)<br>R. 47 (2) |

యొక్క స్పెసిఫికేషన్స్‌తో తయారు చేయబడిన, 92 జి.ఎస్.ఎం, 150. జి.యస్.ఎమ్ మరియు 220 జి.యస్.యం, క్రాఫ్ట్ పేపర్ అమ్మకాల టర్నోవరుపై ఈ చట్టము యొక్క ఆరవ షెడ్యూలు క్రింద విధించదగిన పన్నురేటు, రక్షణ శాఖ నుండి వాడకపు దారు ధృవపత్రంని (యూజర్ సర్టిఫికెట్) దాఖలు చేయవలెను-అన షరతుకు లోబడి రూపాయి నందు 8 పైసలుగా నిర్ణయించటమైనది.

ఈ నోటిఫికేషను 1 ఏప్రియల్ 1995 నుండి అమలులోనికి వచ్చును.

**నోటిఫికేషను-VI:** జి.వొ.యం.యస్.నెం. 1613, రెవెన్యూ తేది: 31-10-1984 కు అధిక్రమణముగా చెప్పబడిన చట్టము యొక్క ఆరవ షెడ్యూలు క్రింద గాజు సీసాల అమ్మకం పై రాష్ట్రము నందలి ప్రతి అమ్మకపు స్థానము వద్ద విధించదగిన పన్నును రూపాయినందు 9 పైసలుగా 1 ఏప్రియల్ 1995 నుండి అమలులోనికి వచ్చే విధముగా నిర్ణయించినారు.

**నోటిఫికేషను-VII:** జి.వొ.యం.యస్.నెం. 1017 రెవెన్యూ తేది: 30-8-1985 కు అధిక్రమణముగా కాపర్ ఇన్ గాట్స్ (వైర్ బార్స్) అమ్మకాలపై, కాపర్ ఇన్‌గాట్స్ (వైరుబార్స్) యొక్క కొనుగోలు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోనే జరగవలెను మరియు అట్టి ఇన్‌గాట్స్ వైరు రాడ్లుగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము నందే తయారు చేయబడవలెను అను షరతుకు లోబడి ఈ చట్టము క్రింద విధించదగిన పన్నురేటును రూపాయి నందు 5 పైసలుగా నిర్ణయించారు. ఈ నోటిఫికేషను 1 ఏప్రియల్ 1995 నుండి అమలులోనికి వచ్చును.

**నోటిఫికేషను-VIII:** జి.వొ.యం.యస్.నెం.381 రెవెన్యూ తేది: 9-4-1986 కు అధిక్రమణముగా రాష్ట్రము నందు నెలకొని ఉన్న కుటీర మరియు చిన్నతరహా పరిశ్రమల చేత తయారు చేయబడిన పెయింటు, అమ్మకాలపై ఈ చట్టము యొక్క ఆరవ షెడ్యూలు క్రింద విధించదగిన పన్ను రూపాయి నందు 7 పైసలు రేటు చొప్పున 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధముగా నిర్ణయించబడింది.

**నోటిఫికేషను-IX:** జి.వొ.యం.యస్.నెం. 1515, రెవెన్యూ, తేది: 24-10-1986 కు అధిక్రమణముగా ఫ్తాలిక్ ఎన్ హైడ్రైడ్ అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్ను రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద రూపాయి నందు 5 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను-X:** జి.వొ.యం.యస్.నెం. 1389, రెవెన్యూ, తేది: 24-10-1986 కు అధిక్రమణముగా హెక్సేను (ఒక పెట్రో రసాయన ఉత్పత్తి) యొక్క అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్ను రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకము స్థానము వద్ద రూపాయి నందు 4 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధముగా నిర్ణయించారు.

**నోటిఫికేషను-XI:** జి.వొ.యం.యస్.నెం. 537, రెవెన్యూ, తేది: 9-6-1987 కు అధిక్రమణముగా స్ట్రా, బగస్సీ, వ్యర్థ కాగితము మరియు సాంప్రదాయేతర ముడి పదార్థాలని ఉపయోగించుచూ చిన్న పేపరు మిల్లు చేత తయారు చేయబడిన పేపరు బోర్డుల అమ్మకాలపై ఈ చట్టము యొక్క ఆరవ షెడ్యూలు క్రింద విధించదగిన పన్నురేటును రూపాయినందు 7 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XII :** జి.వొ.యం.యస్.నెం. 434, రెవెన్యూ తేది : 17-6-1988 కు అధిక్రమణముగా సినిమాటోగ్రఫిక్ ఫిల్మ్‌ల రాష్ట్రము నందలి అమ్మకాలపై ఈ చట్టము క్రింద రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద విధించదగిన పన్నును రూపాయి నందు 8 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధముగా నిర్ణయించటమైనది.

జి.వో.యం.యస్.నెం. 401, రెవెన్యూశాఖ తేది, 16-8-1995

నోటిఫికేషను IV : దీని ద్వారా జి.వో.యం.యస్.నెం. 252, రెవెన్యూ (సి.టి.-II) శాఖ తేది 19-5-1995 నందు జారీ చేయబడిన XIII వ నోటిఫికేషను నందున్న పట్టిక యందు **29.డి-ఆయిల్డ్** కేకులు అను అంశము తొలగించబడినది.

**నోటిఫికేషను XIV:** జి.వో.యం.యస్.నెం. 130, రెవెన్యూ, తేది: 14-2-1989 నందు జారీ చేయబడిన నోటిఫికేషను II కు అధిక్రమణముగా ధనియాలు యొక్క రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద పన్నురేటు రూపాయినందు 6 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XV :** జి.వో.యం.యస్.నెం. 130, రెవెన్యూ, తేది: 14-2-1989 నందు జారీ చేయబడిన నోటిఫికేషన్ III కు అధిక్రమణముగా ఈ చట్టము యొక్క మూడవ షెడ్యూలు యొక్క 16వ అంశముగా చదవదగిన గోధుమ (ట్రిటి కమ్-వల్గేర్-టి, కంపాక్టమ్-టి, స్ఫెరో కోకమ్-టి, ఏ స్టివమ్ యల్.టి. డైకోకమ్) విషయములో చెల్లించవలసిన పన్ను రేటును రూపాయినందు 3 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధముగా నిర్ణయించారు.

ప్రథమ అమ్మకపు స్థానము వద్ద ఈ చట్టము క్రింద విధించదగిన పన్నును రూపాయినందు 4 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చు విధముగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XVI :** జి.వో.యం.యస్.నెం. 572, రెవెన్యూ, తేది: 8-6-1989 కు అధిక్రమణముగా, ఈ చట్టము యొక్క ఆరవ షెడ్యూలు యొక్క 8వ అంశముగా చదవదగిన, ఈ రాష్ట్రమునందు తయారు చేయబడిన "లేకర్పు" యొక్క, రాష్ట్రము నందలి అమ్మకాలపై విధించదగిన పన్నురేటును రూపాయి నందు 7 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చు విధముగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XVII :** జి.వో.యం.యస్.నెం. 1058, రెవెన్యూ, తేది: 24-10-1989 కు అధిక్రమణముగా వ్యవసాయ ప్రయోజనముల కొరకు వాడబడు 7.5 హెచ్.పి. విద్యుత్ మోటార్ల యందు ఉపయోగించబడు స్టార్టర్ల అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్ను రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద రూపాయినందు 7 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XVIII :** జి.వో.యం.యస్.నెం. 73, రెవెన్యూ, తేది: 31-1-1990 కు అధిక్రమణముగా స్టెన్సిల్స్, కార్బన్ పేపర్లు మరియు టెలెక్స్ రోల్సు యొక్క అమ్మకాలపై ఈ చట్టము యొక్క ఆరవ షెడ్యూలు క్రింద విధించదగిన పన్నును రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద రూపాయినందు 7 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XIX :** జి.వో.యం.యస్.నెం. 895, రెవెన్యూ, తేది: 5-10-1991 కు అధిక్రమణముగా పవరు టిల్లర్ల అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్నును రూపాయి నందు 4 పైసలుగా మరియు పవరు టిల్లర్లకు వాడబడు ట్రైలర్లతో సహా వాటి యొక్క యాక్సెసరీలు, అటాచ్‌మెంట్లు, స్పేర్ పార్టుల అమ్మకాలపై ఈ రాష్ట్రము నందలి ప్రథమ అమ్మకపు స్థానము వద్ద ఈ చట్టము క్రింద విధించదగిన పన్నును రూపాయి నందు 7 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XX :** జి.వో.యం.యస్.నెం. 599, రెవెన్యూ, తేది : 30-6-1993 కు అధిక్రమణముగా ఈ చట్టము యొక్క ఆరవ షెడ్యూలు యొక్క 5, 5ఎ మరియు 5బి అంశములుగా చదవబడు హెూజరీ సరుకుల

**నోటిఫికేషను XXVIII.** జి.వొ.యం.యస్.నెం.1202, రెవెన్యూ, తేది 15-12-1994 కు అధిక్రమణముగా

ఎ) సిలిండరు లైనర్ల తయారీ నందు వాడబడిన ఇనుము మరియు రఫ్ కాస్టింగుల వంటి ముడి పదార్థముల పై చెల్లించబడిన పన్ను యొక్క ఎట్టి సెట్-ఆఫ్ ఉండదని;

బి) రఫ్ కాస్టింగుల అమ్మకాలకు సంబంగించిన పన్ను చెల్లింపు నుండి ఎట్టి మినహాయింపు ఉండదని; మరియు

సి) పన్నుకు గురి అయిన రఫ్ కాస్టింగుల నుండి తయారు చేయబడిన సిలిండరు లైనర్ల రాష్ట్రము నందలి అమ్మకాలు రూపాయి నందు 4 పైసలు చొప్పున, అవి మోటారు భాగములు లేక యంత్రసామాగ్రి భాగాలుగా ఎట్లా ఉపయోగించబడిన వన్న వాస్తవముతో సంబంధం లేకుండా, పన్ను విధింపుకి గురిఅవును.

ఇది 1-4-1995 నుండి అములులోకి వచ్చును.

**నోటిఫికేషను XXIX.** జి.వొ.యం.యస్. 677, రెవెన్యూ తేది 17-7-1990 కు అధిక్రమణముగా ప్రథమ అమ్మకపు స్థానం వద్ద ఈ చట్టము క్రింద విధించదగిన పన్నును రూపాయి నందు 4 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చు విధంగా నిర్ణయించారు.

**నోటిఫికేషను XXX.** జి.వొ.యం.యస్.నెం. 864, రెవెన్యూ, తేది 7-9-1993 కు అధిక్రమణముగా క్రింది నిర్వచించబడిన విధమైన ఎలక్ట్రానిక్ సరుకుల అమ్మకాల పై రాష్ట్రమునందలి ప్రథమ అమ్మకపు స్థానము నందు ఈ చట్టము క్రింద విధించదగిన పన్ను రూపాయి నందు 4 పైసలుగా 1-4-1995 నుండి అమలులోనికి వచ్చే విధంగా నిర్ణయించారు.

2. ఈ నోటిఫికేషను ప్రయోజనార్థము "ఎలక్ట్రానిక్ సరుకులు" అనగా ఎలక్ట్రానిక్ సిస్టమ్స్, అప్లయెన్సెస్, ఆపరేటర్స్, ఎలక్ట్రానిక్ సూత్రములపై పనిచేయు సామాగ్రి మరియు అన్ని రకముల ఎలక్ట్రానిక్ కాంపొనెంటుల, పార్టులు, మరియు మెటీరియల్స్ మరియు;

i) వినియోగదారు - ఎలక్ట్రానిక్స్;

ii) ఎలక్ట్రానిక్ పరీక్ష మరియు కొలమానపరికరాలు;

iii) వైద్య సంబంధమయిన ఎలక్ట్రానిక్ సామాగ్రి;

iv) ఎలక్ట్రానిక్ విశ్లేషణ పరికరాలు;

v) అణు సంబంధమయిన, భూగర్భ శాస్త్ర సంబంధమయిన మరియు ఇతర ప్రత్యేక ఉప యోగాల కోసం వాడునట్టి ఎలక్ట్రానిక్ ఎక్విప్‌మెంటు/పరికరాలు;

vi) ఎలక్ట్రానిక్ ప్రాసెస్ కంట్రోలు ఎక్విప్‌మెంటు;

vii) పవరు ఎలక్ట్రానిక్ ఎక్విప్‌మెంటు;

viii) పారిశ్రామిక ఆటో మిషను ఎక్విప్‌మెంటు;

ix) ఎలక్ట్రానిక్ డేటా ప్రాసెసింగ్ సిస్టమ్స్ మరియు ఎలక్ట్రానిక్ ఆపీసు-ఎక్విప్‌మెంటు;

x) ఎలక్ట్రానిక్ ప్రసార సాధన ఎక్విప్‌మెంటు;

xi) ఎలక్ట్రానిక్ కమ్యూనికేషను ఎక్విప్‌మెంటు; మరియు

xii) ఎలక్ట్రానిక్ ఏరోస్పేస్ మరియు రక్షణ ఎక్విప్‌మెంటు

**నోటిఫికేషను XXXI** : జివొ.యం.యస్.నెం. 656, రెవెన్యూ తేది 4-7-1994 కు అధిక్రమణముగా మెసర్స్ అన్నపూర్ణ ఫాయిల్సు లిమిటెడ్, బషీర్‌బాగ్, హైద్రాబాదు వారిచేత తయారు చేయుబడి,. అమ్మబడు అల్యూమినియం ఫాయిల్సు, స్ట్రిప్స్ మరియు లామినేట్సు యొక్క అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్నుని రూపాయి

సి) ముత్యాల కన్నా భిన్నమయిన విడి ప్రెషస్ స్టోన్స్ అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్ను తగ్గించబడిన రేటయిన 2 శాతముగా నుండును.

ఇది 1-4-1995 నుండి అమలులోనికి వచ్చును.

**నోటిఫికేషను XXXV** : రాష్ట్రము నందలి బంగారము యొక్క కొనుగోలుపై పన్ను విధించబడినపుడు, అట్టి పన్ను చెల్లించబడిన బంగారము నుండి తయారు చేయబడిన మరియు రాష్ట్రము నందు అమ్మబడిన జ్యూయలరీ అమ్మకాలపై ఈ చట్టము క్రింద విధించదగిన పన్ను నుండి అట్టి బంగారముపై చెల్లించబడిన పన్ను మొత్తము తగ్గించబడవలెను.

ఇది 1 ఏప్రియల్ 1995 నుండి అమలులోకి వచ్చును.

**నోటిఫికేషను XXXVI** : జి.వొ.యం.యస్.నెం. 1272, రెవెన్యూ, తేది 31-12-1994 కు అధిక్రమణముగా

ఏ రకమయిన శక్తి లేక ఇంధనముతో నయినా ప్రొపెల్ చేయబడు లేక ఆపరేటు చేయబడు అన్ని రకముల యంత్ర సామాగ్రి అమ్మకము నిమిత్తము రాష్ట్రము నందు సరకుల తయారీ యందు అట్టి యంత్ర సామాగ్రి యొక్క కాంపోనెంటు పార్టుల, స్పేర్ పార్టులు మరియు యాక్సెసరీలు మినహా, కి సంబంధించి రాష్ట్రము నందు బాధ్యమయ్యే పన్ను ఈ క్రింది షరతులకు లోబడి తగ్గింపు రేటయిన రూపాయి నందు 3 పైసలుగా ఉండును.

1. ఈ రాయితీ పన్ను రేటును క్లెయిమ్ చేయుచున్న వ్యక్తి, అట్టి యంత్ర సామాగ్రిని కొనుగోలు చేయుచున్న డీలరు, ఈ చట్టము క్రింద రిజిస్టరయిన అధికార పరిధి యొక్క అసెసింగ్ అథారిటీ చేత యథాక్రమముగా ఎటెస్ట్ చేయబడిన, ప్రెస్క్రైబ్ చేయబడిన నమూనా యందు ఒక ధృవపత్రమును కొనుగోలు దారు నుండి దాఖలు చేయవలెను.
2. అమ్ముచున్నట్టు వంటి డీలరు కొనుగోలు చేయుచున్న డీలరు నుండి రిజిస్ట్రేషను ధృవపత్రము యొక్క ఒక కాపీని పొందవలెను.
3. ఇది 1-4-1995 నుండి అమలులోనికి వచ్చును.

## ధృవపత్రము

ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టము క్రింద ------------------------------- సంఖ్యతో రిజిస్టరయిన ------------------------------------ వద్ద ఫ్యాక్టరీ కలిగిన ------------------------------ ---- (రిజిస్టర్డ్ కార్యాలయము) ---------------------------------- వద్ద ఉన్నటువంటి తయారీ దారు డీలర్లమయిన ---------------------------- (పేరు మరియు హోదా) అను నేను/మేము, ఇందు మూలముగా బిల్లు/ ఇన్వాయిస్ / నగదు రశీదు సంఖ్య -------------------------, తేది ---------------------------- నందు నిర్దిష్ట పరచబడిన, -------------------------- నుండి నా/మా చేత కొనుగోలు చేయబడిన యంత్రసామాగ్రి రాష్ట్రమునందున్న నా యూనిట్ చేత ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను చట్టము క్రింద పన్నుకి బాధ్యమయ్యే సరుకుల తయారీ నందు వాడబడుటకు ఉద్దేశింపబడినవని ధృవీకరించున్నాను/ము.

కొనుగోలు చేయుచున్న డీలరు సంతకం

## ధృవీకరణ

పైన డీలర చేత పేర్కొనబడిన వివరములు నాకు తెలిసినంతవరకు సరిఅయినవి మరియు యథార్థము అయినవి మరియు అతను/వారు నా రోల్సు పై రిజిస్టరయి ఉన్నారు.

అసెసింగ్ అథారిటీ యొక్క
సంతకము/హోదా.

ప్రత్యేక అనుబంధము

| | |
|---|---|
| అనుగుణమైన నమోదు | CONFIRMITY |
| అనుగుణ్యత | GRANT |
| అనుదానము చేయు | SUPPLEMENT |
| అనుబంధము | SUPPLEMENTS |
| అనుబంధములు | ADMIT |
| అనుమతించు | RATIFY |
| అనుమోదించుట | ADOPT |
| అనువర్తింపచేయు | IN PURSUANCE |
| అనుసరించి | OF<br>ADAPT |
| అనుసూచి | SCHEDULE |
| అపరాధకార్యము | COMMISSION OF<br>OFFENCE |
| అపరాదజప్తు | FORE FEIT |
| అపరాధియైన | GUILTY |
| అపరాలు | PULSES |
| అపసామాన్యము | ABNORMAL |
| అప్రధానము | INCIDENTAL |
| అప్పగించు | DELIVERY,ENTRUST |
| అప్పిలేటు | APPELLATE |
| అప్పీలు | APPEAL |
| అప్పీలుకుసంబంధించిన | APPELLATE |
| అప్పుడప్పుడు | OCCASSIONAL |
| అప్పుపత్రములు | LOAN BONDS |
| అపేక్షించుట | REQUIRE |
| అపేక్షితము | REQUIREMENT |
| అబద్ధం | LIE |
| అభ్యర్థన | CLAIM |
| అభ్యర్థించు | DEMAND |
| అభ్రకము | MICA |
| అభినిశ్చయించు | ASCERTAIN |
| అభినిశ్చిత | ASCERTAINED |
| అభినిశ్చితమైన | ASCERTAINABLE |
| అభివృద్ధి | IMPROVEMENT,<br>DEVELOPMENT |
| అభియోగము నడుపుట | PROSECUTION |
| అమరిక | FITTING OUT |
| అమలు పరచు | COMPLY WITH,<br>ENFORCING,<br>GIVE EFFECT TO |
| అమ్మకందారు | EXECUTOR |
| అమ్మకపు రాబడులు | SALE PROCEEDS |
| అమ్మకము | SALE |
| అముఖ్య | INCIDENTAL |
| అర్హత | ELIGIBILITY |
| అరికెలు | KODAN |
| అర్జీ | PETITION |
| అర్హుడగు | ELIGIBLE |
| అర్హుడు | ENTITLE |
| అలంకరణ సామాగ్రి | COSMETICS |
| అల్లము | GINGELLY, GINGER |
| అవకలజము | DERIVATIVES |
| అవకాశము | SCOPE, OPPORTUNITY |
| అవధి | LIMIT |
| అవరోధము | BARRIER |
| అవవినియోగము | MISUSE |
| అవసరమైన మార్పులతో సందర్భోచితంగా | MUTATIS<br>MUTANDIS |
| అశక్తుడైన | IN CAPACITATED |

ఉత్తర్వు : ORDER
ఉత్తర్వు ద్వారా : BY ORDER
ఉత్తర్వు పూర్వకంగా : BY ORDER
ఉత్తరోత్తర : SUCCESSIVE
ఉత్తీర్ణుడైన : PASSED
ఉదజనీకృతమైన : HYDRO-GENATED
ఉదహరించు : QUOTE, MENTION
ఉదాహృతి : EXTRACT
ఉద్ధరించు : QUOTED
ఉద్దేశ్యము : INTENTION
ఉద్దేశ్యము కల్గిన : INTENDING
ఉద్యోగమిచ్చు : APPOINT
ఉద్యోగము : ENGAGE
ఉద్యోగ సిబ్బంది : ESTABLISHMENT
ఉపకరణము : INSTRUMENT
ఉపకరణాలు : EQUIPMENT, APPARATUS, INSTRUMENTS
ఉపక్రమించు : PROCEED
ఉపబంధన : PROVISION
ఉపబంధనలు : PROVISIONS
ఉపసంహరణ : REVOKE
ఉపేక్షించిన : DEFAULT
ఉల్లంఘనము : BREACH OF DUTY

## ఊ

ఊక : HUSK

## ఋ

ఋజువు చేసిన : PROVED
ఋణపత్రము : PROMISORY NOTE

## ఎ

ఎండ్రకాయలు : LOBSTERS
ఎండిన : DRIED
ఎండిన పండ్లు : DRY FRUITS
ఎంపిక చేయు : OPT
ఎదురు కక్షి : VERSUS
ఎదురు ప్రతి : COUNTER FOIL
ఎన్నుకొనే : ELECT
ఎముకల పొడి : BONE MEAL
ఎరుక : KNOWLEDGE
ఎల్లగిన విత్తనములు: RAPE SEED

## ఏ

ఏక మొత్తము : LUMPSUM
ఏకోత్పత్తి : COGNATE

## ఒ

ఒప్పందము లేక : AGREEMENT
ఒప్పంద పత్రము

## క

కంపెనీ : CONCERN
కడ్డీ బంగారము : BULLION
కడ్డీలు : RODS
కడుగు : WASHED (COTTON)
కథనాత్మకముగా : NARRATIVE
కన్సైన్‌మెంట్ : CONSIGNMENT
కమ్మీలాంటి యంత్రభాగం: SHAFTS
కర్తవ్య ఉల్లంఘన : BREACH OF DUTY
కలధేతము : SPECIE
కలుపు : INCLUDES

| | |
|---|---|
| ఖాద్యేతర తైలము | : NON-EDIBLE OIL |
| ఖాయపరచు | : CONFIRM |

## గ

| | |
|---|---|
| గచ్చు | : PLASTERING |
| గణక సంవత్సరము | : ACCOUNTING YEAR |
| గణించు | : CALCULATED |
| గమ్యము | : DESTINATION |
| గరిష్ఠ మొత్తము | : GRAND TOTAL |
| గసగసాలు | : POPPYSEEDS |
| గ్రహించు | : RECEIVE |
| గాజుసామాను | : GLASS WARE |
| గ్రాహకుడు | : CONSIGNEE |
| గింజ | : KERNEL |
| గిరాకీదారు | : CUSTOMER |
| గుంజు | : KERNEL |
| గుజ్జు | : KERNEL |
| గుణము | : QUALITY |
| గైర్హాజరగు | : DEFAULT |
| గోప్యత | : CONCEALMENT |
| గోచరమయ్యే | : CONSPICUOUS |
| గోడలకు వేయు ఒక రకమైన మందు | : DISTEMPER |
| గోదాము | : GODOWN |
| గోనెసంచులు | : GUNNIES |

## ఘ

| | |
|---|---|
| ఘనీభవించిన | : CONDENSED |

## చ.

| | |
|---|---|
| చట్టబద్ధ సంఘముగా ఏర్పడిన | : INCORPORATE |
| చట్టము చేయు | : ENACT |
| చదరాలు | : SQUARES |
| చర్యాయోగ్యమైన | : ACTIONABLE |
| చలాయింపు | : EXERCISED |
| చాలినంత | : SUFFICIENT |
| చింతపండు | : TAMARIND |
| చిరుధాన్యములు | : MILLETS |
| చిరుశనగ | : MASUR LENTIL |
| చూపబడిన | : SET OUT |
| చెప్పుట | : STATE |
| చెరిగిపోవడం | : DEFACE |
| చెల్లించదగిన | : PAYABLE |
| చెల్లించవలసిన | : PAYABLE |
| చెల్లింపు | : REMIT, PAYMENT |
| చెల్లింపు బాధ్యత | : DISCHARGE OF LIABILITY |
| చేపట్టుట | : UNDERTAKE |
| చేర్పు | : ATTACH |

## జ

| | |
|---|---|
| జతచేయు | : ACCOMPANAID BY |
| జతపర్చు | : APPEND |
| జప్తుచేయు | : ATTACH |
| జమరశీదు | : CREDIT NOTE |
| జరిమానా | : PENALTY |
| జరుగుతుండగా | : PENDING |
| జరుపబడు | : EFFECT |
| జలరహితం చేయు | : DE HYDRATE |
| జవాబుదారీ | : LIABILITY |
| జాజికాయ | : NUTMEG |
| జాతీయపొదుపు పత్రములు | : NATIONAL SAVINGS CERTIFICATE |

తారు : ASPHALT
తావు : SPOT
తిండిపెట్టే : CATERING
తిరస్కరించు : REJECT
తిరస్కారము : REJECTION
తీర్పు : FINDING
తీవ్ర : SEVERE
తీసివేయు : DISPENSE
తీసివేత : DEDUCTION
తీసుకొను : RECEIVE
తీసుకొనిపోవు : CARRYING
తుక్కు : SCRAP
తుదకు : FINALLY
తూలిక : BRUSH
తృణ ధాన్యము : CEREALS
తెలియజేసిన : SIGNIFY
తెలియచేయు : COMMUNICATE
తెలిసియున్నప్పటికి : KNOWINGLY
తృణధాన్యములు : CEREALS

## ద

దంతము : IVORY
దత్తము చేయబడు : CONFER
:దస్తావేజు పత్రము : BOND
దళారి : COMMISSION
దాఖలు చేయు : PRODUCE
దారిచూపు : CONDUCT
దాల్చిన చెక్క : CINAMON
దావా : WRIT, CASES
ద్వారా : BY WAY OF
దీపములు : LAMPS
దుర్వినియోగము : MISUSE
దుష్ప్రేరణ : ABETMENT
దూలములు : BEAMS
దేశీయ : INDIGENEOUS
దోషము : GUILTY
దోషస్థాపక : ON CONVICTION
దోషిగా కనుగొన్న : FOUND GUILTY
దోషిత్వ నిర్ణయం : ON CONVICTION
దోషియైన : GUILTY

## ధ

ధనియాలు : CORIANDER
ధర : COST
ధర్మకర్త : TRUSTEE
ధర్మాసనము : BENCH
ధాన్యము : PADDY
ధృడం చేయు : REINFORCE
ధృవపరచు : AFFIRM
ధృవీకరించు : ATTEST
ధ్వంసము చేయు : DESTROY,DESTROYED

## న

నకలు చేయు : DUPLICATE
నగదు చీటి : CASH MEMORANDUM
నడపు : CONDUCT
నమ్మదగిన కారణం : REASON TO BELIEVE
నల్లమందు : OPIUM
నవీకరణ చేయు : RENEW
నష్టపరిహార బాండు : INDEMNITY BOND
నామ నిర్దేశం చేయు : NOMINATE

| | | |
|---|---|---|
| పరికరములు | : | INSTRUMENTS, EQUIP MENT, ARTICLES |
| పరిగణన | : | TREATMENT |
| పరిచ్ఛేధము | : | SECTION |
| పరిణామదశ | : | TRQNSITION |
| పరిమాణాత్మకమైన | : | QUANTITATIVE |
| పరిధి | : | EXTENT |
| పరిమళము | : | PERFUME |
| పరిమితి | : | RESTRICTION; LIMIT LIMITATION |
| పరిరక్షించు | : | PRESERVE |
| పరిశీలన | : | SCRUTINY, PERUSE, FINDING, VERIFICATION |
| పరిశీలించు | : | EXAMINE |
| పరిశుద్ధి | : | RECTIFICATION |
| పరిష్కరించు | : | CLEAR |
| పరిష్కారము | : | DISPOSAL |
| పరివర్తన | : | VARIATION |
| పరిసమాప్తకుడు | : | LIQUIDATOR |
| పరిసమాప్తి | : | LIQUIDATION |
| పరిసమాప్తి చేయు | : | WIND UP |
| పరీక్షించు | : | EXAMINE |
| పరుపు | : | MATTRESS |
| పలక | : | PLANK |
| పసుపు | : | TURMERIC |
| పళ్ళచక్రము | : | TURBINE |
| పంట | : | PRODUCE |
| పంపు | : | TRANSMIT, DESPA-TCH, SEND |
| ప్రకటన | : | NOTIFICATION |
| ప్రకటించు | : | DECLARE, DISCLOSE |
| ప్రక్రియ | : | PROCEDURE |
| ప్రఖ్యానము | : | PUBLICITY |
| ప్రచారము | : | PUBLICITY |
| ప్రచురించు | : | DECLARE, PUBLISH |
| ప్రజాహితము | : | PUBLIC INTEREST |
| ప్రత్యక్ష | : | PATENT (DRUG), APPARENT |
| ప్రతికల్పన | : | PROVISION, PROVISO |
| ప్రతికూలత | : | DIS ADVANTAGE |
| ప్రతికూలము చేయు | : | REVERSE |
| ప్రతిఘటన | : | OBSTRUCTION |
| ప్రతిజ్ఞ | : | AFFIRMATION |
| ప్రతిజ్ఞ లేక ప్రమాణ పూర్వకముగా | : | ON OATH AND AFFIRMATION |
| ప్రతిజ్ఞాపనము | : | AFFIRMATION |
| ప్రతిదినము | : | DAILY |
| ప్రతిదినము జరుగునట్టి | | DAILY |
| ప్రతినిధి | : | AGENT |
| ప్రతినిషేధించు | : | DEBAR |
| ప్రతిపాదన | : | OFFER |
| ప్రతిపాదనము చేయు | : | OFFER |
| ప్రతిపాదించిన | : | PROPOSED |
| ప్రతిఫలము | : | REMUNERATION, CONSIDERATION |
| ప్రతిబంధకము | : | RESTRICTION, BAR |
| ప్రతిసంహరణ | : | REVOKE |

పున: పరిశీలన : REVISION
పున:పరిశీలించు : REVISE
పునర్నవము : RENEW
పునరావాస : REHABILITATION
సహాయకాలు : AIDS
పునరీక్షణ : REVIEW
పునరుత్పత్తి చేయు : RE PRODUCING
పురోగమించు : PROCEED
పూర్వ : PRECEEDING, PREVIOUS, FORMER
పూర్వగత : PRECEEDING
పెసలు : GREEN GRAM
పెంచుట : ENHANCE
పెంపు : IMPROVEMENT
పెంపుదల : ENHANCEMENT
పేరిట : IN FAVOUR OF
పేరు ద్వారా : BY NAME
పేరు నమోదు : ENROLLMENT
పేరు నమోదు చేయు : ENROLLING
పేర్కొను : MENTION, ENUMERATE
ప్రేరణ : MOTIVE, CAUSE
పైన చెప్పబడిన : FORE GOING, AFORESAID
పొగాకు : TOBACCO
పొట్టు : HUSK
పొడి : POWDER
పొడిచేయు : GRIND
పొరపాటుతో కూడిన : ERRONEOUSLY
పొలం పంట : FARM PRODUCE
పొందు : RECEIVE
పొందుపరచు : PROVIDED FOR
ప్రొద్దు తిరుగుడు పుష్ప: SUNFLOWER
ప్రొసీడింగు : PROCEEDING
పోగొట్టుకొను : LOST
పోత ఇనుము : CAST IRON
పోషణ : MAINTANANCE
పోషించు : MAINTAIN
పౌరన్యాయ ప్రక్రియాస్మృతి: C.P.C

## ఫ

ఫలము : PROFIT
ఫలసాయము : PRODUCE
ఫలితము : RESULT
ఫలితముగా : IN CONSEQUENCE OF
ఫలితాంశము : ISSUE

## బ

బట్వాడా : DELIVERY
బట్వాడా నోటు : DELIVERY NOTE
బఠాణి గింజ : PEANUT
బద్దలు కొట్టు : BREAK OPEN
బద్ధత కలిగి యుండు : BINDING ON
బదిలీకర్త : TRANSFERER
బదిలీ స్వీకరించు వ్యక్తి : TRANSFEREE
బయానా సొమ్ము : EARNEST MONEY
బలం వల్ల : ONES OFFICE
బలవంత పెట్టు : COMPEL
బలవంతము పెట్టు : COMPELLING
బలవర్ధక ఔషధం : TONIC

